సంక్షిప్త, వర్ణనాత్మక

# సంస్కృత వ్యాకరణము

(A Concise and Descriptive Grammar of Sanskrit)



## మొదటి భాగము

**(Part I)**




గ్రంథకర్త:

బేతనభట్ల విశ్వనాథము

*M. A., Ph D.,*

రిటైర్డ్ ప్రొఫెసర్, గణితశాఖ,

ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు. (ఆం. ప్ర)

సంక్షిప్త, వర్ణనాత్మక

# సంస్కృత వ్యాకరణము

(A Concise and descriptive Grammar of Sanskrit)

మొదటి భాగము

**( Part I )**


గ్రంథకర్త :

## డా. బేతనభట్ల విశ్వనాథము

*M. A., Ph. D;*

రిటైర్డ్ ప్రొఫెసర్, గణితశాఖ,

ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు. (ఆం. ప్ర)

డా॥ బి ఆర్. శాస్త్రి; సంస్కృతవిభాగాధ్యక్షులు,
ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు.

# భూమిక

భారతీయశాస్త్రములలో వ్యాకరణమునకు ప్రముఖమగు స్థానమీయబడెను. "వ్యాకరణము వేదమునకు ముఖము" అని పాణినీయ శిక్ష. (ముఖం వ్యాకరణం స్మృతమ్). "అన్ని విద్యలకూ వ్యాకరణమే మూలము. కావున "వైయాకరణులే విద్వాంసులలో మొదట పరిగణింపబడతగినవారు." అని ఆనందవర్ధనుడు అభిప్రాయపడెను. (ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః, వ్యాకరణ మూలత్వాత్ సర్వవిద్యానామ్—ధ్వన్యాలోకము, ఉద్ద్యోతము:)

పదములనిర్మితినీ, వ్యవహృతినీ వివరించు శబ్దానుశాసనమున ప్రాచీనభారతీయులు చేసినకృషిఅగాధము, అపారము, అనుపమము. ఈ విషయమునే A. A. Macdonell ఇటుల చెప్పెను.)

'Grammar, called in Sanskrit vyakarana, or analysis, is by the Indians regarded as the first and most important of all the sciences, because it is the foundation of all of them. The greatest achievement of Indian science, it has rendered eminent services to western philology The sanskrit grammerians of India were the first to analyse word-forms, to recognize the difference between root and suffix, to determine the functions of suffixes, and on the whole, to elaborate a grammatical system so accurate and complete as to be unparalleled in any other country''. (A. A. Macdonell, India's past, P. 140)

సంస్కృతవ్యాకరణములలో జగత్ప్రసిద్ధికెక్కినది పాణిని విరచితమగు అష్టాధ్యాయి. ఈ గ్రంథరాజమే ఆధునిక భాషా శాస్త్రమునకు కూడా పునాది.

"Comparative philology was born on the day when Sanskrit was opened to the eyes of the western world." (A.V.W. Jackson, Philology, P. 9)

స్వల్పకాయమయ్యునూ మహా విషయకమగు ఈకృతిని చదివి పాణిని అలోకసామాన్య ప్రతిభను నుతిచేయని విజ్ఞులులేరు.

"Generations of such labor must have preceded the writing of the oldest treatise that has come down to us, the grammar of Panini. This grammar which dates from somewhere round 350 to 250 B. C. is one of the greatest monuments of human intelligence. It describes, with the minutest detail, every inflection, derivation, and composition, and every synthetic usage of its author's speech. No other language, to this day, has been so perfectly described".—(Leonard Bloomfield, Lauguage, P. 11)

పాణిని వ్యాకరణము నేటివరకునూ ఇంత బహుళ ప్రచారములో ఉండుటకు ఎన్నోకారణములున్నవి. అందు అతడు వ్యాకరణ రచనలో అవలంబించిన వైజ్ఞానికపద్ధతియే (Scientific method) ముఖ్యకారణమనుట నిర్వివాదము.

సూక్ష్మపర్యాలోకనము, ప్రయోగములను సేకరించుట, విభజనము, వర్గీకరణము, (ధాతుగణపాఠాదులు) సాదృశ్యవైదృశ్యముల గుర్తింపు, ఉదాహరణ ప్రత్యుహారణములు, విశ్లేషణము, సంశ్లేషణము, శబ్దపరిణామము, పరిణామహేతు వివరణ, ఉత్సర్గాపవాద నియమనము, సూత్రీకరణము, ప్రదేశకాలభేదములనుబట్టి భాషాభేదగణన, ఐతిహాసికదృష్టి, (భాషాయాం-ఛందసి) ఉచ్చారణ, ఉచ్చారణ భేదము వలన అర్థములో కలుగుభేదము, సమగ్రత, స్పష్టత, సంక్షిప్తత - ఇవి అష్టాధ్యాయిలో పదే పదే మనకు కానవచ్చుప్రక్రియలు. అనుబంధములు, ప్రత్యాహారములు, సంజ్ఞలు, అనువృత్తి మొదలగునవి ఈ వ్యాకరణమునకు లాఘవము చేకూర్చెను.

పాశ్చాత్త్యులు సంస్కృతభాషకు ఎంతో సేవచేసి యున్నారు. చేయుచున్నారు. శ్రీయుతులు Roth, Grassman. Delbriuck, Avery, Lanman, Olden Berg, Wackernagel, Whitney. Macdonell మొదలగు వేదవిద్వాంసులు వైదిక వాఙ్మయమును అవలోడించి లక్ష్యప్రధానము, సుబోధము అగురీతిని వైదిక వ్యాకరణమును రూపొందించుటలో ఎంతో కృషిచేసిరి. ఇందు బహుళ ప్రచారములోఉన్న గ్రంథములలో పేర్కొనతగినవి—A.A. Macdonellరచించిన (1) Vedic grammar (2) A Vedic grammar

for students. W. D. Whitney విరచితమగు (3) Sanskrit Grammar (including both the Classical language and the older dialects of Veda and Brahmanas.)

డా. బేతనభట్ల విశ్వనాథంగారు తెలుగులో రచించిన "సంక్షిప్త వర్ణనాత్మక సంస్కృతవ్యాకరణము" మొదటిభాగము పైన పేర్కొనబడిన W. D. Whitney వ్యాకరణముపై ఆధారపడిఉన్నది.

ఇందు పన్నెండు అధ్యాయములూ, రెండు అనుబంధములునూ ఉన్నవి. అధునాతన పద్ధతుల ననుసరించి, సంస్కృతభాషా క్రమిక వికాసమును విశదపరచుచు తెలుగులో వ్రాయబడిన మొదటిసంస్కృత వ్యాకరణమిది.

తెలుగులో వైదిక లౌకికసంస్కృతములను ఐతిహాసిక తులనాత్మకదృష్ట్యా అధ్యయనము చేయగోరువారికి ఈ గ్రంథము చాల ఉపయుక్తముగా ఉండును అనుటలో సందేహములేదు.

లక్ష్యమును వీడి సాముచేయు వ్యాకరణము వ్యాకరణమే కాదు. అందుననే లక్ష్యమూ, లక్షణమూ రెండునూ కలిసియే వ్యాకరణమగుట సముచితమని పతంజలి అభిప్రాయపడెను. (లక్ష్య లక్షణే వ్యాకరణమ్. లక్ష్యంచ లక్షణంచ ఏతత్ సముదితం వ్యాకరణం భవతి. కింపునర్లక్ష్యమ్ కిం లక్షణమ్. శబ్దోలక్ష్యః, సూత్రం లక్షణమ్-(మహాభాష్యము, పశ్పశాహ్నికము).

భాష ప్రవాహము వంటిది. అందున మార్పు సహజము. ఒక యుగములో వ్యాకరణసాధువగు శబ్దము మరియొక యుగములో అసాధువగుట కూడ కలదు. భాషలో క్రొత్తక్రొత్త శబ్దములు వచ్చుట కొన్నికొన్ని శబ్దములూ నుడికారములూ పాతబడి ఉపయోగము నుండి తొలగుట, పాతశబ్దములకే క్రొత్త అర్థములు రూపొందుట- మొదలగు చిత్రవిచిత్ర ప్రక్రియలు భాషా చరిత్రలో కానవచ్చును. ఉదాహరణ- 1. యాత్వా 2. అనుయాత్వా 3. యాయ 4 అనుయాయ 5. యాత్వాయ.

పై ఐదు ప్రయోగములూ వేదవ్యాకరణరీత్యా సాధువులు. వాల్మీకి మొదలగు వారి భాషలో 1, 4 వ ప్రయోగములు విరివిగా

కానవచ్చును. 2, 3 రూపములు అసాధువులుకావు. 5 వ రూపము వ్యవహారమునుండి తొలగినది.

కాళిదాసాదుల సంస్కృతములో 1, 4 వ రూపములు మాత్రమే సాధువులు. 2, 3 వ రూపములు అసాధువులు !

ప్రస్తుత వ్యాకరణము ఇట్టి వికాసము నెరుగుటలో సాయపడును.

వేదభాష స్వరలాస్యప్రియ అనుట అతిశయోక్తికాదు. అది వాడుకభాషగా ఉండెను. అందుననే స్వరభేదము వలన పదములలో అర్థభేదము కలుగుచుండెను.

| | |
|---|---|
| రా'జనాపితః | రాజనాపిత'ః |
| శు'ష్యతే | శుష్య'తే |
| ఇ'ంద్రశత్రు | ఇంద్రశత్రు |
| తే' | తే |

ఉదాత్తాది స్వరచిహ్నములతో పదములను సస్వరముగా చూపుట ఈ గ్రంథమందలి మరియొక విశేషము. లౌకికసంస్కృతమున ఇట్టి స్వరప్రక్రియలేదు.

డా. విశ్వనాథంగారు ఈ వ్యాకరణములో ఘోష అను శబ్దము మహాప్రాణము (aspirate) అను అర్థములో ఉపయోగించిరి. కాని సంస్కృతవ్యాకరణ పరంపరలో మృదువర్ణములే (soft letters. sonants) ఘోషలు.

గుర్వపేక్ష లేకుండకూడ ప్రాచీనార్వాచీన సంస్కృత వాఙ్మయమునూ, సంస్కృత వ్యాకరణమునూ అధ్యయనము చేయగోరు వారికి ఈ గ్రంథము మిక్కిలి ఉపయోగకరముగా ఉండును ఇట్టి వ్యాకరణమును తెలుగువారికి రచించి ఇచ్చిన డా. బేతనభట్ల విశ్వనాథంగారు ప్రశంసార్హులు.

# ప్రశంస

"On the tall mountain, cited to the top,
Crowded with culture

... ... ...

All the peaks soar, but one the rest exels,
Our low life was the level's and the nights,
He is for the morning

... ... ...

"Time to taste life" amother would have said,
"Up with curtim".

... ... ...

This man said rather "Actual life comes next!
Patience a moment"

"This man decided not to live but to know".

అని రాబర్ట్ బ్రౌనింగ్ అన్నమాటలు డాక్టర్ బేతనభట్ల విశ్వనాథమ్ గారికి పూర్తిగా వర్తిస్తాయి. లేకపోతే గణితశాస్త్ర అధ్యయన అధ్యాపనాలలో తలపండి, ఆధునిక గణితశాస్త్రంలో "ఎనాలిసిస్ ఆఫ్ ది రియల్ వేరియబుల్స్"లో సిద్ధాంతవ్యాసాలు వెలువరించి, గణితదృష్టితో సంగీతశాస్త్రాన్ని సాధనచేసి, వైణికులై, తత్సాధనజనిత స్వర సాన్నిహిత్యంతో వేదస్వరాల పుట్టుపూర్వాల గవేషణకు పూనుకొని, తజ్జనితాభిరుచితో సంస్కృత వైదిక లౌకిక వాఙ్మయవ్యాకరణాలలో తలమునకలయి తెలుగువారికి తొలిసారిగా ఈ 'సంక్షిప్తవర్ణనాత్మక సంస్కృత వ్యాకరణము' అందించడం సంభవించేదికాదు. ఈ సందర్భంలో తిలక్ పండితుడు అన్నమాటలు—"సంస్కృత వాఙ్మయం, సంస్కృతి మనకు అర్థంకావాలంటే, గణితశాస్త్రంలో ఆరితేరివుండాలి.

పాశ్చాత్య చరిత్రభూగోళాలు తెలిసివుండాలి'' అన్నవి డాక్టర్ విశ్వనాథంగారిలో నాకు పూర్తిగా నిరూపితమయ్యేయి.

సంస్కృతవాఙ్మయం అతివిస్తృతం. కాని. అది అపభ్రష్టం కాకుండా యథాతథంగానే వ్యవహృతమవుతువుంటే, లోక ప్రమాణంతో సులభంగా మెలకువలు తెలుసుకొనే అవకాశముండేది. ఎప్పుడో వ్యవహృతం కానిభాషలో వేదంవంటి వాఙ్మయం ఆవిర్భవించడం సంభవింపదుగాని, ఏదైవికకారణంవల్లనో అది కాలక్రమాన నానారూపాలు పొందినందున, జనసామాన్యానికి దూరమవుతూ వస్తున్నందున, ప్రాచీనతాస్వరూపస్వభావరక్షణపరాయణులువ్యాకరణాలు నిఘంటువులు మొదలయినవి వ్రాయవలసివచ్చింది. వ్యాకృతికన్న సూత్రీకృతిని ప్రేమించేమనపూర్వులు ధారణకోసం అన్నిటినీ సూత్రీకరించినట్లే, వ్యాకరణాన్ని సూత్రీకరించడం సంభవించింది. కాని ఈ సూత్రీకరణపద్ధతి, భాషావివరణ, మహావిద్వాంసుడు, భాషసంపూర్ణస్వరూపాన్ని ప్రత్యక్షంచేసుకొన్నవాడు అయిన సూత్రకారునికి సులభమేమోకాని పఠిత గురుముఖతః అధ్యయనం చేయకతప్పదు. టీకలు వ్యాఖ్యలు భాష్యాలుతప్పవు. నేడు మానవుని జీవితం వివిధవ్యాపృతులతోసంకీర్ణమయింది. దైనందిన జీవికకోసమే సమయమంతా వ్యయమవుతున్నది. జిజ్ఞాసకు వ్యవధి తగినంతగా లభించడమే కష్టం. కనుక గురువు సన్నిధికివెళ్ళి దినమొక సూత్రంగా చదివి వల్లెవేసే తీరిక ఏదీ? కనుక తాను చదివినదాని సాహాయ్యంతో ఇతర విషయాలను తెలుసుకోవాలి. అలాంటివారికి గుర్వపేక్షలేక గ్రంథాల సాహాయ్యమే అవసరమవుతుంది. ఇదే ఈ వర్ణనాత్మక వ్యాకరణ రచనకు ప్రేరకమైన భావం. ఆప్రేరణతో, వైదిక లౌకిక వాఙ్మయాలను పాశ్చాత్యవిజ్ఞాన మంథానంతో మథించగా తేలిన నవనీత మీగ్రంథం. గణితశాస్త్ర శిక్షితమైన మేధ ఆధునికభాషావిజ్ఞానంతో మేళవించగా కలిగిన సత్ఫల మీగ్రంథం.

ఇది మొదటిభాగం. దీనిలో మొదటిది వర్ణప్రకరణం. వర్ణమాల, ధ్వనులు, ఉచ్చారణ, స్వరము. రెండవ ప్రకరణం సంధి. మూడవది సుబంతప్రక్రియ లేక విభక్తులు - అజంతశబ్దములు, నాల్గవది హలంత శబ్దములవిభక్తిప్రక్రియ. ఐదవదిసర్వనామములు, వానిసుబంతప్రక్రియ. ఆరవది క్రియాపరిచ్ఛేదము ఏడవది వర్తమానకాలము, ఎనిమిదవది పరోక్షభూతకాలము. తొమ్మిదవది భవిష్యత్కాలము, పదవది అద్యతన భూతకాలము పదకొండవది క్రియాజన్య విశేషణ, విశేష్యములు. పన్నెండవది క్రియల గౌణప్రక్రియ. మొదటి అనుబంధంలో ధాతువుల పట్టిక, రెండవఅనుబంధములో వేదముల స్వరము చర్చించబడినవి.

సంస్కృతభాష అనగా కేవలం కావ్యభాషకాదుగదా. కనుక విశ్వనాథంగారు వేద వాఙ్మయాన్నుంచి ఉదాహరించారు. వేదంలోని స్వరంవల్ల ఎదుటివాడు వక్తృవివక్ష తెలుసుకునేవాడు— ఉదాహరణకు రాజపుత్ర అనేపదం. ఇది రాజుపుత్రుడుగ గలవాడు అనే బహువ్రీహిఅయినప్పుడు మొదటిపదం మీదఉదాత్తస్వరం. రాజుయొక్క పుత్రుడు అని తత్పురుషమైనప్పుడు. కడపటిపదం పైస్వరం ఈసంప్రదాయం జనసామాన్యానికి దూరమైనప్పటికీ ప్రయోగాలు, స్వర ప్రాధాన్యం, తెలియడం అవసరం. విసంధి, వ్రాసిన వాఙ్మయంలో వేదమంత్రాలలో వున్నవాటిని పేర్కొన్నారు. ఇది ప్రాకృతంలోనూ వున్నందున అప్పటివాడుకలోవుండివుంటుంది. అక్షరపౌనఃపున్యాన్ని గణితశాస్త్ర దృష్టితో నిరూపించారు. క్రియావరిచ్ఛేదంలో క్రియల బలీకరణ దుర్బలీకరణ పద్ధతిని; వర్తమానార్థక క్రియాప్రక్రియపైనే క్రియలగౌణప్రక్రియలు-కర్మణ్యర్థకాలు, యఙ్ఞంతాలు, ఇచ్ఛార్థకాలు, ప్రేరణార్థకాలు ఆధారపడివున్నదనే కొత్తవిషయాన్ని శాస్త్రీయ పద్ధతిలో నిరూపించారు. పది లకారాలను విభజించుతీరుకూడ కొత్తదే. నాలుగు కాలాలు, ఆరుభావార్థకాలుగనూ ఈ ఆరుభావార్థకాలు ప్రతి

కాలంలోను వుంటాయని వివరించినతీరు కొత్తదే. దశ వికరణాల విభజీకరణం, నామకరణంకూడా కొత్తవి. భూతకాలంలోని అకారాన్ని ఈయన ఉపచయమన్నారు. ఇది వేదవాఙ్మయంలో బహుళంగా లోపించడమూ ఈయన చెప్పారు. ప్రత్యయ పరిభాష మౌలికమే.

ఇన్ని కొత్తవిషయాలతో, కొత్తతీరుతో ఉన్న ఈ గ్రంథం చాలమంది మేధావుల మెదడును పదను జేయడమేకాక, గుర్వపేక్ష లేని అధ్యయనానికి ఎంతగానో తోడ్పడగలదని నా సంపూర్ణ విశ్వాసం.

69, ఆదర్శనగర్,
ఆనంద, విజయదశమి

భాషా సేవకుడు
**తిరుమల రామచంద్ర**



# ప్రస్తావన

ఈ చిన్న గ్రంథము యొక్క ఉద్దేశ్యములు నాలుగు. (1) ఇంగ్లీషు గ్రంథముల జదివి విషయావగాహనము జేసికొనుటకు వలయు భాషా పరిజ్ఞానము లేని తెలుగు విద్యార్థులకు సంస్కృత భాషా స్వరూప ప్రక్రియలు తెలియ జేయుట. (2) కేవలము కావ్యనాటక పురాణాది ఆధునిక సారస్వతమేగాక, వేద, బ్రహ్మణ, ఉపనిషత్, సూత్రములు మొదలగు ప్రాచీన వాఙ్మయము యొక్కయు స్వరూప స్వభావములను వివరించి, భాషలో వచ్చిన మార్పులను దిఙ్మాత్ర ముగానైనను సూచించుట. (3) సంస్కృత వ్యాకరణమును ఆధునిక పద్ధతులచే దేశ భాషయగు తెలుగున వివరించుట. (4) విద్యార్థి స్వయముగా చదివుకొని సంస్కృత భాషా జ్ఞానమును సంపాదించుట కుపయుక్తముగా విషయము నేర్పరించుట.

మనలో పలువురు సంస్కృత వ్యాకరణమును పాణినీయ సూత్రములచే నిర్మింపబడిన భట్టోజీ దీక్షిత విరచితమగు "వైయాకరణ సిద్ధాంతకౌముదీ" చేతనే యభ్యసించుచున్నారు. పాణిని సర్వప్రపంచ భాషా వైయాకరణులలో నగ్రేసరుడనుటకు ఎవరికిని విప్రతిపత్తి లేదు. ఆయన రచించిన యష్టాధ్యాయికి ఆధునిక భాషా శాస్త్రము (Linguistics) ఎంతయో ఋణపడి యున్నది. ఐనను ఆ పద్ధతిని వ్యాకరణము నభ్యసించుటకు బహుకాలము పట్టును. ఇది మన మందర మెరిగినదే. పైగా, మాటలెన్ని జెప్పినను, ఇతరుల యపేక్ష లేక నది పట్టుబడుటకల్ల. ఐతే, గత శతాబ్దమున ఖండాంతరములలో నుద్భవించి దినదినాభివృద్ధి గాంచుచున్న భాషా శాస్త్రములోని యాధునిక పద్ధతులతో ఏ భాషనైనను సులభముగా నేర్చుకొనుటకు

వర్ణనా పద్ధతులు ఉన్నవి. ఇవి పరదేశ భాషలలోనే యున్నవి గాని తెలుగున అట్టి గ్రంథములు లేవు. కాలక్రమమున ఇంగ్లీషు విద్యాభ్యాసమే విశ్వవిద్యాలయముల యందును సన్నగిల్లు చుండుటచే, దేశ భాషలలో నిట్టి గ్రంథములు లేకుండుట విద్యార్థులకు గొప్ప సమస్యగా పరిణమించును. సంస్కృత భాషయందు శ్రద్ధాసక్తులు పెంపొందు సూచనలు గన్పట్టుచున్న ఈ రోజులలో దేశ భాషయగు తెలుగున ఇట్టి గ్రంథము ఉద్భవించుట చాలా అవసరమని నా తలపు.

పై జెప్పబడు ప్రయోజనముల నుద్దేశించి గ్రంథ రచనకు చేయుటకు ఎట్టి యర్హతయు నాకు లేదు. "గమిష్యామ్యుపహాస్యతామ్" అనిగూడా ఎరుగుదును. ఐతే భాష నేర్చుకొనవలయు నను కుతూహలము నాకు చిరకాలము నుండియు కలదు. స్వయముగా జదివి సంస్కృత వ్యాకరణము నభ్యసించుటకు తగిన గ్రంథము తెలుగున నాకు లభ్యము గాకుండుటచే నా యభిలాష కేవలము పగటి కల గనే నిలిచిపోయినది. తరువాత కొంత కాలమునకు W.D. Whitney ఇంగ్లీషున రచించిన సంస్కృత వ్యాకరణమును జూచుట తటస్థించినది. ఆయన అసాధారణ ప్రతిభావిశేషముచే విభ్రాంతుడనై ఇట్టి గ్రంథము తెలుగులో నుండిన ఆంధ్ర విద్యార్థి లోకమున కెంత యుపయోగించునో యని యువ్విళ్ళూరితిని. కాని యట్టి గ్రంథమింత వరకును వెలువడలేదు. ఆ గ్రంథము నుండియు, కొన్ని ఇతర గ్రంథముల నుండియు, నేను, నా యుపయోగమునకై వ్రాసుకొనిన నోట్సు, ఈ పుస్తకము ఇది, నాతోడి తెలుగు విద్యార్థులకు గూడా ఉపయోగించు నేమో యను ఆశతోడను, సేవాభావము తోడను ప్రకటింప నెంచితిని. Whitney రచించిన గ్రంథము అతివిపులము. ఈ భాషలో నూతనముగా ప్రవేశించు వారికి అనవసరమని నాకు తోచిన కొన్ని యతిసూక్ష్మ విషయములను వదలివేసి మిగిలినది చాలా

వరకు దానినుండియే గ్రహించితిని. నా రచనకు ఉపయోగించిన ఇతర గ్రంధములు.

(1) A. A. Macdonell — Vedic grammar for Students (Oxford University Press).
(2) do Vedic Reader (Oxford University Press)
(3) R.G: Bhandarkar—Sanskrit Readers Parts I and II.

ఐతే ప్రాచీన అర్వాచీన సంస్కృత వాఙ్మయము అతి విపులము. ఇంతటి విస్తారమగు వాఙ్మయమును సూచించుటకు ఈ చిన్న గ్రంధము చాలదు. కావున కొన్ని పరిధులను నా యంతట నేనే ఏర్పరచుకొనవలసి వచ్చినది. ఉదాహరణకు వేదమున అతివిస్తారముగా వచ్చు లోట్ (నిర్బంధార్థకము, Subjunctive mode) అను క్రియా ప్రక్రియను చాలావరకు వదలివేసితిని. ఇట్లే పరోక్షభూతము (లిట్) నకు సంబంధించిన భావార్థకములను, అద్యతన భూతమునకు (Aorist) సంబంధించిన భావార్థకములను కొన్నింటిని వదలివేసితిని. ఐనను వేదమున బహుళవ్యాప్తి నొందిన అద్యతన భూతకాల క్రియా ప్రక్రియపై నొక యధ్యాయమును వ్రాసితిని. అచ్చటచ్చట లౌకిక వాఙ్మయమున గల పదముల స్వరూపములకును పురాతన వాఙ్మయమునగల పదములకును గల భేదములను సూచించితిని. ఇదిగాక సంస్కృత భాషకు (అదే కుటుంబమునకు జెందిన గ్రీకు, లాటిను మొదలగు భాషలకువలె) ఉదాత్తానుదాత్త స్వరితరూపమగు స్వరము ఒక ముఖ్యాంగము. ఈస్వరజ్ఞానము లేని సంస్కృత భాషా పరిచయము అసమగ్ర మనియే జెప్పవలయును. ఏల ననగా దీనికిని వ్యాకరణ ప్రక్రియలకును అత్యంత సన్నిహిత సంబంధము కలదు వేదవాఙ్మయమును సరిగా అర్థము చేసికొనుటకిది చాలా ముఖ్యము. అట్టి స్వరమును గోల్పోయినందున సంస్కృతము ఇంచుమించు నిర్జీవ భాషగా తయారైనది. ఈ గ్రంధమున స్వరమునకును, వ్యాకరణ ప్రక్రియ

లకును గల సంబంధములు ఆయా ప్రకరణములలో సూచింపబడినవి. సాధ్యమైనంత వరకు సంస్కృత పదములను వాని స్వరముతోడనే యుదాహరించితిని. ఇది ఈ గ్రంథము యొక్క మరియొక ప్రత్యేకత.

విషయ బాహుళ్యమును బట్టి గ్రంథమును రెండు భాగములుగా ప్రకటింపనెంచితిని. ఇది మొదటి భాగము. ఇందు, ధ్వనులు; సంధి; నామవాచకముల, విశేషణముల, సర్వనామముల సుబంత ప్రక్రియ; క్రియా ప్రక్రియ; క్రియాజన్య విశేష్య విశేషణములు మొదలగునవి కలసి 12 అధ్యాయములు. కొన్ని ముఖ్యధాతువుల పట్టికను, వాని యర్థములను స్వభావములను తెలుపుచు అనుబంధముగా చేర్చితిని. అవ్యయములు, సమాసములు, కారకము, వృత్తి, మున్నగు పరిశిష్ట, విషయములను రెండవ భాగమున ప్రచురింపవలయు నని కోరిక — "మనోరథానా మగతిర్న విద్యతే"

ఈ గ్రంథములోని పారిభాషిక పదములు కొన్ని క్రొత్తవిగా తోచవచ్చును. ఉత్తమ, మధ్యమ, ప్రథమ పురుషలకు పాశ్చాత్య సాంప్రదాయానుసారము ప్రథమ, ద్వితీయ, తృతీయ పురుష లనియే వాడితిని. నేనిచ్చిన ధాతురూపములకును సాంప్రదాయ సిద్ధముగా మనకు వచ్చిన ధాతురూపములకును కొంత భేదముండ వచ్చును. '——>' గుర్తు జన్య జనక భావమును సూచించుటకు వాడితిని. ప్రకరణములోని యంతర్భాగములను సూచించుటకు విడిగా గుర్తులను వాడితిని. ఉదా॥ 7. 12 (అ) అను దానికర్థము ఏడవ ప్రకరణమున 12 వ విభాగమున (అ) అను అంతర్భాగమని గ్రహించవలయును.

ఇక నేను రచించిన భాషా, శైలి విషయయిన - విషయము సులభముగా తెలియబడుటయే నా ముఖ్యోద్దేశము. తదితరముల నేనంతగా పాటించలేదు

**కృతజ్ఞతలు—**

నా గ్రంథము నా మూలాగ్రము విని, ఆమోద ముద్రవైచి, దీనిని ప్రకటించుటకు నన్ను ప్రోత్సహించిన మా మిత్రులు డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు. (రీడర్, ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత విభాగము) గారికిని ముద్రణ విషయమున అత్యంత సానుభూతిలో ప్రవర్తించుటయే గాక అందందు గల్గు భాషాదోషములను సవరించి గ్రంథము సులభతర గ్రాహ్యముగానొనర్చిన బ్రహ్మశ్రీ చర్ల గణపతిశాస్త్రి గారికిని, అడిగినంతనే గ్రంథమును పరిశీలించి భూమిక వ్రాసి ఇచ్చిన శ్రీ డా॥ బి. ఆర్. శాస్త్రి, (సంస్కృత విభాగాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము)గారికి, ప్రశంసలు వ్రాసియిచ్చిన విజ్ఞులుపరిశోధకులు, శ్రీతిరుమల రామచంద్రగారికిని నా కృతజ్ఞతలు వెల్లడించుచున్నాను.

ఈ గ్రంథముద్రణకై పాక్షిక సహాయముగా రు. 1,116/– ఒసగి నన్ను ప్రోత్సహించిన సాహిత్య అకాడమీ (ఆం. ప్ర.) వారికి నా కృతజ్ఞతలు.

గ్రంథములో నున్న దోషములను గాని, గ్రంథము ఇతోధికోపయోగకారి యగుటకు సూచనలు గాని సహృదయతతో నాకు తెలియజేసినచో రెండవ ముద్రణమున వానిని కృతజ్ఞతతో స్వీకరింతును.

హైదరాబాదు (ఆం. ప్ర.)
ఆనంద, విజయదశమి

ఇట్లు, సుజన విధేయుడు
**బేతనభట్ల విశ్వనాథము**



# విషయ సూచిక

# సంక్షిప్త వర్ణనాత్మక

# సంస్కృత వ్యాకరణము

## మొదటి భాగము

## 1. వర్ణమాల, ధ్వనులు, ఉచ్చారణ, స్వరము

1 1 లిపిమాత్రభేదముతో సంస్కృతములోని ధ్వను లన్నియును తెలుగు లోనివే. ఆ ధ్వనులు ఉత్పత్తి స్థానమును బట్టి ఐదు విధములుగా విభజింప బడినవి. అవి కంఠ్యములు, తాలవ్యములు, మూర్ధన్యములు, దంత్యములు, ఓష్ఠ్యములు. వీనిలో నొక్కొక్కటి, స్వరములు, (అచ్చులు) అంతస్థములు (అర్ధస్వరములు) ఊష్మములు, స్పర్శములని నాలుగు భేదములు. మరియు ఈ స్పర్శములలో పరుషములు, సరళములు, అనునాసికములు అను భేదములు కలవు. పరుష, సరళములలో నొక్కొక్కదానిలో ఘోషము, అఘోషము అని రెండువిధములు. ఇవిగాక విసర్గ (లేక విసర్జనీయము), అనుస్వారము, జిహ్వామూలీయము, ఉపధ్మానీయములను మరి నాలుగు ధ్వనులును కలవు. స్వరములలో (అచ్చులలో) స్వచ్ఛస్వరములు, సంయుక్తస్వరములునని రెండు విధములు. స్వచ్ఛస్వరములలో, హ్రస్వములు దీర్ఘములనియును, సంయుక్త స్వరములలో గుణములు, వృద్ధులు నను విభాగములును కలవు. వానినన్నిటిని ఈ క్రింది పటకముచే గుర్తింపవచ్చును.

| ఉత్పత్తిస్థానము | శుద్ధస్వరములు | | అంతస్థములు | స్పర్శములు | | | | | ఊష్మములు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | హ్ర | దీ | | అనునాసికములు | అఘోష పరుషము | పరుష ఘోషము | అఘోష సరళము | సరళ ఘోషము | | | |
| కంఠ | అ 12.78 | ఆ 8.10 | హ ? 1.07 | ఙ .72 | క 1.90 | ఖ .13 | గ .82 | ఘ .15 | హ 1.07 | జిహ్వామూలీయము | ః విసర్గ 1.31 |
| తాలు | ఇ 4.65 | ఈ 1.19 | య 4.23 | ఞ .35 | చ 1.[illegible] | ఛ .17 | జ .94 | ఝ .10 | శ 1.57 | | |
| మూర్ధ | ఋ .74 | ౠ .01 | ర 5.05 | ణ 1.93 | ట .26 | ఠ .06 | డ .21 | ఢ .05 | ష 1.[illegible]4 | | |
| దంత | ఌ 0.01 | — | ల .69 | న 4.[illegible]1 | త 6.65 | థ .58 | ద 2.85 | ధ .8[illegible] | స 3.56 | | |

సంయుక్తస్వరములు లేక సంధ్యక్షరములు.

| | | |
|---|---|---|
| గుణములు : | ఏ | ఓ |
| | 2.84 | 1.33 |
| వృద్ధులు : | ఐ | ఔ |
| | .51 | .18 |

ఇందులో అ + ఇ = ఏ
అ + ఉ = ఓ
అ + ఏ = అ + అ + ఇ = ఐ
అ + ఓ = అ + అ + ఉ = ఔ

} కావుననే వీని సంధ్యక్షరములందురు.

సూచన : పై పథకములోని ధ్వనులన్నియును ఉచ్చారణకొరకై అకారముతో కలిపి వ్రాయుటయైనది.

స్వచ్ఛస్వరములు, సంయుక్త స్వరములును కలిసి అచ్చులనియు, తదితరములు హల్లులు లేక వ్యంజనము లనియును వ్యవహరింపబడును.

పై వర్ణమాలలో నీ క్రింది విషయములు గమనార్హములు.

(అ) క చ, ట, త, ప; ఖ, ఛ ఠ. థ. ఫ; శ, ష, స; విసర్గ :— వీనిని పరుషములనియు, తదితరములను మృదులము లనియు యందురు. అనగా ఈ క్రిందివి మృదులములు— శుద్ధస్వరములు; సంయుక్తస్వరములు; అంతస్థములు (హ తో కలిసి); అనునాసికములు; సరళస్పర్శములు

(ఆ) 'అ' అను స్వరమును పాణిని కంఠ్యములలో జేర్చెను గాని ప్రాతిశాఖ్యలలో నీ విషయ మెత్తబడలేదు

(ఇ) అ, ఇ, ఉ, ఏ, ఓ అను స్వరములు హిందూ ఐరోపా భాషలన్నిటియందును కలవు కాని ఐ, ఔ (వృద్ధుల) మాత్రము కేవలము భారత దేశమునకును, సంస్కృతభాషకును మాత్రమే చెందినవి.

(ఈ) సరళఘోషములు హిందూ ఐరోపా భాషకు చెందినవి

(ఉ) విసర్గ, అనుస్వారములు ప్రత్యేకములగు నక్షరములుగావు శబ్దమునకు చివరనున్న సకారమునకు ప్రత్యామ్నాయము మాత్రమే విసర్గ. కావున పదాంతములను విసర్గకు బదులు సకారముతోడనే గుర్తించుట యుచితము.

దీనిచే వ్యాకరణ ప్రక్రియలయందును సౌలభ్య మేర్పడును. ఐనను తెలుగువారి యభ్యాసానుసారముగా ఈ గ్రంథమున విసర్గయే వాడబడినది. కావున విసర్గ వచ్చిన ఎల్లచోట్లను సకారము భావింపబడవలయును.

(ఊ) 'హ' ను అంతస్థములలో జేర్చవచ్చును. కాని ఏలనో అట్లు చేయబడలేదు ఇట్లే అనుస్వారము ను ఊష్మములలో జేర్చవచ్చును ఈ విషయ మున వైయాకరణులలో అభిప్రాయభేదము లున్నట్లు గోచరించును.

**1 2** పై పథకములో అక్షరముల క్రింద వ్రాయబడిన యంకెలు, ఆయా అక్షర ములు, సరాసరిన, ప్రతి నూరు అక్షరములు గల పదసముదాయములో ఎన్ని సారులు వచ్చునో తెలియజేయును. ఒక్కొక్కదానిలో 1000 అక్షర ములు గల గ్రంథభాగములను— ఋగ్వేదమునుండి రెండు, అధర్వవేదము నుండి ఒకటి, బ్రాహ్మణముల నుండి రెండు; మనుస్మృతి నుండి, భగవద్గీత నుండి, శకుంతల, హితోపదేశము, వాసవదత్త నుండి యొక్కొక్కటి, మొత్తము పది గ్రంథభాగములు. పదివేల యక్షరములు గలుగునట్లు తీసికొని, వానిలో ప్రతి యక్షరము ఎన్నిసారులు వచ్చునో లెక్కించి సరాసరి శాతపౌనఃపున్యము తయారుచేయబడినది. దీనిచే నీ క్రింది విషయములు గమనింపదగును. అచ్చులన్నిటిలో నెక్కువ వ్యాప్తిలో నుండునది అకారము. మిగిలిన యచ్చులన్నిటి కంటెను దీని పౌనఃపున్యము ఇంచుమించు రెట్టింపు. ఇకారము, ఉకారముకంటె ఇంచుమించు రెట్టింపు పౌనఃపున్యము గలది. ప్రతి స్వరములోను హ్రస్వరూపము దీర్ఘరూపముకంటె సుమారు $2\frac{1}{2}$ రెటు అధికముగా వచ్చుచుండును.

## 1.3 కంఠ్యములు : క ఖ, గ, ఘ, ఙ

ఈ స్పర్శములలో అన్నిటికంటె ఎక్కువసార్లు వచ్చునది క కారము. హిందూ ఐరోపాభాషలోని కంఠ్యములలో కొలది మాత్రమే సంస్కృతములోనికి వచ్చినవి. ఈ హిందూ ఐరోపా భాషా కంఠ్యములు చాలా అపభ్రంశమును పొందినవి. వీని నుండియే తాలవ్యములలోని స్పర్శములు, తాలవ్య ఊష్మమగు శ; హకారమును వచ్చినవి.

## 1.4 తాలవ్యములు : చ, ఛ, జ, ఝ, ఞ.

ఇవి యన్నియు కంఠ్యముల యపభ్రంశముచే నేర్పడినవే 'క' నుండి 'చ' వచ్చినది. 'శ' కూడను 'క' నుండి వచ్చినదే. 'గ' నుండి 'జ' వచ్చినది.

**1.6** దంత్యములు : త, థ, ద, ధ, స.

ఇవి హిందూ ఐరోపాభాషనుండి సంక్రమించినవి. ఇవి భాషలో అతి విస్తారముగా వచ్చుచుండును. మిగిలిన స్పర్శము లన్నియు కలిసి ఎన్నిమార్లు వచ్చునో ఈ వర్గము మాత్రము అన్నిమారులు వచ్చును.

**1.7** ఓష్ఠ్యములు : ప, ఫ, బ, భ, మ.

హిందూ ఐరోపా భాషలో 'బ' లేనందున సంస్కృతమునను అది తక్కువే. 'భ' మాత్రము బహుళవ్యాప్తి బొందినది. పురాతన వ్రాతప్రతులలో బ, వ, లు ఒకదానికొకటి వినిమయముపొందుచుండుటచే, ఒకేధాతువు రెండు రూపములుగలవి సంస్కృతమున చాలా కనుపించును.

ఉదా॥ బృహ; వృహ్; బాద్, వధ్;... మొదలగునవి

**1.8** అంతస్థములు : య, ర, ల, వ.

(అ) 'య' కును 'ఇ' కును చాలాసంబంధము కలదు (ముందు ముందు సంధి ప్రకరణమున వివరింపబడును) వేదములలో చాలాచోట్ల 'య' వచ్చినపుడు దానిని 'ఇ'వలె యుచ్చరించవలసియుండును. ఇది దాని ఛందస్సును గమనించి నచో విశదమగును. కొన్నికొన్ని శబ్దములలోను, కొన్ని జాతుల శబ్దములలోను ఇది తప్పక వచ్చుచుండుట గమనించగా నిది వైకల్పికమని తోచదు.

(ఆ) 'య' కును 'ఇ' కును ఎట్టి సంబంధముగలదో, సరిగా నట్టి సంబంధమే 'వ' కును 'ఉ' కును కలదు.

(ఇ) 'ర' ను మూర్ధన్యమని పాణిని చెప్పినను ప్రాతిశాఖ్యలలో నెచ్చట నది యంగీకరింపబడలేదు. ఐతే 'ల' మాత్రము దంత్యమని ఎల్లచోట్లను చెప్పబడినది.

(ఈ) అంతస్థములగు 'ర, ల' లు అతివిస్తారముగా నొకదానితో నొకటి వినిమయము బొందును. ఇది, ధాతువులయందే గాక, అనుసర్గలయందును ఉపసర్గల యందును కాన్పించును.

(ఉ) పై జెప్పబడిన యంతస్థములు గాక ఋగ్వేదమున మరియొక దంత్యమగు నంతస్థము కన్పించును. దీనిని 'ళ' తో గుర్తించుదురు. ఇది కొన్ని పదములలో డ, ఢ లకు బదులు నిక్షేపింపబడును.

ఉదా॥ ఈడే <—> ఈళే; మీఢుషే <—> మీళ్హుషే;...

## 1.9 ఊష్మములు : (హ?), శ: ష, స.

(అ) 'హ' యను దానిని కంఠ్యములలో జేర్చవచ్చును. (పాణిని యట్లే చేర్చెను ఐతే ఈ విషయమున ప్రాతిశాఖ్యలలో నభిప్రాయభేదము కలదు). ఇది సంధిప్రక్రియలో మృదులమువలె పనిజేయును. కావున దీనిని ఊష్మములలో గాక యంతస్థములలో జేర్చుట యుచితము. ఇది భాషలో స్వతస్సిద్ధమగు ధ్వని గాదు. అన్ని సందర్భములలోను పురాతన ధ్వని యగు 'ఘ' నుండి జనించు చుండును. (కొన్నికొన్నిచోట్ల—ఇట్టివి బహుస్వల్పము— 'ధ' 'భ' ల నుండి గూడ ఉదయించును) మార్పుజెందని రూపములో నున్న 'ఘ' కంటె మార్పు జెందిన 'హ' రూపములోనే నిది వాఙ్మయములో పలుచోట్ల ప్రత్యక్షమగు చుండును ఐనను వ్యాకరణ ప్రక్రియలలో నిది ఒక్కొక్కమారు 'ఘ' గామారి యథారూపమును ధరించును.

(ఆ) 'శ' అను ధ్వని తాలవ్యము. ఇది 'క' నుండి యపభ్రంశమై వచ్చినది. కొన్నికొన్నిచోట్లనిది తన పూర్వరూపమగు 'క' గా ప్రత్యక్షమగును. ఒక్కొక్కప్పుడు మూర్ధన్యమగు 'ష' గా మారును.

(ఇ) 'ష' ఇది నిశ్చయముగా మూర్ధన్యము. ఉత్తరహిందూస్థానమున కొందరు దీనిని 'ఖ' గా ఉచ్చరింతురు. కావున ముందు రాబోవు వ్రాతప్రతులలో నీ మార్పు రావచ్చును.

ఇదియు స్వతస్సిద్ధమగు ధ్వనిగాదు. దానికి సమీపముననే యున్న దంత్యమగు 'స' నుండి సంధిప్రక్రియలో మూర్ధన్యీకరణమునుబొంది 'ష' గా తయారగును. దీనికి అపవాదములు బహుస్వల్పములు.

(ఈ) 'స' ఇది దంత్యము. సంధిప్రక్రియలో నిది ఒకప్పుడు విసర్గగను, ఒకప్పుడు 'ర' గను, మరియొకప్పుడు ఇతర ఊష్మముగను మారుచుండినను వాఙ్మయములోనున్న వ్యంజనము లన్నింటికంటెను దీని వ్యాప్తి ఎక్కువ

## 1.10 విసర్గ లేక విసర్జనీయము :

(అ) ఇది ఊష్మములలో పరుషమువలె ప్రవర్తించును. దీనికి బదులుగా వచ్చు సరళరూపము అంతస్థమగు 'ర'. ఇవి పరుష, సరళములవలెనే ఒకదాని కొకటి వినిమయముబొందుచుండును. విసర్గ స్వయంసిద్ధముగాదు. ఇది ఎల్లప్పు డును 'స్, ర్' లకు ప్రతిగా నిక్షేపింపబడును. ఇది ఎంతవరకు నిత్యము,

ఎంతవరకు వైకల్పికమను విషయమున వైయాకరణులలో నభిప్రాయభేదము కలదు. క, ఖ లకు ముందువచ్చు విసర్గము జిహ్వామూలీయమనియు, ప, ఫ లకు ముందు వచ్చు విసర్గము ఉపధ్మానీయమనియు అందురు. ఈ ధ్వనుల ప్రయోజనము వాఙ్మయమున విచారణీయము.

**అనుస్వారము :**

(అ) సంస్కృతభాషలోని కొన్ని యనునాసికములు చాల అస్థాయి స్థితిలోనుండును. ఇవి యెల్లప్పుడును, తరువాత వచ్చు వ్యంజనములలో విలీనము గావలసినవే. ఇవి— వాక్యముల కూర్పులో పదములకు చివరవచ్చు మ; ధాతువుల యుపధాస్థానములలోవచ్చు నకారములును, మున్నగునవి ఇట్టి అనునాసికము నకు వెన్నంటి వచ్చు వ్యంజనము స్పర్శమైనచో నిది, యదే వర్గమునకు జెందిన యనునాసికముగా మారును. ఒకవేళ దాని ప్రక్కనే వచ్చు వ్యంజనము, స్పర్శము గాక అంతస్థముగాని యూష్మముగాని యైనచో నది యా వ్యంజనమున కను రూపమగు నాసికాధ్వనిగామారును దీనిని అనుస్వారమందురు ఇట్టి ధ్వని శుద్ధ స్వరమా, సంయుక్తస్వరమా, అంతస్థమా, ఊష్మమా? అను విషయమున అభిప్రాయభేదములుకలవు. ఈయభిప్రాయభేదములకు కారణము, వివిధ పరిస్థితులలో దాని యుచ్చారణలో భేదముండుటచేతనా? యను విషయము విచారణీయము వ్రాతప్రతులలో ఈ యనుస్వారమునకు రెండు విధములగు గుర్తులుండుట గమనింపదగినది. ఒకటి ం; రెండవది ఁ. ఈ గుర్తులు అక్షరములపైన లిఖింపబడియుండును. కావున ప్రాచీనకాలమున నీ ధ్వనులు విభిన్నములుగా నుండెననియు, రానురాను అవి కలిసిపోయి వానిలోని భేదము నశించినదనియు తలచుట యుచితము.

## 1.11 స్వరము :

సంస్కృతభాషలోని పదములకు ప్రాచీనకాలమున స్వరముండెను. కాని ఈ భాషమాట్లాడువారు లేక, కేవలము గ్రంథరచనకు మాత్రమే యుపయోగించు కాలమున, ఆట్టి స్వరముచే నెక్కడు ప్రయోజనము లేనందున, కాలక్రమమున నది యుత్పన్నమైనది. కాని, ఇప్పటికిని వేదమునుగాని, తత్సంబంధమగు నితర వాఙ్మయమును గాని యర్థము జేసికొనుటకు ఈ స్వర పద్ధతి తెలియుట ముఖ్యము. ఏలననగా నిదియు నొక వ్యాకరణ ప్రక్రియయే. సంధి; సుబంత, తిఙంత, వృత్తి మొలగు వ్యాకరణ ప్రక్రియలో ఈ స్వరమునకు ఎక్కడు వ్యాకరణ

సంబంధముగు ప్రాముఖ్యముకలదు. ఇవి యెల్లను ఆయా ప్రకరణములలో వివరింపబడును

సంస్కృత వర్ణమాలలోని 'అ, ఇ, ఉ, ఋ, ఌ' లు సంగీతములోని ధ్వనులవలె స్థాయీభేదములతో నుచ్చరింపబడును.

(అ) ఉచ్చస్థాయిలో నుచ్చరింపబడినది యుదాత్తము.

(ఆ) నీచస్థాయిలో నుచ్చరింపబడినది యనుదాత్తము,

(ఇ) వరుసగా వచ్చు ఉచ్చ, నీచస్థాయులు కలిపి ఉచ్చరింపబడినది స్వరితము: ఇది ముఖ్యముగా సంధిలో వచ్చును. ఒక ఉదాత్త స్వరమునకు వెనువెంటనే ఒక యనుదాత్తస్వరము కలిసివచ్చి, ఈ రెండు స్వరములును సంధిచే కలిసిపోయినపుడు ఏర్పడునది స్వరితము ఇట్టి దానిని స్వతంత్ర స్వరితమందురు. ఇదిగాక అస్వతంత్ర స్వరితమని పిలువబడు మరియొక జాతి స్వరితము గూడ కలదు. దీనిలో సంధి ప్రసక్తిలేదు. అస్వతంత్ర స్వరితమనగా ఉదాత్తస్వరమునకు వెనువెంటనే మరియొక యక్షరములో వచ్చు అనుదాత్త స్వరము ఐతే, ఈ అనుదాత్తస్వరమునకు వెనువెంటనే మరియొక ఉదాత్తముగాని, స్వరితము (మొదట జెప్పబడినది) గాని రాగూడదు. అట్లు వచ్చిన, ఈ యనుదాత్తము ఉదాత్తమువలెనే యుచ్చరింపబడును

**1 12** ప్రాచీన లిఖిత గ్రంథములలో ఈ స్వరములు పలు విధములుగా గుర్తింపబడియుండును. ఐతే, ఇవియన్నియును ఋగ్వేద లిఖితగ్రంథములలోని గుర్తులే—కొలది కొలది మార్పులతో. వానిని క్రింద వివరించనైనది.

(అ) ఉదాత్తస్వరమునకెట్టి గుర్తునులేదు. స్వరితమును గుర్తించుటకై ఆయక్షరముపై నొక నిలువుగీత పెట్టబడియుండును. (స్వతంత్రముగానీ, యస్వతంత్రముగానీ) ఉదాత్తమునకు గాని, స్వతంత్ర స్వరితమునకుగాని మున్ముందుగా (సమనంత పూర్వము) వచ్చు అనుదాత్తస్వరము క్రింద నొక యడ్డుగీత పెట్టబడియుండును.

ఉదా॥ అ గ్ని మీ ళే పు రో హి తమ్

య జ్ఞ స్య దే వ మృ త్వి జమ్

హో తా రమ్ ర త్న ధా త మమ్.

పై దానిలో ఉదాత్తస్వరముగల యక్షరములు: గ్ని, రో, జ్ఞ, వ, త్వి, హో, ధా;

వీనికి ముందున్న వన్నియు (హోతప్ప) అనుదాత్తములగుటచే వీనిక్రింద నడ్డుగీత పెట్టబడియుండుట గమనింపనగును.

స్వ—అస్వతంత్ర స్వరితము. ఇట్లే ఇతర స్వరితములను గుర్తించునది.

(ఆ) ఐతే, వాక్యముగాని, పాదముగాని ఉదాత్తముతో మొదలగు చో, దానికి పూర్వముగా నేయక్షరమును ఉండదుగావున — అనుదాత్త స్వరపుగుర్తుతో ప్రారంభమగుటకు వీలుపడదు. అందుచే, వాక్యమునకుగాని, పాదమునకుగాని మొదటి యక్షరమునకు ఏగుర్తును లేక యుండినదానిని ఉదాత్తమని గుర్తెరుగ వలయును. ఇదిగాక వాక్యమునగాని పాదమునగాని వచ్చు మొట్టమొదటి యుదాత్త స్వరమునకు పూర్వమున్న అన్ని యక్షరములకును అనుదాత్తపు గుర్తులు వేయ వలయును

(ఇ) ఇట్లే స్వరితము తర్వాతమరల ఉదాత్తస్వరము వచ్చు వరకుండిన యక్షరము లన్నియు అనుదాత్తములే. ఐనను ఉదాత్తమునకు పూర్వముండిన యక్షరము క్రిందనే యనుదాత్తపు గుర్తు వేయబడియుండును. మిగిలిన వానికి ఏ గుర్తులును ఉండవు.

(ఈ) ఒక స్వతంత్ర స్వరితమునకు వెంటనే ఒక ఉదాత్తముగాని మరియొక స్వతంత్ర స్వరితముగాని వచ్చినచో, ఈ రెంటికిని నడుమ, మొదటి స్వరితములోని స్వరము హ్రస్వమైనచో 1 అను అంకెను, దీర్ఘమగుచో ३ అను అంకెనా ఉంచుదురు.

**1.13** (అ) పై విషయములు గమనించిన, అనుదాత్తములు ఒకచో గుర్తు వేయబడియు, ఒకచో గుర్తు వేయబడకయు ఉండును. ఉదాత్తములు అసలే గుర్తింపబడియుండవు. అందుచే, అనుదాత్తములేవో, ఉదాత్తములేవో గుర్తించుటకు కొంత వెదకికొనవలసి వచ్చును. అట్లుగాక ఉదాత్తస్వరములను మాత్రము గుర్తించి అనుదాత్తములను గుర్తించకవదలివేసినచో సులభమగును. ఇదేపద్ధతిని గ్రీకు, లాటినుభాషల స్వరపద్ధతికి యుపయోగింతురు. దానితో కొంత వ్యాకరణ సౌలభ్యమును ఏర్పడును. (ఈ విషయము ముందు ప్రకరణములతో విశద మగును). ఈ గ్రంథమునను అదియే పద్ధతి యుపయోగించబడును ఏగుర్తును

లేక యుండునది యనుదాత్తము. అక్షరముపైన "/" గుర్తు గలది యుదాత్తము. "\" గలది స్వరితము. (స్వతంత్రముగా నిండు, అస్వతంత్రముగా నిండు). అసలు అస్వతంత్ర స్వరితమునకు గుర్తువేయ పనిలేదు. ఏలననగా ఉదాత్తమునకు ప్రక్కనేయున్న యక్షరస్వరము అస్వతంత్ర స్వరితము—దాని ప్రక్క నే మరల యుదాత్తముగాని స్వతంత్ర స్వరితముదాని వచ్చిననే తప్ప.

ఈ పద్ధతిని పై ఋగ్వేదమంత్ర మీ క్రింది విధమున లిఖింపబడును.

అగ్న' మీ ళే పురో' హితమ్ యజ్ఞ'స్యదేవ' మృత్వి'జమ్
హో'తారమ్ రత్నధా'తమమ్.

ఉదాత్తమునకు ప్రక్కన ఉన్న యక్షరముపై (అస్వతంత్ర) స్వరితపు గుర్తు పెట్టవచ్చును. కాని యది యనవసరము.

(ఆ) ప్రాతిశాఖ్యలలో పలువిధములగు స్వరితములు చెప్పబడినవి.

(1) క్షైప్రము : ఉదాత్తమగు "ఇ" గాని "ఉ" గాని, దానిప్రక్కనే వచ్చిన యనుదాత్త సహితమగు ప్రతిరూప స్వరముతో సంయోగమునుబొంది "య"గా గాని "వ"గా గాని మారినపుడు ఏర్పడుస్వరితమును క్షైప్రమందురు.

ఉదా॥ వియా`ప్త (వి' + ఆప్త); అప్స్వ`న్త'ర్ (అప్సు' + అంత'ర్) ఇట్టి స్వరితములు. వాఙ్మయమున చాలా విరివిగా వచ్చును.

(2) జాత్యము లేక నిత్యము : ఇది వ్యాకరణ ప్రక్రియలలో స్థానచలనము జెందక అట్లే నిలచియుండును.

ఉదా॥ క్వా` (కు' + అ); స్వ`ర్ (సు' + అర్); న్య`క్ (ని' + అక్);

బుధ్న్య` (బుధ్ని' + అ); కన్యా` (కని' + ఆ); నద్యా`స్ (నదీ' + అస్) తన్వా` (తనూ' + ఆ)

సూచన : పై జెప్పబడిన రెండు విధముల స్వరితములు సాధారణముగా వేదమున విసంధిగానే (అనగా స్వరములను విడివిడిగానే) యుచ్చరింప వలసి యుండును.

(3) ప్రశ్లిష్టము : దీనిలో ఉదాత్తస్వరమును అనుదాత్తస్వరమును కలిసిపోయి దీర్ఘస్వరముగానో, సంయుక్తస్వరముగానో మారును.

ఉదా॥ దివీవ (దివి' + ఇవ); సూద్గాత (సు' + ఉద్గాత)

నైవాశ్నీయాత్ (న' + ఏవ' + అశ్నీయాత్)

(4) అభినిహితము : పూర్వపదముయొక్క అంత్యము ఉదాత్తమగు 'ఏ' గాని 'ఓ' గానియై, దానివెంటనే వచ్చిన యదాత్తమగు అకారమును తనలో విలీనమొనరించుకొనుటచే నేర్పడిన స్వరితమును అభినిహిత మందురు.

ఉదా॥ తే (అ) బ్రువన్ ; సో (అ) బ్రవీత్.

ఇట్లే యస్వతంత్ర స్వరితములలోగూడ ననేకభేదములు చెప్పబడినవి కాని యవి యంతముఖ్యములు గావు.

**1.14** స్వరవిషయమున ఈ క్రింది విషయములు ముఖ్యముగా గుర్తించవలయును.

(అ) స్వరితము సాధారణముగా(ఎప్పుడోతప్ప) దీర్ఘస్వరములమీదను. సంయుక్తస్వరములమీదనురాదు. ఇట్టి స్వరితములు వేదమున వదలివేయబడినవి. కాని, సంధిలో వచ్చు యడాగమ వుగాగములతో కలిసిన స్వరముల (హ్రస్వములైనను సరే, దీర్ఘములైనను సరే) పై నిదివచ్చును. ఈ 'య, వ' లు స్వతః ఉదాత్తములగు 'ఇ, ఉ' లు ఐయుండును. ఇదిక్షైప్రస్వరితము. ఇట్టివే వేదమున బహుళము.

(ఆ) సాధారణముగా సంబోధనలో (వాక్యముయొక్క గాని పాదముయొక్క గాని మొదటిలో వచ్చిన తప్ప) ఉదాత్తము ఉండదు. ఒకవేళ ఉన్న నది దాని మొదటి యక్షరముపైననే యుండును.

(ఇ) స్వతంత్రవాక్యభాగము (Principel clause) లో వచ్చిన ముఖ్యక్రియాపదము (Principal verb అనగా పనిని తెలియజేయుపదము. క్రియలనుండి జనించిన విశేషణ విశేష్యములు మున్నగునవికావు) ఉదాత్త స్వర రహితముగా నుండును— వాక్యమునకు గాని, పాదమునకు గాని మొదటనే వచ్చిన తప్ప.

(ఈ) ఈ క్రింది యవ్యయములకు సాధారణముగా ఉదాత్తముండదు. చ; వా; ఉ; స్మ; ఇవ; చిద్; స్విద్; హా; కం; ఘ; భల; సమహ; ఇమ్; సిమ్;

ఇవిగాక ఋగ్వేదములో పాదము చివర 'ఇవ' అను అర్థము వచ్చునట్లుగా ప్రయోగింపబడిన 'యథా' అనుదానికిని ఉదాత్తముండదు.

(ఉ) కొన్ని కొన్ని సర్వనామముల విషయమునను, సర్వనామప్రకృతుల విషయమునను ఇట్లే. వీనికి ఉదాత్తముండదు.

మా; నౌ; నస్; త్వా; తే; త్వ; వామ్; వస్; ఏన; సమ;

(ఊ) ఉదాత్తములేని పద మేదియును వాక్యమునకుగాని పాదమునకుగాని మొదట నుండరాదు.

(ఋ) కొన్ని పదములలో ఒక దానికంటె నెక్కుడు అక్షరములపై ఉదాత్తముండును.

ఇట్టివి (i) ద్వంద్వములలో[8]: మి'త్రా' వ'రుణా; దా'‍్యావా పృథివీ';

(ii) చతుర్థీ విభక్తికి సంబంధించిన తుమున్ప్రత్యయార్థకములు (వేదములోనివి), ఏ'తవై' అ'పభర్తవై'

(iii) పొడి (Particle) వా'వ' మొదలగునవి

(ౠ) వ్యాకరణ ప్రక్రియలకును, స్వరమునకును ఉండుసంబంధము ఆయా ప్రకరణములలో సందర్భానుసారము వివరింపబడును,



# 2. సంధి

**2.0** సంస్కృతభాషలోని వాక్యముల కర్థముచెప్పవలయుననిన వానిలోని పదములను మొదట గుర్తించి, విడదీయవలయును. దీనిని పదవిభాగమందురు. తరువాత ప్రతిపదమునకును అర్థము గ్రహించవలయును. మరల ప్రతిపద మందును ధాతువు; ప్రకృతి; ప్రత్యయములను మూడుముఖ్యవిభాగములుకలవు. సంస్కృతభాష కంతకును మూలకములని చెప్పదగినవి సుమారు 900 ధాతువులు కలవు. వీనినుండియే చాలావరకు శబ్దజాలమంతయు ఉత్పన్నమైనది, ధాతువును తీసికొని, దానికి కొంత సంస్కారముజేసి (ప్రత్యయములు, ఉపసర్గలు, పొడులు, మున్నగు వానిని కలుపుటగాని, ఉన్నయక్షరముల కొన్నిటిని తీసివేయుటగాని, లేదా మార్పుజేయుటగాని) వ్యాకరణమునప్రయోగమున కుపయుక్తమగునట్లు తయారుజేయుదురు. ఇట్లు తయారైనరూపమును ప్రకృతి (Stem) యందురు. ఈ ప్రకృతికి కొన్ని ప్రత్యయములు (అక్షరసముదాయములు) చేర్చి పదములుగా తయారుజేయుదురు. ఈ ప్రత్యయములు (1) సుబంత ప్రత్యయములు (నామవాచకములకు, విశేషణములకు, సర్వనామములకును విభక్తులను తెలియజేయునవి) (2) తిజంత ప్రత్యయములు (క్రియాపదములకు భూత, భవిష్య ద్వర్తమానాదికాలమునుగాని, విధి, ఆశీస్సు మొదలగుభావార్థకములను గాని తెలియజేయునవి (3) కృత్ప్రత్యయములు (నామవాచకములుగా మార్చి వైచునవి) (4) తద్ధితప్రత్యయములు (విశేషణములుగా మార్చివేయునవి) మొదలగు పలువిధములుగా కలవు. ఈ నానావిధ ప్రత్యాయములచే నానావిధ పదజాలమేర్పడును. ఉదా॥ తెలుగున "పో" అను (వెళ్ళు అను అర్థము కలది) ధాతువునకు "వు"ను చేర్చిన "పోవు" ప్రకృతి యేర్పడును. దీనినుండి వివిధ ప్రత్యయములను చేర్చుటచే పోవుచు, పోవుచున్నాడు; పోవుచున్నావు. పోవుచున్నాను; పోవును, పోయెను, పో(వు)దువు, పోవుట; పోబడి; పోకడ; పోవుచున్న; పోవుచుండిన; పోయిన: ... ... మొదలగు పదజాలమేర్పడును.

ఇట్లేర్పడిన పదజాలము వాక్యములుగానేర్పడి, ఈ వాక్యముల సముదాయమే వాఙ్మయమైనది. ఇట్టి విశ్లేషణపద్ధతికి అనువగుభాషలలో సంస్కృతము ముఖ్యమైనది. అదే కుటుంబమునకు జెందిన ఇతరభాషలకును ఇట్టి గుణము కలదు—ముఖ్యముగా గ్రీకు భాషకు.

ఈ విధముగా ధాతువుకు అతికిన పొడుంచేతను, ప్రసర్గలు, అనుసర్గలు మున్నవానిని చేర్చుటచేతను, ప్రకృతి ప్రత్యయములకలయికచేతను, పదమును పదమును అతుకుటచేతను దాని యుచ్చారణలో కొంతమార్పు వచ్చును. ఈ యుచ్చారణ భేదము రెండు రకములుగానుండును. ప్రకృతిని తయారు జేయుటలోను, లేక ప్రకృతినుండి పదమును తయారుజేయుటలోను, ఏర్పడు ఉచ్చారణభేదము. దీనిని అంతస్సంధి (Internal Euphonic Combination) యందురు. ఇక రెండు పదముల యొక్కగాని, రెండు ప్రకృతుల యొక్కగాని, సంయోజనముచే నేర్పడు ఉచ్చారణ భేదము రెండవది. దీనిని బహిస్సంధి. లేక పదసంధి యందురు. (External Euphonic Combination) సంస్కృత వాక్యములలోని పదముల నిజస్వరూపమును గుర్తించుటకివి రెండును అవసరములే. ఐతే వాని వ్యాకరణ ప్రక్రియలు ఇంచుమించు సమానములేయగుటచే విడివిడి ప్రకరణములలో చర్చించుట యనవసరము. భేదములున్నపుడు సందర్భానుసారముగా వానిని సూచించ వచ్చును.

సంధిలోని యుచ్చారణభేదములను ఈ క్రిందివిధములుగా విభజింప వచ్చును.

I విసంధి (Hiatus)

వాక్యముయొక్క మొదటి యక్షరముగాని, వాక్యములో భాగముగానట్టి పదముయొక్క మొదటి యక్షరముగాని, తప్ప, మిగిలిన ఏ యక్షరమును హల్లుతో గలి యని విడి యచ్చుగా నుండరాదు. అట్లుండుట విసంధియనబడును. కావున సంస్కృతములో సామాన్యముగా విసంధి నిషిద్ధము. దీనికి కొన్ని యపవాదములు కలవు. అవి తర్వాత చర్చింపబడును.

II అఘోషీకరణము (Diaspiration)

అచ్చు, అంతస్థము, అనునాసికము, లకు పూర్వముననున్న ఘోషస్పర్శ

ములు తప్ప, మిగిలిన ఘోషస్పర్శములు తమ ఘోషత్వమును కోల్పోయి అఘోషము లగును.

III సంలయము (Assimilation)

సంధిలోని బహుళజాతులు సంలయ ప్రక్రియలోనికి వచ్చును. అనగా— రెండుధ్వనులు సరూపములగుచో వాని కలయికలోని యుచ్చారణభేదము గమనింపబడదు. అనగా నొకదానితో నొకటి కలసిపోవును. అట్లుగాక విరూపములగుచో వాని సంయోగము సాధ్యముకాదు. ఈ సంలయ ప్రక్రియలోని యంతర్భాగములు (అ) ఒకధ్వని యదేవర్గమునకు జెందిన మరియొక ధ్వనిగా మార్పు జెందుట. (ఆ) ఇతర వర్గమునకు జెందిన మరియొకధ్వనిగా మార్పుజెందుట. రెండవదానిలో ఉచ్చారణస్థానమును భేదించును.

(అ) మొదటిజాతిలో ముఖ్యమైనది, పలుమారు ప్రత్యక్షమగునది — పరుషములు, సరళములు, ఒకదానితో నొకటి సంలీనమగుట. ఒక్కొక్కమారు అనునాసికములు, కూడాను ఇదే సంలీన శక్తిని ప్రదర్శించును.

(ఆ) రెండవరకపు మార్పులో (అనగా ఉచ్చారణస్థానమును మారు సందర్భములో) ముఖ్యమైనవి (i) దంత్యములు తమ ప్రక్కనేయున్న మూర్ధన్యముల ప్రభావముచే, మూర్ధన్యములుగా మారుట (ii) ఒకొక్కప్పుడివి తాలవ్యములుగా గూడ మారుట (iii) తాలవ్యస్పర్శములు, తాలవ్య ఊష్మము (శ్), హకారాము — ఇవి స్వతస్సిద్ధములగు ధ్వనులుగాక జన్యధ్వనులగుటచే, సంధి ప్రక్రియలో, నివి పలుమారు తమ యధారూపములగు కంఠ్యములుగా ప్రత్యక్షమగును. ముఖ్యముగా 'జ్'ఒకొక్కమారు కంఠ్యముగను, ఒక్కొక్కమారు మూర్ధన్యముగను మారును ఇట్లే హకారము పలుమారు "ఘ్"గను, కొన్నియెడల ధ్గను, మరికొని యడల "భ్"గను మారును. దీనికి కారణము ఈపదములలో మొదట ఘ్, ధ్, భ్ లేయుండి రాను రాను ఉచ్చారణ సౌలభ్యమునకై హకారముగా మారియుండుట ఇట్లే మూర్ధన్యమగు "ష్" గూడను దంత్యమగు "స్" నుండి జనించుటచే నిది ధాత్వంతమున నున్నపుడు సంధి ప్రక్రియలో నతి విచిత్రముగా ప్రవర్తించును.

IV పరిశిష్ట విషయములు :

(i) పెంపు : కుదింపు : (Extension and abbreviation)

వ్యాకరణప్రక్రియలలోని, కొన్నింటిలోనున్న వ్యంజనములను ద్విత్వము జేసిగాని, లేని వానిని కొన్ని చేర్చిగాని నిర్వాహింపబడు ప్రక్రియను "పెంపు" అందురు. అట్లుగాక కొన్నిచోట్ల నిదివరకే యుండిన ద్విత్వములను తీసివేయుటయో ఉన్న యక్షరములను తీసివేయుటయో జరుగును ఇట్టి ప్రక్రియను "కుదింపు" అందురు.

బలీకరణము, దుర్బలీకరణము.

(ii) పై జెప్పబడిన ప్రక్రియగాక. బలీకరణము, దుర్బలీకరణము లను మరియొక జాతి మార్పులనుగూడ గమనించవలసియుండును. బలీకరణ విషయమున ధాతువులోగాని. ప్రకృతిలోగాని యుండిన యచ్చునకు గుణముగాని, వృద్ధిగాని వచ్చును. లేదా, ఇదివరకు లేని నుగామమువచ్చును. దీనికి వ్యతిరేకమగు ప్రక్రియ దుర్బలీకరణము. ఇదివరకుండిన అనునాసికము లోపించుట, గుణవృద్ధులు పోయి వానిస్థానమున మామూలు శుద్ధస్వరములు వచ్చుట, య,వ,ర. లకు బదులుగా ఇ, ఉ, ఋ లునిక్షేపింపబడుట. (దీనిని సంప్రసారణమందురు) లేక ఒక్కొకసారి ధాతువులోని ఈ కారము ఆ కారముగా మారుట, దీర్ఘము పోయి హ్రస్వమేర్పడుట మొదలగునవి ఈ ప్రక్రియకు ముఖ్యలక్షణములు.

పైని జెప్పబడిన విషయము లీ క్రింది క్రమమున వివరించబడును.

1. విసంధి నుండి తప్పుకొనుటకు స్వరసంధి
2. పదాంతమున రాదగు ధ్వనులు.

సంస్కృతములో పదాంతములుగా వచ్చుటకు కొన్ని వర్ణములకుమాత్రమే యనుమతిగలదు. అవి యేవియన (అ) అచ్చులు. (ఆ) అనునాసికములుగాని స్పర్శములలో క్, ట్, త్, ప్‌లు మాత్రము. (ఇ) అనునాసికములలో న్, మ్‌లు మాత్రము మిగిలిన యనునాసికములు బహుస్వల్పము. ఙ్ అసలేరాదు. (ఉ) అంతస్థములలో ల్ మాత్రము వచ్చును గాని ఇది 'బహుక్వాచిత్కము.

మిగిలిన వర్ణములేవి వచ్చినను, అవి రూపాంతరమును బొంది పై జెప్పబడిన వర్ణములుగా మారవలసినదే.

3. ఘోషస్పర్శముయొక్క ఘోషత్వలోపము.
4. పరుషముల, మృదులముల సంలయము : విసర్గసంధి
5. దంత్యములు, మూర్ధన్యములుగను, తాలవ్యములుగను మారుట.

6. అనునాసికాంతపదములలోని మార్పులు.
7. జన్యధ్వనుల మార్పులు.
8. పరిశిష్ట విషయములు.

## 1. స్వర సంధి

**2.1** సాధారణముగా విసంధి నిషిద్ధము. అనగా వాక్యారంభమున తప్ప' అచ్చులు స్వతంత్రముగా (వ్యంజన రహితముగా) నుండుట కూడదు.

దీనికి అపవాదములు.

(అ) ప్రాచీన వాఙ్మయములో నెల్ల చోట్లను విసంధి వాడినట్లే గనుపించును. వేదమంత్రములలో పలుతావుల వచ్చు 'య, వ'లను 'ఇ. ఉ'లుగనే యుచ్చరించవలసియుండును. ఒక్కొక్కసారి దీర్ఘస్వరమును రెండు హ్రస్వస్వరములుగా ఉచ్చరించవలసి యుండును. ఋక్కుల మాత్రా ఛందస్సును గమనించిన నీ విషయము తెల్లమగును. ఉదా॥ ఈ'డ్యోనూ'తనైరుత'లో గాయత్రీ ఛందస్సు యొక్క ఎనిమిది మాత్రల పాదమేర్పడుటకు 'ఈడియో నూతనైరుత'యని చదువవలసియుండును. ఇట్లే 'వార్యాణామ్'ను 'వారి ఆనా ఆమ్'అనియు, 'స్వశ్వియమ్'ను 'సు అశ్ వి అమ్'అని చదువవలసియుండును. బ్రాహ్మణములలోని, త్వచ్, స్వర్, ద్యౌస్మున్నగు వానిని రెండక్షరముల పదములుగను; వ్యాన, సత్యమ్, ... మూడక్షరముల పదములుగను; 'రాజన్య, నాలుగక్షరముల పదముగను చదువవలయును. ఈ విసంధి రానురాను తగ్గిపోయి అర్వాచీనవాఙ్మయములో కనుపించకుండ పోయెను. ఈ ప్రక్రియ యాధునికము. ఒకప్పుడు వైకల్పికముగానుండిన స్వరసంధికాలక్రమమున నిర్బంధము చేయబడినది. దీని ననుసరించి ప్రాచీన లిఖితపుస్తకములలో మార్పులు చేయబడి యుండవచ్చును.

(ఆ) కొన్ని స్వరములకు సంధిలేదు. ఇట్టివానికి ఏస్వరము పరమైనను అవి మారవు. వీనిని ప్రగృహ్యము లందురు. అవి ఈ క్రిందివి.

(I) సుబంత ప్రక్రియ (విభక్తి ప్రక్రియ) లోను; క్రియాప్రక్రియలోను, వచ్చు ద్వివచనాంతములగు ఈ, ఊ, ఏ, లకు సంధిలేదు.

ఉదా॥ గిరీ ఆరోహతమ్; బంధూ ఆసాతే ఇమౌ;.........

(2) సర్వనామము 'అమీ' (ప్రథమా, బహువచనము), వేదములోవచ్చు సర్వనామశబ్దములు అస్మే', యుష్మే', త్వే'

(3) అకారమునకు పరముగా ఉకారము (పొడి) రాగా మారిన ఓకారము ప్రగృహ్యము.

ఉదా॥ అథ + ఉ=అథో; మో; నో;.........

(4) ప్లుతస్వరము.

(5) సంబోధనలో వచ్చు పదాంతములు — అహో; హో; ఆ; ... ...
పై వానికి కొన్ని యపవాదములును వేదమునకలవు. కాని వానిని వదలివేసితిమి.

<u>అచ్సంధికి సంబంధించిన నియమములన్నియు. అంతస్సంధికిని, బహిస్సంధికిని సమానములే.</u>

## 2.2 సవర్ణ దీర్ఘ సంధి

సరూపములగు స్వరములు (హ్రస్వములుగానీ, దీర్ఘములుగానీ) కలిసి యదే రూపమునకు జెందిన దీర్ఘస్వరమగును. ఇట్లు

అ + అ = అ + ఆ = ఆ + అ = ఆ + ఆ = ఆ

ఇ + ఇ = ఇ + ఈ = ఈ + ఇ = ఈ + ఈ = ఈ

ఉ + ఉ = ఉ + ఊ = ఊ + ఉ = ఊ + ఊ = ఊ.

ఋ + ఋ = ... ... ... = ౠ

ఉదా॥ సచ + అప్రజః = సచాప్రజః

అతి + ఇవ = అతీవ

సు + ఉక్తమ్ = సూక్తమ్.

రాజా + ఆసీత్ = రాజాసీత్

అధి + ఈశ్వరః = అధీశ్వరః

జుహు + ఉపభృత్ = జుహూపభృత్

పితృ + ఋణః = పితౄణః

**2.3** 'అ'కు ('ఆ'కుగాని) పరముగా ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఐ, ఓ, ఔ, లువచ్చిన నది క్రమముగా ఏ, ఓ, అర్, అల్, ఐ, ఐ, ఔ, ఔలుగా మారును.

ఉదా॥ రాజ + ఇంద్ర = రాజేంద్ర

హిత + ఉపదేశః = హితోపదేశః

మహా + ఋషి = మహర్షి

సా + ఇవ = సేవ

రాజ + ఐశ్వర్యమ్ = రాజైశ్వర్యమ్

దివా + ఓకసః = దివౌకసః

జ్వర + ఔషధమ్ = జ్వరౌషధమ్

సూచనలు—

(1) మూడుగాని, అంతకుమించిగాని స్వరములు వరుసగావచ్చినచో, మొదటి రెంటిని సంధించి, ఆవచ్చినదానితో మూడవపదానిని సంధించవలయును—తర్వాత నాలుగవదానిని—తర్వాత ఐదవదానిని,... ...

ఉదా॥ ఇంద్ర + ఆ + ఇహి = ఇంద్రా + ఇహి = ఇంద్రేహి
(ఇంద్రైహికాదు)

(2) పై జెప్పబడిన రెండురకముల సంధులలో (2.2 మరియు 2.3) స్వరవిషయమును గమనించిన ఈ క్రింది విషయములు తెల్లమగును.

ఉదాత్తము + ఉదాత్తము = ఉదాత్తము; అనుదాత్తము + అనుదాత్తము అనుదాత్తము.

స్వరితము + స్వరితము = ఇది ఎప్పుడును సంభవించదు.

స్వరితము + ఉదాత్తము = ఉదాత్తము : (దీనిలోమధ్య వచ్చిన యనుదాత్తము ఎగిరిపోయినది)

అనుదాత్తము + ఉదాత్తము = ఉదాత్తము.

కాని ఉదాత్తము + అనుదాత్తము = స్వరితము (స్వతంత్రము) కావలయునుగదా!! పాణినియు దీనిని ఒప్పుకొనెను. ఐతే భాషలో నిట్టివి సాధారణముగా (శతపథ బ్రాహ్మణములోతప్ప) స్వరితములుగా గుర్తింపబడియుండవు. సాధారణముగా దీర్ఘస్వరములుగాని, సంయుక్తాక్షరములు గాని స్వరితములుగా గుర్తింపబడవు. దీనికి రెండే రెండు అపవాదములు తైత్తిరీయ సంహితలో ఇ' + ఇ = ఈ (ఉదా॥ దివి' + ఇవ = దివీ'వ) ; ఉ' + ఉ = ఊ (ఉదా॥ సు' + ఉద్గాతా = సూ'ద్గాతా)

**2.4** 'ఇ,ఉ, ఋ'లకు విరూపస్వరములుగాని, సంయుక్త స్వరములుగాని పరమైనపుడు అవి తమ సజాతీయములగు అంతస్థములుగా మారును. అనగా ఇకు బదులు య్; ఉకుబదులు వ్; ఋకు బదులు ర్ వచ్చును.

ఉదా॥ ఇతి + ఆహ = ఇత్ + య్ + ఆహ = ఇత్యాహ.

మధు + ఇవ = మధ్ + వ్ + ఇవ = మధ్వివ

దుహితృ + అర్థే = దుహిత్ + ర్ + అర్థే = దుహిత్రర్థే

స్త్రీ + అస్య = స్త్రీ + య్ + అస్య = స్త్ర్యస్య

వధూ + ఐ = వధ్ + వ్ + ఐ = వధ్వై

(అ) అంతస్సంధిలో పలుచోట్ల ఇ, ఉ లు ఇయ్, ఇవ్‌గా మారుటయు కలదు. ముఖ్యముగా ఏకాక్షర పదములలోను, రెండు మూడు వ్యంజనముల తర్వాత వచ్చిన 'య, వ లు' గూడను వ్యంజనములగుటచే ఉచ్చారణ కాఠిన్య మేర్పడు చోటులలోను ఇది జరుగును. క్వాచిత్కముగా పదసంధి యందును ఇది కానవగును.

ఉదా॥ త్రి + అవి = త్రియవి; వి + అంగ = వియంగ; సు + ఇత = సువిత ఒకేమాట రెండు విధములుగా వ్రాయబడిన సన్నివేశములును ప్రాచీన వాఙ్మయమున కలవు :

ఉదా॥ స్వ॑ర్ లేక సు॑వర్ ; తన్వే॑ లేక తను॑వే ; ఋధ్న్యే లేక ఋధ్ని॑య.

(ఆ) ఇక స్వర విషయమున గమనింపదగినది. ఉదాత్తము + అనుదాత్తము = స్వరితము. ఇట్టి స్వరితములు మిగిలిన జాతి స్వరితములకంటె నెన్నోరెట్లు అధికము.

ఉదా॥ వ్యు॑ష్టి = వి॑ + ఉష్టి ; అభ్య॑ర్చతి = అభి॑ + అర్చతి ; నద్యౌ॑ = నదీ॑ + ఔ;

స్వి॑ష్ట = సు॑ + ఇష్ట ; తన్వ॑స్ = తను॑ + అస్;

ఋకారముతో వచ్చిన స్వరితము, ఒకే ఒక పదమున శతపథ బ్రాహ్మణములో విజ్ఞాత్రే॑ త॑త్ = విజ్ఞా + తృ॑ + ఏ త॑త్ అని కలదు.

## 2.5 సంయుక్త స్వరముల మార్పు

సంయుక్త స్వరమునకు పరముగా ఏయచ్చు వచ్చినను, ఆ సంయుక్త స్వరములోని ఇకార, ఉకారములు, తమ సజాతీయములగు నంతస్థములుగా మారును. ఇట్లు: ఏ—> అయ్; ఐ—> ఆయ్; ఓ—> అవ్; ఔ—> ఆవ్; ఇప్పటి స్వరములో ఏ భేదమును రాదు. కారణము పూర్వస్వరూప స్వరములే పరరూపమున నుండుట.

దీనికి ఉదాహరణములు అంతస్సంధిలో నుండియే లభించును.

నే + అ = నయ; నై + అ = నాయ; భో + అ = భవ; భౌ + అ = భావ.

(అ) బహిస్సంధి లేక పదసంధిలో పైవిధముగా వచ్చిన యంతస్థమును సాధారణముగా వదలివేసి, ఏర్పడిన విసంధిని యట్లే యుంచుదురు

ఇట్లు (అతప్ప చూ॥ 2.5 (ఈ)) అచ్చునకు పూర్వము ఏకారము అకారముగను ఐకారము ఆకారముగను మారును. ఐతే అర్వాచీన వ్యాకర్తలీయ యకారలోపము ఐచ్ఛికమందురు.

తే + ఆగతాః = త్ + ఏ + ఆగతాః = త్ + అ + ఇ + ఆగతాః = త్ + అ + య్ + ఆగతాః = త ఆగతాః

ఇట్లే నగరే + ఇహ = నగర ఇహ

తస్మై + అదదాత్ = తస్మా అదదాత్

స్త్రియై + ఉక్తమ్ = స్త్రియా ఉక్తమ్.

(ఆ) ఇక అంతస్థము 'వ్' విషయమున :— ఓకారాంత పదములు బహు స్వల్పములు వానిలో ఆశ్చర్యార్థకములు మొదలగువానిలోని ఓకారమట్లే నిలచి యుండును. ఉకారాంతనామవాచకముల సంబోధన ఏకవచనములో వచ్చు ఓకారముయొక్క సంధిలో. ఒకప్పుడు వకారము నిలుచును. మరియొకప్పుడు నిలువదు. 'గో' అను ప్రకృతి విషయమున నిట్లే

(ఇ) ఔనుండి వచ్చిన వకారము, ఆవ్ లోనిది, సాధారణముగ నట్లే నిలచి యుండును.

ఉదా॥ తౌ + ఏవ = త్ + ఔ + ఏవ = త్ + ఆవ్ + ఏవ = తావేవ

ఉభౌ+ఇంద్రాగ్నీ = ఉభ్+ఆవ్+ఇంద్రాగ్నీ
= ఉభా వింద్రాగ్నీ;

(ఈ) ఏ, ఓ,లకు పరమైన 'అ' లోపించును. దాని స్థానమున అవగ్రహము గుర్తువేయుదురు. స్వర విషయమున అ లోపించనట్లుగా భావించవలయును.

ఉదా॥ తే'+అబ్రువన్ = తే'ఽబ్రువన్
సో'+అబ్రవీత్ = సో'ఽబ్రవీత్
హింసితవ్యో'+అగ్నిః = హింసితవ్యో'ఽగ్నిః
య'ద్+ఇ'న్ద్రః+అ'బ్రవీత్ = య' దింద్రో'ఽబ్రవీత్
య'ద్ రాజన్యో + అబ్రవీత్ = య'ద్రాజన్యో'ఽబ్రవీత్

సూచన :—

పైన జెప్పిన అకారలోపము, అర్వాచీన వాఙ్మయమున సర్వ సాధారణమైనను, వేదమున చాలా అరుదు. ఇది మొదట వైకల్పికముగా నుండినను రానురాను తప్పనిసరియైనట్లు స్పష్టము.

**2.6** పై జెప్పబడిన సూత్రములకు కొన్ని యపవాదములు కలవు వానిలో ముఖ్యములగు వానిని ఈ క్రింద పొందుపరచుచున్నాము.

(అ) అంతస్సంధిలో

ధాతువునకు మొదటనున్న 'ఇ, ఉ, ఋ' లు వానికి ముందు ఉపచయముగావచ్చు అకారముతో గలిసి గుణములుగా మారుటకు బదులు వృద్ధులుగా నేర్పడును.

ఉదా॥ అ+ఇత = ఐత
అ+ఉభ్నాత్ = ఔభ్నాత్
అ+ఋధ్నోత్ = ఆర్ధ్నోత్

(ఆ) యకు పూర్వమువచ్చిన ప్రత్యయాంతమగు ఓకారము అవ్‌గా మారును.

ఉదా॥ గో+య = గవ్య; గో+యూతి = గవ్యూతి.

## 2.5 సంయుక్త స్వరముల మార్పు

సంయుక్త స్వరమునకు పరముగా ఏయచ్చు వచ్చినను, ఆ సంయుక్త స్వరములోని ఇకార, ఉకారములు, తమ సజాతీయములగు నంతస్థములుగా మారును. ఇట్లు: ఏ—> అయ్; ఐ—> ఆయ్; ఓ—> అవ్; ఔ—> ఆవ్; ఇచ్చట స్వరములో ఏ భేదమును రాదు. కారణము పూర్వరూప స్వరములే పరరూపమున నుండుట.

దీనికి ఉదాహరణములు అంతస్సంధిలో నుండియే లభించును.

నే + అ = నయ; నై + అ = నాయ; భో + అ = భవ; భౌ + అ = భావ.

(అ) బహిస్సంధి లేక పదసంధిలో పైవిధముగా వచ్చిన యంతస్థమును సాధారణముగా వదలివేసి, ఏర్పడిన విసంధిని యట్లే యుంచుదురు

ఇట్లు (అతప్ప సూ॥ 2.5 (ఈ)) అచ్చునకు పూర్వము ఏకారము అకారముగను ఐకారము ఆకారముగను మారును. ఐతే అర్వాచీన వ్యాకర్తలీయ కారలోపము ఐచ్ఛికమందురు.

తే + ఆగతాః = త్ + ఏ + ఆగతాః = త్ + అ + ఇ + ఆగతాః = త్ + అ + య్ + ఆగతాః = త ఆగతాః

ఇట్లే నగరే + ఇహ = నగర ఇహ
తస్మై + ఆదతాత్ = తస్మా ఆదదాత్
స్త్రియై + ఉక్తమ్ = స్త్రియా ఉక్తమ్.

(ఆ) ఇక అంతస్థము 'వ్' విషయమున :— ఓకారాంత పదములు బహు స్వల్పములు వానిలో ఆశ్చర్యార్థకములు మొదలగువానిలోని ఓకారమట్లే నిలచి యుండును. ఉకారాంతనామవాచకముల సంబోధన ఏకవచనములో వచ్చు ఓకారముయొక్క సంధిలో. ఒకప్పుడు వకారము నిలుచును. మరియొకప్పుడు నిలువదు. 'గో' అను ప్రకృతి విషయమున నిట్లే

(ఇ) ఔనుండి వచ్చిన వకారము, ఆవ్ లోనిది, సాధారణముగ నట్లే నిలిచి యుండును.

ఉదా॥ తౌ + ఏవ = త్ + ఔ + ఏవ = త్ + ఆవ్ + ఏవ = తావేవ

ఉభౌ+ఇంద్రాగ్నీ = ఉభ్+ఆవ్+ఇంద్రాగ్నీ
= ఉభా వింద్రాగ్నీ;

(ఈ) ఏ, ఓ,లకు పరమైన 'అ' లోపించును. దాని స్థానమున అవగ్రహము గుర్తువేయుదురు. స్వర విషయమున అ లోపించనట్లుగా భావించవలయును.

ఉదా॥ తే'+అబ్రువన్ = తే'ఽబ్రువన్
సో'+అబ్రవీత్ = సో'ఽబ్రవీత్
హింసితవ్యో'+అగ్నిః = హింసితవ్యో'ఽగ్నిః
య'ద్+ఇ'న్ద్రః+అ'బ్రవీత్ = య' దింద్రో'ఽబ్రవీత్
య'ద్ రాజన్యో + అబ్రవీత్ = య'ద్రాజన్యో'ఽబ్రవీత్

సూచన :—

పైన జెప్పిన అకారలోపము, అర్వాచీన వాఙ్మయమున సర్వ సాధారణమైనను, వేదమున చాలా అరుదు. ఇది మొదట వైకల్పికముగా నుండినను రానురాను తప్పనిసరియైనట్లు స్పష్టము.

**2.6** పై జెప్పబడిన సూత్రములకు కొన్ని యపవాదములు కలవు వానిలో ముఖ్యములగు వానిని ఈ క్రింద పొందుపరచుచున్నాము.

(అ) అంతస్సంధిలో

ధాతువునకు మొదటనున్న 'ఇ, ఉ, ఋ'లు వానికి ముందు ఉపచయము గావచ్చు అకారముతో గలిసి గుణములుగా మారుటకు బదులు వృద్ధులుగా నేర్పడును.

ఉదా॥ అ+ఇత = ఐత
అ+ఉభ్నాత్ = ఔభ్నాత్
అ+ఋధ్నోత్ = ఆర్ధ్నోత్

(ఆ) యకు పూర్వమువచ్చిన ప్రత్యయాంతమగు ఓకారము అవ్‌గా మారును.

ఉదా॥ గో+య = గవ్య; గో+యూతి = గవ్యూతి.

బహిస్సంధిలో

ఉపసర్గకు చివరనున్న అ, ఆ లతో ధాతువు యొక్క ఆద్యక్షరమగు ఋకారముకలిసి 'ఆర్' అని ఏర్పడును

ఆ + ఋచతి = ఆర్చతి; అవ + ఋచతి = అవార్చతి;

ఉప + ఋషతి = ఉపార్షతి.

(ఈ) 'వహ్' అను ధాతువునుండి వచ్చిన 'ఊహ్' అనురూపమునకు పూర్వముననున్న అకారము గుణరూపమునుగాక వృద్ధిరూపమును వహించును.

ఉదా॥ ప్ర + ఊఢి = ; అక్ష + ఊహిణీ = అక్షౌహిణీ.

## 2. పదాంతమున రాదగు ధ్వనులు

**2.6** సంస్కృతభాషలోని పదముల చివర వచ్చు ధ్వనులు చాలా పరిమితములు. అన్ని రకముల యచ్చులు పదాంతముల యందుండినను, హల్లులలో క్,ట్,త్, ప్,మ్,న్ లును, క్వాచిత్కముగా ఇతర అనునాసికములును తప్ప మరేవియును రావు. ఇతరము లేవైనను వ్యాకరణసూత్రములచే వచ్చినను, వానిని వెంటనే మార్చివేయవలసియుండును. ఇక ప్రక్రియను పొందిన తుదిరూపమునను, జన్య ప్రకృతుల యంతమునను, త్, చ్, న్, మ్, స్, ర్, లు తప్ప మరేవియురావు. (బహు స్వల్పస్థలములలో జ్ వచ్చినను, ఇది చాలా యరుదు) కావున బహిస్సంధిలో హల్సంధి విషయమున, పై యక్షరముల సంధిప్రక్రియను గమనించిన చాలును.

(అ) అచ్చులన్నియు పదాంతములయందు రావచ్చును.

ఇ'ంద్ర; శివ'యా; అ'కారి; నదీ'; వా'తు; చ'మూ; జనయిత్రృ'; అగ్నే;

శివాయై; వా'యో; అగ్నౌ: (బూ ౡ లు పదాంతములలోరావు)

(ఆ) అనునాసికములు కాని స్పర్శములలో (తాలవ్యములు తప్ప) ఏ యక్షరము వచ్చినను, దానిస్థానే అదేవర్గమునకు చెందిన మొదటి యక్షరము (అనగా ఘోషపరుషము) ఉక్షేపింపబడును

అగ్నిమ'థ్ —> అగ్నిమ'త్; సుహృ'ద్ —> సుహృ'త్;

విప'థ్ —> విప'త్; త్రిష్టుభ్ —> త్రిష్టుప్; ... ...

కొన్ని యెడలపై విధముగావచ్చిన మార్పులో, పదాంతముననున్న సరళ ఘోషముపోగా, దానిమొదట సరళాక్షరమున్న నది ఘోషత్వమును వహించును.

దఘ్ —> ధక్; బుధ్ —> భుత్; ......

(ఇ) ఇక చవర్గ విషయమున, ఇది జన్యవర్గముగావున, పదాంతమున నున్న 'చ్', దాని పూర్వరూపమగు 'క్' గా మారును. వా'చ్ —> వా'క్; అంహో ము'చ్ —> అంహోముక్;

చివరనున్న 'ఛ్', ట్‌గా మారును.

ప్రాఛ్ —> ప్రాట్;

జకారమొకప్పుడు దాని పూర్వరూపమగు కకారముగను. ఒకప్పుడు టకారముగను మారును: భిష'జ్ —> భిష'క్; విరా'జ్ —> విరా'ట్; ... 'ఝ్' ఎప్పుడును పదాంతమునరాదు.

(ఈ) అనునాసికములలో మ్, న్‌లు మాత్రము చాలా విరివిగా పదాంతముల వచ్చుచుండును. మిగిలిన వానికి వ్యాప్తి తక్కువ.

కాని ధాతువులలోనున్న చివరి మకారము, నకారముగా మారును.

క్రమ్ —> అకరన్; గమ్ —> అగన్; అజగన్; అగనీగన్;

నమ్ —> అ'నాన్; శమ్ —> ప్రాశన్; ... మొదలగునవి.

(ఉ) అంతస్థములలో కేవలము 'ల్' మాత్రము రాగలదు. కాని ఇది చాలా అరుదు

ర్, ఎల్లప్పుడును విసర్గగా మారును (దీని పరుషరూపమగు స్ వలె)

(ఊ) ఊష్మములలో 'స్' ఎల్లప్పుడును విసర్గగా మారును. (లేనిచో నిది వచ్చినంత విరివిగా మరియే యక్షరమును రాదు)

'శ్' (తాలవ్యమగు జ్ వలె) ఒకప్పుడు క్ గను, ఒకప్పుడు 'ట్' గను మారును.

దిశ్ —> దిక్; విశ్ —> విట్;

ఇదే విధమున 'ష్' మార్పుజెంది ట్ యగును. ప్రావృష్ —> ప్రావృట్ క్ష్ యను సంయుక్తాక్షరము ష్ వలెనే వ్యవహరించును.

(ఋ) ఎప్పుడును పదాంతమున హ్ రాదు వచ్చినచో నది వెంటనే (శ్, జ్ లవలె) క్ గనో, ట్ గనో, లేక త్ గనో మారును కారణము దీనికి పూర్వరూపము ఘ్ యో, ధ్ యో యై యుండుట. ఇట్లు చివరి హల్లుయొక్క

అఘోషీకరణముచే కొన్ని ధాతువుల మొదటనున్న అఘోషసరళములు ఘోషత్వమును బొందును (చూ. 2.6. (అ)).

(ఋ) విసర్గయు, అనుస్వారమును ఎప్పుడును పదాంతములు కావు. విసర్గము, స్, ర్ కును, అనుస్వారము మ్ కును ప్రతిగా నిక్షేపింపబడియుండును.

(౧) కావున అచ్చుల తర్వాత పదాంతముల యందు రాదగిన ధ్వనులు ః, మ్, స్, త్, క్, ప్, ట్ లు మాత్రమే. అప్పుడప్పుడు వచ్చునవి ఙ్, ల్, ణ్ లు; అనుస్వారము మాత్రము.

(౨) పదాంతమున సాధారణముగా ఒక హల్లు మాత్రమే యుండదగును. వ్యాకరణ ప్రక్రియచే అనేక హల్లులు వచ్చినచో చిట్టచివరది వదలివేయబడును. ఇంకను అనేక హల్లులుండిన మరల చివరది,... ఇట్లే వదలివేయుచు ఒకే హల్లు నిలచువరకును వదలివేయవలయును.

ఉదా॥ తుదన్త్స్ —> తుదన్త్ —> తుదన్; ఉదఙ్క్స్ —> ఉదఙ్క్ —> ఉదఙ్

పై సూత్రమునకు అపవాదముగా ధాతువులలో రకారమును వెన్నంటి వచ్చు స్పర్శములు (అనునాసికములుగానివి) అట్లే నిలచియుండును.

ఉదా॥ ఊర్జ్ —> ఊ'ర్క్; వృజ్ —> వర్క్; వృత్ —> అవర్త్ మృజ్ —> అ'మార్ట్.

(ఎ) పదాంతములనున్న స్పర్శములు, వర్గాంతరస్పర్శములుగా మారుట గూడ ఒక్కొకచోకలదు (తాలవ్యముల విషయమున నిట్టిది పైన జెప్పబడినది) దంత్యములు మూర్ధన్యములుగా మారుట ముందుముందు చెప్పబడును. ఒకప్పుడు పదాంతముననున్న తకారము కకారముగా మారును.

ఉదా॥ జ్యో'క్; తాజ'క్ (తాజ'త్ గూడా కలదు); బు'ధక్ (బు'ధత్‌గాక)

ఇవిగాక కకు'ద్ —> కకు'భ్; వగైరా

## 3. అఘోషీకరణము

**2.7** అచ్చునకుగాని, యంతస్థమునకుగాని, యనునాసికమునకుగాని పూర్వమందున్న ఘోషములు ఎట్టి మార్పును జెందవు అట్లుగాక అనునాసికముగాని యితర స్పర్శమునకును, ఊష్మమునకును ముందుండిన ఘోషస్పర్శము తన ఘోషత్వమును కోల్పోవును. కావున నిట్టి ఘోషమునకు ద్విత్వము రావలయు

సనిన, దాని పూర్వమున, దాని యను రూపమగు అఘోషవ్యంజనము నతికించిన జాలును.

కొన్ని ధాతువులలో అంతమందున్న ఘోషసరళములు ఘ్, ఢ్, భ్, హ్ (దీని పూర్వరూపములు ఘ్, ధ్, భ్ లు కావున) తమ ఘోషత్వమును కోల్పోయినచో, ఆధాతువులయొక్క మొదటనుండిన యఘోష సరళములు (గ, ద, బ) ఘోషత్వమును పొందును. పై గుణములు గలిగిన ధాతువులు కొన్ని

| | | |
|---|---|---|
| ఘ్ | అంతమున గలవి | దఘ్ మొదలగునవి |
| హ్ | ,, | దహ్; దిహ్; దుహ్; ద్రుహ్; దృహ్; గుహ్; గ్రహ్ |
| ధ్ | ,, | బన్ధ్; బాధ్; బుధ్; |
| భ్ | ,, | దభ్; |

# 4. పరుషసరళముల సంలయము, మృదులీకరణము

**2.8** ఈ ప్రక్రియలో అంతస్సంధికిని బహిస్సంధికిని భేదము కలదు.

అంతస్సంధిలో :

ప్రత్యయమునకు మొదటనున్న అచ్చుగాని, అంతస్థముగాని, అనునాసికముగాని తత్పూర్వమునన్న ప్రకృత్యంతవ్యంజనముపై నెట్టి ప్రభావమును గలిగియుండదు.

(సూత్రమునకు కొన్ని అపవాదములు కలవు పంత్, మంత్, అంతమున గల జన్యప్రకృతులలో, పూర్వమున్న వ్యంజనమునకు మార్పువచ్చును.

ఉదా॥ ప్ర'పద్వన్త్; విద్యున్మన్త్;

బహిస్సంధిలో :

ప్రథమమునసున్న ఏ మృదులమైనను (అచ్చుగాని, సరళముగాని, అంతస్థముగాని, అనునాసికముగాని, హకారముగాని) తత్పూర్వముననున్న పరుషమును సరళముచేయును. అంత్యములగు అచ్చులుగాని, అనునాసికములుగాని, ల్ గాని, ఈ ప్రక్రియలో నెట్టి మార్పును బొందవు.

(అ) పై జెప్పబడిన సందర్భములలోతప్ప పరుషసరళముల కలయిక జరుగదు. అట్లు జరిగినచో నొకదానిలో నొకటి విలీనమగును. సాధారణముగా

పూర్వపుది దాని తర్వాత వచ్చుదానిలోను ఒక్కొక్కప్పుడు (చూ. 2 8. (అ))
పరమందున్నది తత్పూర్వపదాంతమునను విలీనమగును. ఇట్టివి
ఉదా॥

అంతస్సంధిలో : అ'త్సి; అ'త్తి; అత్థ'న్; ఆ'త్త; (అద్ + సి;... వగైరా)
శగ్ధి, శగ్ధ్యమ్, ... (శక్ + ధి, ...)
బహిస్సంధిలో : అ'భూద'యం, జ్యో'గ్జీవ, ష'డశీత'యః,
త్రిష్టు'భపి, దిగ్గజ, షడహ',
అర్చుద్ధామ. బృహ'ద్భాను, అబ్జ',...

(అ) ధాతువుయొక్క అంతమునందున్న సరళ ఘోషమునకు త్, థ్ లు పరమైనపుడు ఈ విలీనము రెండవదిశలో జరుగును. ఈ కలయిక మొత్తమును సరళమై, పూర్వమందున్న ఘోషత్వము ప్రత్యయపు మొదటి యక్షరమునకు మారును. ఇట్లు

ఘ + [త / థ] —> గ్ధ; ధ + ధ —> ద్ధ;...
బుధ్ + త = బుద్ధ; రున్ధ్ + [తస్ / థస్] = రున్ద్ధ'స్
భ + [త / థ] = బ్ధ; లభ్ + త = లబ్ధ; లభ్ + త్వా = లబ్ధ్వా'

ఇదిగాక హ విషయమునను ఇదేసూత్రము వర్తించును. ఏలననగా దీని పూర్వరూపము ఘ కావున.

దుహ్ + త = దుగ్ధ; దో'గ్ధుమ్,...

ఇ) బహిస్సంధిలో అనునాసికమునకు ముందున్న స్పర్శమేదైనను సరళముగా మారును, లేదా అదేవర్గమునకు జెందిన యనునాసికముగాం తయారగును.

ఉదా॥ త'ద్ + న'మస్ —> త'న్న'మస్, వా'గ్ + మే —> వాఙ్మే', ...
బ'డ్ + మహా'న్ —> బణ్మహాన్ త్రిష్టుభ్ + నూనమ్ —> త్రిష్టుమ్నూనమ్

సూచన :

అనునాసికముగా మారుటయే ప్రాతిశాఖ్యలచేతను విధింపబడినది. ఇది తర్వాతి వైయాకరణుల చేతను అంగీకరింపబడినది. ముఖ్యముగా మాత్రా, మయ ప్రత్యయములకు ముందువచ్చు స్పర్శము తప్పక అనునాసికముగా మారును.

ఉదా॥ వాక్ + మయ = వాఙ్మయ, తద్ + మాత్రా = తన్మాత్రా,
మృద్ + మయ = మృణ్మయ

(ఈ) హకారమునకు ముందువచ్చు స్పర్శము సరళముగా మారును. తరువాత వచ్చు హకారము యథాతథముగా నుండవచ్చును లేదా పూర్వాక్షరమున కను రూపమగు సరళ ఘోషముగా మారవచ్చును.

ఉదా॥ తత్ + హి = తద్హి లేక తద్ధి
వా'క్ + హు'తః = వాగ్ఘుతః
సత్ + హోతా = సద్ధోతా
తత్ + హిత = తద్ధిత.

## 2.9 అంతములనున్న సకారముయొక్కయు రకారముయొక్కయు మార్పులు.

జన్య ప్రకృతుల యంతమునను, విభక్తి ప్రత్యయముల యంతమునను, క్రియాప్రక్రియలోని ప్రత్యయముల యంతమునను, సకారము చాలా విరివిగా వచ్చుచుండును. కావున దీని సంధి ప్రక్రియ దెలియుట ఎంతయేని ముఖ్యము.

సంధి విషయమున సకార రకారములు రెండును సమానధర్మములుగలిగి యున్నవి. కావున వాని మార్పులను ఒకేమారు అధ్యయనముజేయుట యుచితము. ఇదిగాక సంధిప్రక్రియలో 'స్' పరుషముగను, 'ర్' దాని యనురూపమగు సరళముగను పనిజేయును. అనగా, పరుష, సరళముల కలయికలో, స్,ర్,లు క్రమముగా పరుష సరళములవలె పనిజేయును.

(1) ధాత్వంతమున వచ్చు ర్, పరుషముగానీ, సరళముగానీ పరమైనను అది యట్లే నిలచియుండును.

ఉదా॥ పి'పర్షి; చతుర్థ'; చతు'ర్షు; పూర్షు'; ...

(2) ధాత్వంతమునవచ్చు స్‌కు పరమున పరుషమువచ్చిన నది యట్లేనిలిచి పోవును. (సాధారణముగా) సకారము వచ్చినను నది యట్లే నిలిచి యుండును.

ఉదా॥ శా'స్సి; శాస్స్వ; ఆస్సే; ఆశీష్షు; ...

ఐతే నామవాచక విభక్తి ప్రత్యయములలో, భకారమునకు పూర్వమున వచ్చు సకారము, పద సంధిలోవలె (బహిస్సంధి) పనిజేయును.

ఉదా॥ ఆశీర్భిః ; ...

క్రియాప్రత్యయములలో వచ్చు ధకారమునకు పూర్వమున నిదిలోపించును తత్పూర్వము 'ఆ' యుండిన

ఉదా॥ శాధి; శశాధి; చకాధి; అధ్వమ్; శాధ్వమ్; అరాధ్వమ్; వధ్వమ్ (వస్ : దుస్తులు తొడుగుకొను);

(అ) (1) విరామమునకు ముందున్న 'స్' లోపించి విసర్గయగును

(2) అదే వర్గమునకు (అనగా దంత్యములకు) చెందిన త, థ లకు మాత్రము పూర్వముండిన స'కారము నిలచిపోవును.

(3) తాలవ్య, మూర్ధన్య పరుషములకు (అనగా చ, ఛ, ట, ఠ) ముందున్న సకారము సజాతీయమగు ఊష్మముగా మారును— అనగా వరుసగా శ్, ష్ గా మారును.

(4) కంఠ్య, దంత్య పరుషములకు (క, ఖ, ప, ఫ) పూర్వమున నున్న సకారము వరుసగా జిహ్వామూలీయము, ఉపధ్మానీయ ములుగా మారును.

పైవానికి ఉదాహరణములు : తతస్తే; చక్షుస్తే; తతశ్చ; తస్యాశ్ ఛాయా: పాదాష్ టలతి; నలః కామమ్; పురుషః ఖనతి, యశః ప్రాప; వృక్షః ఫలవాన్;

సూచన :—

4వ దానికి అపవాదములనేకములు గలవు. వ్రాతప్రతులలో జిహ్వా మూలీయ, ఉపధ్మానీయములకు బదులుగా విసర్గలే బహుళముగా వచ్చును. అర్వాచీన వాఙ్మయములో నీ యూష్మము, సంయుక్తపదములలోను, వాక్య నిర్మాణములలోను అట్లే యుంచబడును. ప్రాతిశాఖ్యలలో నీ విషయము విపుల ముగా చర్చింపబడినది.

ఉదా॥ నమస్కార; వాచస్పతి; ఆయుష్కామ; పయస్కల్ప;
దివ'స్ పుత్ర'ః; ఇడ'స్పదే'; హిమ'వతస్ పరి; ...

(ఆ) ఊష్మమునకు పూర్వముననున్న సకారము విసర్గగామారును, లేదా పరమున నున్న ఊష్మములో విలీనమగును.

ఉదా॥ ఇన్ద్రిశ్శూరః లేక ఇన్ద్రిః శూరః
మనుస్స్వయమ్ లేక మనుః స్స్వయమ్

కాని సర్వసాధారణముగా విసర్గగానుంచుటయే పరిపాటి.

(ఇ) మృదులమునకు ('ర'కు తప్ప) పూర్వమునను్న సకారము రకారముగా మారును—దానికి పూర్వమున 'అ'గాని 'ఆ'గాని యుండిన తప్ప (చూ॥ 2.9 (ఈ))

ఉదా॥ దేవపతిర్ ఇవ; శ్రీర్ ఇవ; మనుర్ గచ్ఛతి; తనూర్ అప్సు;
స్వస్రుర్ అజనయత్; తయోర్ అదృష్టకామః; సర్వైర్ గణైః;
అగ్నేర్‌మన్వే;

(ఈ) అంతమునను్న అస్, ఆస్ లకు ప్రత్యేకధర్మములు కలవు.

I 'అ'కు గాని, మృదులవ్యంజనమునకుగాని, పూర్వమునను్న 'అస్' ఓగా మారును--పరమునను్న అకారము లోపించును.

ఉదా॥ సలోనామ; బ్రహ్మణ్యోవేదవిత్; మనోభవ:
హంతవ్యోసి, అన్యోన్య (అన్యస్ + అన్య)
యశోర్థమ్ (యశస్ + అర్థమ్)

అట్లుగాక 'అస్'కు పరముగా నే ఇతర అచ్చువచ్చినను('అ'గాక)దానిలోని సకారము లోపించి 'అ'గా నిలచును.

ఇట్లేర్పడిన విసంధి యట్లే యుండును.

ఉదా॥ బృహదశ్వ ఉవాచ, ఆదిత్య ఇవ, న'మఉక్తి, వ'స్యఇష్టి, దీనికి కొన్ని అపవాదములును కలవు. వానిలో ముఖ్యమైనది—

ప్రథమావిభక్తి పుంలింగ సర్వనామములగు స'స్. ఏష'స్, స్య'స్ (వేదములో)లకు పరమున ఏ వ్యంజనమువచ్చినను తమచివరిసకారమును పోగొట్టుకొనును.

ఉదా॥ సదదర్శ; ఏషపురుషః, ...

II మృదులమునకు (అచ్చుగాని, హల్లుగాని) పూర్వమునను్న ఆస్‌లోని సకారము లోపించి 'అ' మాత్రము మిగులును. ఇట్లేర్పడిన విసంధి యట్లే నిలచియుండును.

ఉదా॥ బాలాస్ + అవోచన్ ——> బాలా అవోచన్.

(ఉ) అంతమందున్న రకారముయొక్క ధర్మములును ఇట్లేయుండును. (అనగా అవే పరిస్థితులలో 'స్' ఎట్లు ప్రవర్తించునో 'ర్'యునట్లే ప్రవర్తించును.)

(1) విరామమునకు ముందున్న 'ర్' విసర్గగా మారును.

(2) పరుషస్పర్శమునకుగాని, ఊష్మమునకుగాని ముందున్నచో నది యూష్మముగా మారును, లేదా విసర్గయగును.

ఉదా॥ రుదతీ పునః, ద్వాస్ తత్, స్వశ్చ, చతు'శ్ చత్వారింశత్, ప్రాతస్త'న, అన్తస్త్య, చతుష్టయ. ధూస్త్వ. ప్రాతఃకరోతి, అంతఃపాత,

సూచన :—

వేదములో అనేకపదములలో పరుషమునకు పూర్వమున్నను, రకారము నిలచియుండును.

అహర్ప'తి, స్వర్చనస్, స్వర్చక్షుస్, స్వర్పతి, స్వర్షా', స్వర్షతి, ధూర్ష'ద్, ధూర్షః, పూ'ర్పతి, వార్కార్య, ఆశీ'ర్పద, పునర్త్ర, ...

రకు ద్విత్వము ఎప్పుడునురాదు ఒకవేళ రెండురకారములుకలిసి. వచ్చినచో వానిలో నొకటిలోపించి, తత్పూర్వమున నున్న అచ్చుహ్రస్వమగుచో దీర్ఘీకరించబడును.

ఉదా॥ పునారమతే, నృపతీరాజతి, మాతూ'రిహ'న్, జ్యోతీరథ, దూరోహణ', ...

## 2.10 'స్' యొక్క మార్పు 'ష్' గా మరియు 'న్' యొక్క మార్పు 'ణ్' గా.

సూత్రము.

అ, ఆ, క్, ర్—ఇవి తప్ప మిగిలిన ఏ యక్షరమునకు పరమునవచ్చిన దైనను, దంత్యమగు స్, మూర్ధన్యమగు ష్గా మారును — ఈ 'స్' చిట్టచివరిది గాని, లేక దీని వెనువెంటనే ర్ వచ్చినచో గాని, తప్ప.

అనగా 'స్' ఎల్లప్పుడును ష్గా మారును. దీనికి అపవాదములు.

(1) దీనికి పూర్వమున అ, ఆ, క్, ర్లు వచ్చుట.

(2) దీనికి పరమున ర్ వచ్చుట.

(3) ఇది అంత్యముగా నుండుట.

పై విధముగా మార్పిడి కల్గించు అచ్చులను భేదకములనవచ్చును. (Alterants). ఈ భేదకములకును, సకారమునకును మధ్య అనుస్వార ముండినను ఈ మార్పు ఏర్పడును.

ఉదా॥ హవీంషి, పయాంషి, (దీనికి అపవాదము పుంస్)

(అ) కావున సంస్కృత భాషలోని పదముల మధ్య సాధారణముగా 'స్' కనుపించదు—దీనికి పూర్వము అ,ఆ లుండిన తప్ప. దీనికి బదులు 'ష్' యే బహుళముగా కన్పించును.

(ఆ) తర్వాత వచ్చిన రకారము (అపవాదము(2)) ఈ మార్పును ఎట్లు నిరోధించునో ఈ క్రింది యుదాహరణములచే విశదమగును.

ఉస్ర, తిస్ర, తమిస్ర, ... ...

ఇట్లే ధాతువులలో వచ్చు రకారముచేతను ఈ మార్పు నిరోధింపబడును.

ఉదా॥ సిసర్తి, సిస్మృతమ్, సరీసృప, తిస్తిరే, పరిస్రుత్

దీనికి కొన్ని యపవాదములును కలవు.

(ఇ) సంస్కృత వాఙ్మయములోవచ్చు షకారము ఎక్కువగా నీ విధముననే వచ్చును. ఐతే కొన్ని ధాతువులలో స్వతస్సిద్ధముగనే షకారముండును.

ఇట్టివి : కష్, లష్, భష్, భాష్,

(ఈ) అంతస్సంధిలో ఈ మార్పు తేగలుగు సన్నివేశములు:—

(1) స తో మొదలగు ప్రత్యయములు : సు, సి, సే, స్వ, స్, స్న, స్ను, స్య,

ఉదా॥ జుహోషి, శేషే, అనైషామ్, భవిష్యామి. శుశ్రూషే, దేష్ణా, పిత్షు, అకార్షమ్,...

(2) పునర్ద్విత్వధాతువునకు మొదటనున్న సకారము.

ఉదా॥ సిష్యదే, సుష్వాప, సిషాసతి, చోష్కూయతే,

(ఉ) బహిస్సంధిలో గూడ నీ మార్పు చాలా విపులముగా జరుగుచుండును.

ఉదా॥ అభిషా'చ్, ప్రతిష్ఠా', ని'షిక్త, వి'షిత, సుషే'క, యుధిష్ఠిర, గోష్ఠ', అగ్నిష్టోమ', అనుష్టు'భ్, త్రి'షంధి, దివిష'ద్, పరమేష్ఠి'న్, పితృష'ద్, పురుష్టుత,...

పై వానిలో షకారము వచ్చుటకు కారణము భేదకములగు నచ్చులు.

II సూత్రము :

అచ్చునకుగాని న్, మ్, య్, వ్ లకు గాని పూర్వమందున్న నకారము, తత్పూర్వమున (అదేపదములో) ష్, ర్, ఋ, ౠ (అనగా స్పర్శము లుగాని మూర్ధన్యములు) లు ఎంత దూరముననున్నను, ణకారముగా మారును- వీని (ష్, ర్, ఋ, ౠ లకును నకారమునకును) మధ్యన తాలవ్యము (య గాక) గాని, మూర్ధన్యముగాని, దంత్యముగాని యుండిననే తప్ప.

(ఊ) పైజెప్పిన సూత్రమునకు వ్యాప్తి ఎక్కువ. వాఙ్మయములోనున్న ణకారము లన్నియు ఇంచుమించు ఈ సూత్రముచే వచ్చినవే. మార్పు గల్గించు ధ్వనులు గలిగిన ప్రకృతులకు ప్రత్యయములను కలిపినపుడు ఇది బహుళముగా నేర్పడును.

ఉదా॥ రుద్రే'ణ, రుద్రా'ణామ్, వా'రిణే, వా'రిణి, వా'రీణి, ధాత్రీ'ణి, హ'రాణి, ద్వే'షాణి, క్రీణా'మి, శృణో'మి, క్షుభాణ', ఘృణ', కర్ణ', రుగ్ణ', ద్రవిణ, ఇష'ణి, పురాణ', రేక్ణస్, చ'క్షణ, చి'కీర్షమాణ, కృపమాణ,. .

రన్ నుండి యుద్భవించిన ర'ణంతి, ర'ణ్యతి, రరాణ, అరాణిషుః, బ్రహ్మన్ నుండి యుద్భవించిన బ్రహ్మణా, బ్రహ్మ'ణి,...

ఉపసర్గలోనున్న రకారముగూడ ధాతువులోని నకారమును మార్చివేయును. ఇట్టి ఉపసర్గలు : పరా, పరి, ప్ర, నిర్, అంతర్, దుర్,... మొదలగునవి. ఇట్లు ప'రాణయ, ప'రిణీయతే, ప్ర'ణుదస్వ, ప'రాణుత్తి, పరిణామ, ప్రణవ', నిర్ణిజ్, దుర్ణ'శ,...

## 2.11 దంత్యముల పరివర్తనము-మూర్ధన్యములుగను, తాలవ్యములుగను

దంత్యములగు స, త, థ, ద, ధ, న లు మూర్ధన్య, తాలవ్య స్పర్శములతోగాని, లేక ఊష్మములతోగాని సంపర్కమును పొందినపుడు, వానిలో విలీనమై, వరుసగా మూర్ధన్యములుగను తాలవ్యములుగను మారును.

(అ) కావున దంత్యమునకు పరమందున 'ష్' యున్నచో నది మూర్ధన్యముగమారును. ఇందుచే ష్ట, ష్ఠ, ష్ణ లు వాఙ్మయములో చాలా విరివిగా వచ్చును ఢ్ కొన్నిచోట్ల ఢ్ గా మారును.

ఇట్లే అంతస్సంధిలో 'ణ్' కు పరముగా 'న్' వచ్చినపుడు అది మూర్ధన్యమై 'ణ్' గా మారును.

(ఆ) క్షుణ్ణ, క్షీణ్ణ, ఘృణ్ణ, తృణ్ణ, ... మొదలగునవి.

(ఇ) ఉపసర్గ తర్వాత నిషణ్ణ, పరిషణ్ణ, ... మొదలగునవి.

(ఈ) ఇట్లే బహిస్సంధిలో త్ కు పరమున మూర్ధన్యము వచ్చిన నదియు మూర్ధన్యముగ మారును

ఉదా॥ తత్ + టీక —> తట్టీక, తత్ + డయతే—> తడ్డయతే,
తత్ + ఠాలినీ—> తట్ఠాలినీ, తత్ + ఢౌకతే—> తడ్ఢౌకతే,

(ఉ) మూర్ధన్యమునకు పరముగావచ్చిన దంత్యము సాధారణముగా నట్లే నిలచియుండును. ఇట్లు

షట్‌త్రింశత్, ఆనడ్‌దిపః, ఏకరాట్‌త్వమ్, షట్సు, రాట్సు,

(ఊ) దంత్యముల తాలవ్యముల కలయిక (ఇంచుమించు) బహిస్సంధిలోమాత్రమే జరుగును.

క్వాచిత్కముగావచ్చు అంతస్సంధిలో, తాలవ్యమును వెన్నంటి వచ్చు నకారము 'ఞ్'గా మారును.

ఇట్లు యాచ్ఞా; యజ్ఞ; జజ్ఞే: అజ్ఞాత; రాజ్ఞా; రాజ్ఞి;

(ఋ) బహిస్సంధిలో, తాలవ్యమునకు ముందున్న తకారము అదే తాలవ్యముగా మారిపోవును.

ఉదా॥ ఉత్ + చరతి—> ఉచ్చరతి; ఏతత్ + ఛత్రమ్—> ఏతచ్ఛత్రమ్.
విద్యుత్ + జయతే—> విద్యుజ్జయతే; విద్యుత్ + జిహ్వా—> విద్యుజ్జిహ్వా.
సత్ + చరిత—> సచ్చరిత ... ... మొదలగునవి.

(ఋ) తాలవ్యమగు 'శ్'కు పూర్వమున నున్న త్,న్‌లు దానిలో విలీనమై చ్, జ్ + లుగా మారును. తరువాత వచ్చిన శ్ గూడా ఛ్‌గా మారును.

ఇదా॥ వేదవిత్ + శూరః—> వేదవిచ్ఛూరః

తత్ + శ్రుత్వా—> తచ్ఛ్రుత్వా

— ... ...

## 2.12 అంత్యములగు న్, మ్ ల మార్పులు

I అంతముననున్న నకారము యొక్క మార్పు.

(అ) ధాత్వంతముననున్న నకారము దాని తర్వాతవచ్చిన యూష్మముతో విలీనమై అనుస్వారమగును (ఇది అంతస్సంధిలోనే జరుగును) ఇట్లు వ'ంశః; వ'ంశ్వ; వ'ంసత్; మ'ంస్యతే; జి'ఘాంసతి

(ఆ) బహిస్సంధిలో జ్, శ్ లకు పూర్వమున్న నకారము వానిలో విలీనమై జ్ గా మారును.

(ఇ) స్, ష్ లకు ముందున్న నకారమట్లే నిలచియుండును. ఐతే ఈ రెంటికిని నడుమ ఒక్కొక్కమారు 'త్' జొనుపుట కద్దు

ఉదా॥ త'న్ ష'ట్ లేక త'న్త్ ష'ట్; మహా'న్స'న్ లేక మహాన్త్స'న్

(ఈ) చ్, ఛ్, త్ లకు ముందున్న నకారము అనుస్వారమై, ఈ రెంటి మధ్యను అదేవర్గమునకు చెందిన ఊష్మము నిక్షేపింపబడును.

ఉదా॥ దేవాన్ + చ—> దేవాంశ్చ.

భవాన్ + ఛిద్యతే—> భవాంశ్ఛిద్యతే

కుమారాన్ + త్రీన్—> కుమారాంస్త్రీన్

అభరన్ + తతః—> అభరంస్తతః

దధన్ + చరుమ్—> దధంశ్చరుమ్,

సూచన :—

పై సూత్రమునకు కారణము చారిత్రికమైనదిగాని భాషాశాస్త్ర సంబంధమైనదిగాదు. ఏలననగా పురాతన వాఙ్మయములో నకారాంతపదములలో నూటికి 75 వంతులు 'న్స'అంతమునగలవి. వానిలోని ఊష్మము రానురాను అంతర్హితమై పై సూత్రములో మాత్రము మిగిలిపోయినది.

కేవలము 'న్' మాత్రము అంతమునగల పదముల సంధిలో ఈ ఊష్మము వేదవాఙ్మయమున కనుపించదు.

(ఉ) జ్, ఙ్ లకు తరువాత ఊష్మవ్యంజనము వచ్చిన, ఈ రెంటికిని మధ్య వరుసగా క్, ట్‌లు నిక్షేపింపబడుట కద్దు—న్ తర్వాత త్ వచ్చినట్లు.

[చూ॥ 2.12.(ఇ)]. ఇట్లు ప్రత్యఙ్ + సోమః—> ప్రత్యఙ్క్ సోమః;

II అంతముననున్న మకారముయొక్క మార్పు.

(ఊ) అంతస్సంధిలో, ధాత్వంతముననున్న మకారము దాని వెంటనే వచ్చిన స్పర్శముతోగాని, ఊష్మముతోగాని విలీనమై వరుసగా స్పర్శమునకను రూపమగు అనునాసికముగనో, అనుస్వారముగనో మారును.

(ఋ) బహిస్సంధిలో పదాంతముననున్న మకారము దాని తర్వాత వచ్చిన హల్లుతో విలీనమగును. ఇది అచ్చులకును, ఓష్ఠ్యములకు ముందు మాత్రమే నిలచి యుండును. ఇట్లే రాజ్‌లోని రకారమునకు ముందు వచ్చిన మకారమట్లే నిలచి యుండును.

ఉదా॥ సమ్రా'జ్; సమ్రా'జ్ఞి; సామ్రాజ్య

## 5. తాలవ్యములు — హ, వీని మార్పులు

**2.13** సంస్కృత వర్ణమాలలోని యక్షరములలో నన్నిటికంటెను అస్థాయి రూపములుగలవి తాలవ్యములు, హకారమును. దీనికి కారణము తాలవ్యములు కంఠ్యములనుండి పుట్టినవగుటచేతను, హకారము ఘ్, ధ్, భ్, లనుండి యుద యించుటచేతను ఒకొక్కప్పుడు, ప్రకృతులయందును, పదములయందును అవి తమ పూర్వరూపములను ధరించును. ఇట్లు

(అ) జననప్రక్రియ (derivation) లో అచ్చునకుగాని, అంతస్థము నకుగాని, యనునాసికమునకుగాని పూర్వముననున్న తాలవ్యములు కంఠ్యములుగా మారుటకద్దు.

(1) అనసర్గయగు 'అ' కు పూర్వముననున్న చకారము, కకారముగా మారుట. అంక', శ్వఙ్క', అర్క', పాక', వాక', శూక', పర్క, మర్క, వృక, ప్రతీక,... రేక, సే'క, మోక, రోక', శో'క, తోక', మ్రోక', ప్రస్క, ...

జకారము గకారముగా మారినవి.

త్యాగ', భాగ', భగ, యాగ, అన్గ, భంగ', సంగ, స్వంగ, ఋంగ, తున్గ, యున్గ, వర్గ, మార్గ, మృగ', సర్గ, వేగ, భోగ, యుగ', యోగ', రో'గ,

హకారము ఘగా మారుట.

అఘ', మఘ', అర్ఘ', దీర్ఘ', దేఘ, మేఘ', ఓఘ, దో'ఘ, ద్రోఘ, మో'ఘ

[ఐతే మరియొక రకమునకు చెందిన జన్యములలో తాలవ్యములు యధా తధముగా నుండుట కద్దు. ఇట్టివి :

అజ', యాజ, శుచ', శోచ, వ్రజ', యుజ, ... ...

ఇట్లే ఇకారమునకు ముందును తాలవ్యములు సాధారణముగా నిలచియే యుండును.

ఉదా॥ అజి'; తుజి'; రు'చి; శ'చి; వివిచి'; ... ]

(2) ఉకారమునకును సాధారణముగా మారుటకద్దు.

ఉదా॥ అంకు; వంకు'; రేకు'; భ్'ృగు; మార్గు'క; రఘు; ...

(3) న్కారమునకు ముందు : భగ్'న; రుగ్ణ' ప్రగ్ణ;...

(ఇందులో జకారము గకారమైనది)

(4) మకారమునకు ముందు (మన్, మన్త్ర, మిన్)

రుక్'మ; అగ్'ర; యుగ్'మ; ...

(దీనియందును మార్పు జకారమునకే)

(5) యకారమునకు ముందున్న తాలవ్యము మారదు.

ఉదా॥ పచ్య; యజ్య; యుజ్య; భుజ్య; ...

(6) ఐతే వకారమునకు ముందు (వ, వన్, విన్, ... ... వాన్స్) తప్పక తాలవ్యము కంఠ్యముగ మారును.

ఉదా॥ ఋకా'వ; పకా'వ; వ'క్వా; వ'క్వమ్; ఋ'క్వన్; రిక్వన్; శుక్వన్; మృగ్వన్; తుగ్వన్; యుగ్వన్; వాగ్విన్; రిరికా'వన్స్; రురుకా'వన్స్, శుశుకా'వన్స్; ...

(అ) ధాత్వంతమునగాని, ప్రకృత్యంతమునగాని, ఉన్న చకారమునకు పరముగా, అచ్చుగాని, యంతస్థముగాని యనునాసికముగాని వచ్చినచో నది 'క్'గా మారును. ఇది సంధి ప్రక్రియలో 'క్'వలె ప్రవర్తించును.

ఉదా॥ వ'క్తి, ఉవక్థ, వ'క్షి; వక్ష్యా'మి; వగ్ధి; వాగ్భి'స్; వాక్షు'; ఉక్త';
ఉక్థ'; వక్త'ర్; ...

(ఇ) అంతమున నున్న శకారము, అంతస్సంధిలో, సకారమునకు పూర్వమున నున్ననే క్ష్ యగును. (కావున శ + స=క్ష); త,థ్ లకు పూర్వమునను న్న ష యగును. ద్,భ్, సు (సప్తమీ విభక్తి బహువచనప్రత్యయము) లకు పూర్వముననున్న, మూర్ధన్యములగు ట్ లేక డ్ యగును.

అ'విక్షత; వేక్ష్యా'మి, వ'ష్టి, విష్ట', ది'దేష్ఠు, దిదిడ్ఢి, విడ్భిః, ...
ఐతే కొన్ని కొన్ని ధాతువులలో 'శ్', థ్, సు లకు ముందు కకారముగా మారుటయుకద్దు. అవి దిశ్; దృశ్; స్పృశ్, ...

(ఈ) అంతమునను న్న జకారము కొన్ని యెడల చకారము వలెను, కొన్ని యెడల శ కారమువలెను వ్యవహరించును

యుజ్ —— > అ'యుక్థాః, అ'యుక్త: యుజ్ క్తే', యుక్తి,
యోక్త్రా, యోక్ష్యా'మి, యుక్షు', యుజ్గ్ధి,

ఈ వర్గమునకు చెందనవి. భజ్, సజ్, త్యజ్, రజ్, సృజ్, మజ్, నిజ్, తిజ్, విజ్ మొదలగునవి. ఇవిగాక అనుసర్గలతో ఏర్పడు జన్యప్రకృతులును ఇవే ధర్మములు కలవి.

మృజ్ —— > అమృక్షత్, మా'ర్ష్టి, మృష్ట', మృడ్ఢి, మృధ'ష్మ్.
ఈ వర్గముదిరుచెందినవి యజ్, భ్రాజ్, వ్రజ్, రాజ్, సృజ్,

(ఉ) అంతమునవచ్చిన ఛ్ (ఇది ప్రఛ్లోనే వచ్చును) శ్ వలెనే ప్రవర్తించును. అంతమున ఎచ్చటను ఛ్ రాదుగాని, దాని ప్రవర్తన ఛ్వలెనని వైయాకరణుల నిర్ణయము

(ఊ) అంతమునను న్న హకారము విచిత్రముగా ప్రవర్తించును. కొన్ని యెడల నిది చ్ వలెను, కొన్ని యెడల శ్ వలెను, మరికొన్నిచోట్ల నిది దంత్యము వలెను ప్రవర్తించును. దీనికి కారణము, దీని పూర్వరూపములు, ఘ్,ధ్,భ్ లగుట.

(1) దుహ్ వర్గములోనివగు దహ్; దృహ్; ముహ్; స్నిహ్ మొదలి ధాతువులలోని హకారము ఘ్ గా మారును వీనినుండి అ'ధక్షమ్; ధోక్ష్యే దుగ్ధ'మ్; దుగ్ధ'; అ'ధోక్, ధు'క్; ధుగ్భి'స్; ధుక్షు' మొదలగు రూపము వచ్చును.

(2) రుహ్ జాతికి చెందిన వహ్; సహ్; మిహ్; రిహ్; లిహ్; గుహ్ దృఙ్హ్; బృహ్ ... ... మొదలగు ధాతువుల జనన్క్రియయందు సకారమ పరమైనపుడు, కంఠ్యమగు కకారమువచ్చి 'క్ష' ఏర్పడును. (ఇది జ్ యొక ధర్మముగూడను) దీనికి (ఇ) లో చెప్పబడిన ధర్మములు వర్తించును.

ఉదా॥ అ'రుక్షత్; రోక్ష్యా'మి, సాక్షీయ'; సక్షా'ణి; తురాషా'ట్; పృ నాషా'డ్; తురాషాట్సు; రూ'ఢ, లే'ఢి, మే'ఢుమ్, లీ'ఢః, లీఢ్వమ్;

ఇట్లే ఇతర ధాతువుల యందును.

(3) నహ్‌లోని హకారమునకు పూర్వరూపము ధ్ కాని ఘ్ కాదు కావుననే దీనిలో దంత్యమువచ్చి,

నత్స్యా'మి; నద్ధ'; ఉపన'ద్భిస్; ఉపానద్యుగ, అనుపానత్క, ... మొదలగు రూపములేర్పడును.

(4) గ్రహ్ ప్రాచీనవేదములోని గ్రభ్ నుండి జన్యము కావున దీని జన్యములలో ఓష్ఠ్యములు వచ్చును.

## 2.14 మూర్ధన్యోష్మమగు ష్.

(అ) సకారము ఏయేపరిస్థితులలో ష్ గా మారునో ఇదివరకే సూచింప బడినది. (చూ॥ 2.10, I)

(ఆ) అంతముననున్న షకారము, అంతస్సంధిలో, శ్ వలె ప్రవర్తించును. ఇట్లు :

(1) త్, థ్ లకు ముందున్న ష్ మార్పు జెందక, మొదటివి దీనిలోనే విలీనమగును.

ఉదా॥ ద్విష్టః, ద్విష్ఠః, ద్వేష్టుమ్, ...

(2) ధ్, భ్, సు, లకు ముందున్న షకారము (అంతస్సంధిలోను, బహిస్సంధిలోను గూడ) మూర్ధన్యమగు ట్ గా మారి, దాని తర్వాత వచ్చిన ధకారమునుగూడను మూర్ధన్యముగ మార్చివేయును.

ఉదా॥ విడ్ఢి, వివిడ్ఢి, ద్విడ్ఢమ్, ద్విడ్భిః, దిట్సు', ...

(3) అంతస్సంధిలో సకారమునకు ముందున్న ష్ (సప్తమీ విభక్తి బహువచనప్రత్యయముగాక. దీని విషయము (4) లో చెప్పబడినది) కకారముగా మారును. ఇట్లు ద్వేక్షి, ద్వేక్ష్యామి, అద్విక్షమ్, ...

## 2.15 పరిశిష్ట విషయములు

I పెంపు, కుదింపు

(1) ఛ్ ఎచ్చట వచ్చినను దానిని ద్విత్వముచేసి చ్ఛ్ యనవలయును. పాణినీయ వ్యాకరణప్రకారము పదములో హ్రస్వస్వరమునకుగాని, దీర్ఘస్వరమునకుగాని లేక ఆ', మా' లను నిపాతములకుగాని పరముగా ఛ్ వచ్చిన నది తప్పక ద్విత్వమగును.

(2) ర్ తర్వాత వచ్చిన ఏ వ్యంజనమైనను (అచ్చునకు పూర్వమున నున్న ఘోషముతప్ప) ద్విత్వమును పొందును. ఇట్లు :

అర్క్క, కార్య్య, అర్త్థ, దీర్గ్ఘ,

ఐతే వ్రాతప్రతులలో కొన్నికొన్ని చోట్ల విధిగా ద్విత్వము రావలసియున్నవుడు అది లేకయే వ్రాయబడియుండును.

ఉదా॥ కార్తికీయ (కృత్తినుండి), వార్తిక (వృత్తినుండి), ...

(3) అనునాసికము వెంట వచ్చిన అనాసిక్యవ్యంజన యుగళములో మొదటిదానిని వదలివేయవచ్చును.

యుఙ్గ్ధి —> యుఙ్ధి, యుఙ్గ్ధ్వమ్ —> యుఙ్ధ్వమ్,

అఙ్క్తమ్ —> అఙ్తమ్, పఙ్క్తి —> పఙ్తి, ...

(4) స్థా, స్తంభ్ లకు ఉపసర్గగా ఉద్ వచ్చినప్పుడు దీనిలోని సకారములోపించును.

ఉత్థన్, ఉత్థిత, ఉత్థాపయ, ఉత్తబ్ధ, ...

II అచ్చుల బలీకరణము దుర్బలీకరణము.

(1) తద్ధిత ప్రక్రియలో (Secondary derivation) పదము యొక్క మొదటి యచ్చునకు వృద్ధియగును.

ఔడులోమి, గౌతమ, ఐకలవ్య, ఆర్ష, ...

(2) ధాతువుల ప్రక్రియలోగాని, జననప్రక్రియలోగాని విరివిగా అచ్చులు తమ నిజస్వరూపమును మాని గుణములుగనో వృద్ధులుగనో రూపొందును.

క్రియాప్రక్రియలో ధాతువులలోని పెక్కు స్వరములకు గుణములు కల్గుచుండుటచే, ధాతువుయొక్క అసలు రూపము గుణముతో జేరియున్నదా? గుణము లేక యున్నదా? యను సందేహము కల్గుచున్నది మొదటివానినే అసలురూపములుగా గ్రహించి వాని ప్రక్రియకు సూత్రములేర్పరచవచ్చును. అచ్చుల గుణీకరణము హిందూ ఐరోపాభాషల సామాన్యధర్మము. ఇది పదములోనున్న ఉదాత్తస్థానము యొక్క మార్పులచే కలుగుచుండును (Shift of accent) గుణాదేశము గలిగినప్పుడు దానిపై బహుళముగా ఉదాత్తము వచ్చిచేరును. ఉదాత్తము, తన స్వస్థానమును వీడి ఏ యచ్చుపై వచ్చి చేరునో, ఆ యచ్చు గుణీకరణముచే బలీయము చేయబడును.

కొన్నిచోట్ల గుణాదేశమునకు బదులు అచ్చులకు దీర్ఘీకరణము గల్గును.

ఉదా॥ దుష్—> దూష'యతి, గుహ్—> గూ'హతి, ...

కొన్ని కొన్ని ప్రయోగములలో ఋకు గుణవృద్ధులుగా వరుసగా ర, రా లు వచ్చును.

ధాతువుల యందును, ప్రత్యయముల యందును ఒక్కొకసారి హల్లునకు ముందుగా నకారము చేర్చి వానిని బలీయములుగా చేయుటకద్దు

ధాతువులలో :

ఉదా॥ అచ్—> అఞ్చ్, గ్రథ్—> గ్రన్థ్, విద్—> విన్ద్,
దశ్—> దన్శ్, ...

ప్రత్యయములలో (సుబంత ప్రత్యయము ) ఏన, ఆనామ్, ఆన్, ...
ఇట్లు అనునాసికములు వచ్చిచేరినవి బలీయములు.

(3) పై ప్రక్రియకు విరుద్ధము దుర్బలీకరణము. దీనిలో ఇదివరకుండిన అనునాసికము లోపించుటయో, గుణవృద్ధులకు బదులు శుద్ధస్వరములు వచ్చుటయో, య, వ, ర లకు బదులు ఇ, ఉ, ఋ లు వచ్చుటయో (దీనిని సంప్రసారణమందురు) జరుగును.

IV పునర్ద్విత్వము. (Reduplication)

ధాతువులకు కొన్ని యెడల పునర్ద్విత్వము వచ్చును.

ఉదా॥ దదా'మి, బిభర్మి, దధౌ', చకా'ర, రిరేచ, లులో'ప, ... . .

ఇట్టివి ఆయా ప్రకరణములలో వివరింపబడును.



# 3. సుబంత ప్రక్రియ లేక విభక్తులు
## అజంత శబ్దములు

**3.1** సంస్కృత భాషలోని నామవాచకములను, విశేషణములను సర్వనామములను సుబంతము లందురు. వీనిలో ప్రతిపదమునకును, లింగవచన విభక్తు లుండును లింగములు మూడు స్త్రీ, పుం, నపుంసకములు వచనములు మూడు ఏకవచన, ద్వివచన, బహువచనములు. విభక్తులు:— ప్రథమ: ద్వితీయ; తృతీయ; చతుర్థి; పంచమి, షష్ఠి; సప్తమి; సంబోధనయను ఎనిమిది విధములు. వీనిలో సంబోధనను మనవైయాకరణులు విభక్తిగా పరిగణించరు వీనిని వరుసగా కర్తృ, కర్మ. కరణ; సంప్రదాన; అపాదాన, సంబంధ, అధికరణ, సంబోధనా విభక్తు లందరు ఈ విభక్తులకు సంబంధించిన ప్రత్యయములను విభక్తి ప్రత్యయము లందురు. వీనిని ప్రకృతికి అతికించిన విశేష్య విశేషణసర్వనామముల విభక్తి పదము లేర్పడును.

ఈ విభక్తుల యుపయోగ ప్రయోగములు కారకప్రకరణమున వివరింప బడును. మామూలుగా వచ్చు విభక్తి ప్రత్యయములు ఈ క్రింద పొందుపరచ బడినవి.

| | ఏకవచనము<br>పుం-స్త్రీ-నపుం | | ద్వివచనము<br>పుం-స్త్రీ-నపుం | | బహువచనము<br>పుం-స్త్రీ-నపుం | | ఆంధ్ర విభక్తి ప్రత్యయములు |
|---|---|---|---|---|---|---|---|
| ప్ర | స్ | — | ఔ | ఈ | అస్ | ఇ | డు, ము, వు. లు |
| ద్వి | అమ్ | — | ఔ | ఈ | అస్ | ఇ | ని. ను, ల కూర్చి గురించి |
| తృ | ఆ | | భ్యామ్ | | భిస్ | | చేత, త, చే, తోడ, తో |
| చ | ఏ | | భ్యామ్ | | భ్యస్ | | కై, కొరకు |
| పం | అస్ | | భ్యామ్ | | భ్యస్ | | నుండి, వలన, కంటె, పట్టి |
| ష | అస్ | | ఓస్ | | ఆమ్ | | యొక్క, లో, లోపల |
| స | ఇ | | ఓస్ | | సు | | అందు, న. |

సంబోధనా విభక్తికిని ప్రథమా విభక్తికిని కేవలము ఏకవచనమున మాత్రమే స్వల్పభేదము కలదు. కావున దానిని ప్రత్యేకముగా నీయవలసిన పనిలేదు.

(1) ఏకవచనములో పంచమీ, షష్ఠీవిభక్తి ప్రత్యయములు ఒకటే.

(2) ద్వివచనములో ప్రథమా, ద్వితీయలకు ఒకే ప్రత్యయము. తృతీయ, చతుర్థీ, పంచమీలకును షష్ఠీ సప్తమీలకును ఒకే ప్రత్యయము.

(3) బహువచనములో ప్రథమ, ద్వితీయములు ఒకటే చతుర్థీ పంచమీలును ఒకే ప్రత్యయము గల్గియున్నవి.

పై ప్రత్యయములను యథాతథముగా, చాల వరకు హలంత ప్రకృతులు, ఈకారాంత ఊకారాంత ప్రకృతులును గైకొనును.

ఇతర అజంతప్రకృతుల యెడనివి చాలా మార్పులను బొందును. అన్ని ప్రకృతులమీదను సాధారణముగా వచ్చు ప్రత్యయములు–ద్వివచనములో భ్యామ్, ఓస్; బహువచనములో భిస్, భ్యస్, ఆమ్, సు.

అనేకపదములలో ప్రకృతియే మార్పుజెందును. రెండురకముల ప్రకృతులు గమనించదగినవి. ఒకటి బలీయములు, రెండవవి బలహీనములు. ఒక్కొక్కసారి ప్రకృతి ప్రత్యయములను అతుకుటకు కొన్ని పొడులు (నిపాతములు) వాడబడును.

## 3.2 ప్రకృతి యొక్క మార్పు.

దీనిలో ముఖ్యముగా గమనించవలసిన విషయమేమి యనగా, కొన్ని కొన్ని పదములవిషయమున (ముఖ్యముగా హలంతశబ్దములలో) ప్రకృతి బలీయమని, బలహీనమనియు రెండు విధములుగా నుండును. దీనికిని స్వరమునకును (accent) దగ్గరసంబంధము కలదు.

ప్రథమావిభక్తి మూడువచనములలోను, ద్వితీయావిభక్తి ఏకవచన ద్వివచములలోను వచ్చు ప్రకృతులు, మిగిలినవానిలో వచ్చు ప్రకృతులకంటెను బలీయములు. ఈ బలీకరణము, నుగాగమముచే గాని, దీర్ఘీకరణములచే గాని కావచ్చును. దీనిలో గమనించవలసిన విషయము—ఈ ఐదింటికిని ప్రత్యయములో ఉదాత్తమురాదు.

ఉదా॥ రా'జన్; రా'జానౌ; రా'జానః; రా'జానమ్; రా'జానౌ

ఇవి బలీయములు. ఇట్లే మహా'న్తమ్; అద'న్తమ్ మున్నగు వానితో పోల్చిన మహతా', అదతా' మున్నగునవి బలహీనములు.

బలహీన ప్రకృతులలోను దుర్బలములు, దుర్బలతరములని రెండు విభాగములు. హలాది ప్రత్యయములు చేరు ప్రకృతులు దుర్బలములు అజాది ప్రత్యయములు చేరు ప్రకృతులు దుర్బల తరములు.

పై జెప్పబడిన ఐదు బలీయప్రకృతులు పుంలింగ స్త్రీలింగముల యందే వచ్చును. నపుంసకలింగ విభక్తులలో బలీయములు, ప్ర॥ ద్వి॥ బహువచనములు మాత్రము. ప్ర॥ ద్వి॥ ఏకవచన ప్రకృతులు దుర్బలములు. ప్ర॥ ద్వి॥ ద్వివచన ప్రకృతులు దుర్బల తరములు.

ప్రకృత్యంత స్వరముల గుణీకరణ వృద్ధీకరణ విషయము లాయా సందర్భములలో వివరింపబడును. ప్రస్తుతము తెల్పునదేమనగా అర్వాచీన వాఙ్మయములో, ప్రథమా బహువచనములో వచ్చు 'అస్' ప్రత్యయమునకు ముందున్న ఇ,ఉ,లు గుణీకరణమును బొందును. ఇట్లే పుం, స్త్రీ, లింగముల చతుర్థీ ఏకవచన ప్రత్యయమగు 'ఏ'కు ముందున్న ప్రకృత్యంత స్వరము గుణీకరణమును బొందును.

అంతమున నున్న 'ఋ' సప్తమీ ఏకవచనములో గుణీకరణమును బొందును.

ప్రకృతి, ప్రత్యయముల నతుకుటకు వాడబడు పొడులు.

కొన్ని కొన్ని ప్రకృతి ప్రత్యయములను అతుకుటకు సాధారణముగా నకారము పొడిగా నుపయోగించబడును. ఐతే. ఇది వేదములో క్వాచిత్కముగానే కనుపించును.

అకారాంత, ఆకారాంత, సర్వనామ శబ్దముల షష్ఠీ బహువచనముల అందున్న 'ఆమ్' ప్రత్యయమును అతుకుటకు నకారమునకుబదులుగా సకారము ఉపయోగింతురు.

ప్రత్యయములు ఐ; ఆః; ఆమ్ లలో 'ఆ'కు తర్వాత వచ్చు యడాగమము పొడిగా పరిగణించవచ్చును.

**3.3** సుబంత ప్రక్రియలో స్వరము. (Accent)

(1) సంబోధనలో ఉదాత్తమున్నచో నది తప్పక మొదటి యక్షరము పైననే యుండును

(2) వేదములో ఏకాక్షరముగా పలుకవలసిన సంధ్యక్షరములపై ఉదాత్తమును, రెండక్షరములుగా (విడివిడిగా) పలుకవలసిన సంధ్యక్షరములపై స్వరితమును ఉండును.

(3) కాని, సంబోధన, వాక్యమునకుగాని, పాదమునకుగాని మొదట నున్నప్పుడె ఉదాత్తమును కలిగియుండును. ఇతరత్రాదానికి స్వరము లేదు.

ఉదా॥ అ'గ్నే య'మ్ యజ్ఞ'మ్ పరిభూ'రసి'
కాని, ఉ'పత్వా అగ్న ఏ'మసి.

(4) సంబోధనకు విశేషణముగా నున్న పదమును, సంబోధన వాచకమును కలిపి ఒకే పదముగా పరిగణింపబడె. అది వాక్యమునకుగాని పాదమునకుగాని మొదటవచ్చిన, దాని మొదటి యచ్చుపై ఉదాత్తముండును.

ఉదా॥ ఇ'న్ద్ర భ్రాతః!; రాజ'న్ సోమ; య'విష్ఠధూత;
ఊ'ర్జోనపాత్ సహస్వమ్;
సో'మాస ఇంద్ర గిర్వాణః

(5) ఐతే వాక్యమునకుగాని, పాదమునకుగాని మొదట అనేక సంబోధనలు (ఒకదానితో నొకటి సంబంధములేనివి) వచ్చినచో ప్రతిదాని ప్రథమాక్షరము పైనను ఉదాత్తముండును.

ఉదా॥ పి'త ర్మా'తర్, అ'గ్న ఇ'ంద్ర వ'రుణ మి'త్ర దే'వాః
కాని వ్రాతప్రతులలో దీనికి భిన్న వ్యవహారమును కలదు.

(6) ఇక ఇతర విభక్తుల విషయమున—అంతమునందు ఉదాత్తముగల ఏకాచ్క ప్రకృతులను గాని, అంతమునందు ఉదాత్తము గల బహ్వాచ్క ప్రకృతులను గాని విచారించవలయును. కారణము, చివరి యచ్చుపై గాక ప్రకృతిలో నున్న మరియే ఇతర అచ్చుపై ఉదాత్తమున్నను, సుబంత ప్రక్రియలో దాని స్థానము మారదు. చివరి యచ్చుపై ఉదాత్తముగల ప్రకృతుల యందే ఒకొక్కప్పుడు ఉదాత్త స్థానమున మార్పు గల్గును. దీనికి కారణము,

ప్రత్యయములు కొన్ని ప్రకృతిలోనున్న ఉదాత్తమును స్వీకరించు గుణమునుకలిగి యున్నవి. కావున ప్రకృత్యంతమున నున్న ఉదాత్తము ఒక్కొక్క మారు ప్రత్యయముపైకి మారుచుండును.

(7) బలీయ విభక్తి ప్రత్యయములు ఉదాత్తమును స్వీకరించవు. కావున తత్పూర్వముననున్న ప్రకృతులకు చివరియక్షరముపై ఉదాత్తమున్న అది ఉదాత్తముగనో, స్వరితముగనో అచటనే యుండిపోవును.

ఉదా॥ దత్రా'; నద్యై; నద్యాః; ...

(8) ఇతర విభక్తి ప్రత్యయములు ఉదాత్తమును స్వీకరించును గాని వీనిలో దుర్బలతరములు (అనగా అజాది ప్రత్యయములు) త్వరగా స్వీకరించును.

(9) కావున విభక్తులలోస్వరముయొక్క మార్పు విషయమున ఈ క్రింది నియములు సాధారణముగా వర్తించును.

(అ) ఏకాచ్క ప్రకృతుల యంతముననున్న యుదాత్తము, దుర్బల, దుర్బలతరవిభక్తులలో ప్రత్యయాంతమునకు మారును.

(ఆ) బహ్వాచ్క ప్రకృతులు హలంతములైనచో, వానిలో కొన్నిటికి మాత్రము ఉదాత్తము ప్రత్యయాంతమునకు మారును. (ఇవి అ'త్, అన్త్ ప్రత్యయములుగాగల అసమాపకక్రియాపదములు, వానితో నేర్పడు విశేషణములును)

ఉదా॥ తుద'న్త్ —> తుదతా', తుదతో'ః, తుదతా'మ్,
కాని తుద'ద్భ్యామ్, తుద'త్సు,

(ఇ) బహ్వాచ్క ప్రకృతులలో చివరిది హ్రస్వమై, ప్రక్రియాంతమున నది యట్లే నిలచియుండుచో దానిపైనున్న ఉదాత్తము మారదు.

ఉదా॥ దత్ర' —> దత్రే'న, దత్రా'య, దత్రే'భ్యః,
అగ్ని' —> అగ్ని'నా, అగ్న'యే, అగ్ని'భిః,

(ఈ) ధాత్వంత శబ్దముల చివరనున్న ఈ, ఊ లపై నున్న ఉదాత్తమట్లే నిలచియుండును. ఈ ఉదాత్తము ప్రత్యయముమీదికి మారదు. ఐతే ప్రాచీనవాఙ్మయములో దీర్ఘాంతములగు బహ్వాచ్కపదములును. కొన్నిచోట్ల నిట్లే వ్యవహరించును.

**3.4** నామవాచకములకును, విశేషణములకును సుబంత ప్రక్రియ ఒకటే గావున వీనిని విడివిడిగా వివరించుట యనవసరము. వీలునుబట్టి ఇవి ఈ క్రింది క్రమమున వివరింపబడును.

I అకారాంత ప్రకృతులు.

II ఇకార, ఉకారాంత ప్రకృతులు.

III ఆకార, ఈకార, ఊకారాంత ప్రకృతులు. వీనిలోని యంతర్భాగముగా (అ) ధాతుప్రకృతులు, (ఆ) జన్యప్రకృతులు.

IV ఋకారాంత ప్రకృతులు.

IV హలంత ప్రకృతులు.

సూచన : విశేషణములలో కొన్ని హలంత శబ్దములు ప్రత్యేక ప్రక్రియ గల్గి యుండును. ఇవిగాక కొన్ని విశేషణములు సమాసరూపమున నుండును. వీనిలో కొన్ని ధాత్వంతములు కొన్ని నామవాచకాంతములును ఉదా॥ ధాత్వంతములు. సుదృశ్, ప్రబుధ్, అద్రుహ్, వేదవిత్, వృత్రహన్ ... మొదలగునవి ఇక నామవాచకాంతములు ప్రజాకామ, సభార్యా, అతిమాత్రమ్, యాపయద్ద్వేషః, ... మొదలగునవి. కావున ప్రతిసందర్భమునను ఈ పలువిధములగు విశేషణముల సుబంత ప్రక్రియలు గమనించవలసియుండును.

ఇక స్వరవిషయమున ప్రతిధాత్వంత విశేషణమునకును ఉదాత్తము ఉండును ఐతే ఇది ఏకాచ్క పదములలోవలె ప్రత్యయమునకు మారదు (పురాతన శబ్దములలో అన్చ్ అంతమున గలవానికి తప్ప)

ఈ క్రింద పొందుపరచబడిన పధకములలో బ్రాకెట్‌లలో ఇవ్వబడినవి వేదములో గనుపించు రూపములుగా గ్రహించవలయును.

**3.5** I అకారాంత పుంలింగ, నపుంసకలింగ శబ్దములు.
(అకారాంతమున స్త్రీలింగశబ్దములులేవు)

(అ) మొత్తము వాఙ్మయములోని విశేషణ విశేష్యములలో సగమునకు పైగా అకారాంత శబ్దములే.

(ఆ) మిగిలిన శబ్దములకంటె వీనియందే ప్రత్యయముల మార్పు ఎక్కువ. ఉదా॥ కా'మ (కోరిక) ఆస'్య (ముఖము) శబ్దముల ప్రక్రియ ఈ క్రింద పొందుపరచబడినది.

అకారాంత పుం. కా'మ (కోరిక) అకారాంత న. పుం. ఆస'్య (ముఖము)

| | ఏక | ద్వి | బహు | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|---|---|---|
| ప్ర. | కా'మః | కా'మౌ (కా'మా) | కా'మాః (కామాసః) | ఆస్యమ్ | ఆస్యే | ఆస్యాని (ఆస్యా) |
| ద్వి. | కా'మమ్ | ,, | కామాన్ | ,, | ,, | ,, |
| తృ. | కా'మేన (కా'మా) | కా'మాభ్యామ్ | కా'మైః (కా'మేభిః) | ఆస్యేన | ఆస్యాభ్యామ్ | ఆస్యైః (అస్యేభిః) |
| చ. | కా'మాయ | ,, | కా'మేభ్యః | ఆస్యాయ | ,, | ఆస్యేభ్యః |
| పం. | కా'మాత్ | ,, | ,, | ఆస్యాత్ | ,, | ,, |
| ష. | కా'మస్య | కా'మయోః | కా'మానామ్ | ఆస్యస్య | ఆస్యయోః | ఆస్యానామ్ |
| స. | కా'మే | ,, | కా'మేషు | ఆస్యే | ,, | ఆస్యేషు |
| సం. | కామ | కామౌ | కామాః | ఆస్య | ఆస్యే | ఆస్యాని |

ఇందు గమనించవలసిన విషయములు.

ఏకవచనములో

(ఇ) తృతీయలో ప్రత్యయము 'ఏన' ఇది ప్రాచీనార్వాచీన వాఙ్మయములో నిట్లే యున్నది. ఐనను వేదములో మామూలు ప్రత్యయమగు 'ఆ'తో గూడా ననేక ప్రయోగములు కలవు

ఉదా॥ యజ్ఞా'; సుహ'వా; మహిత్వా' :—
(యజ్ఞే'న ... ... మొదలగువానికి బదులు)

(ఈ) పంచమిలో వచ్చు 'అత్' ప్రత్యయము మరి యేనామవాచకమునకును రాదు సర్వనామములలో కొన్నిటికి—పురుషసర్వనామములకు—మాత్రము వచ్చును.

(ఉ) షష్ఠి ఏకవచనమున వచ్చు 'స్య' ప్రత్యయముగూడను. 'అముష్య' అను సర్వనామమున దప్ప మరెచ్చటను రాదు

ద్వివచనములో

(ఊ) వీనిలో వచ్చు ప్రత్యయములు మామూలేగాని వేదములో, పుంలింగమునకు, ప్రథమ, సంబోధన, ద్వితీయా విభక్తులలో సాధారణముగా 'ఆ' అను ప్రత్యయము వచ్చును. (ఎనిమిదింట ఏడువంతులు) నపుంసకలింగమున 'ఏ' ప్రత్యయము వచ్చును.

(ఋ) షష్ఠి, సప్తమీలలో వచ్చు యడాగమము నిపాతము (పొడి) కా వచ్చును.

బహువచనములో

(ఋా) వేదములో పుంలింగమున ప్రథమా బహువచనమునకు 'అసః' ప్రత్యయము అతివిస్తారముగా వచ్చుచుండును.

(ౡ) ద్వితీయలో పుంలింగమునకు వచ్చు ప్రత్యయము 'అన్' యొక్క పూర్వరూపము 'అనః',

(ౡా) నపుంసకలింగమునకు, ప్రథమ, ద్వితీయావిభక్తులలో వేదమున 'ఆ' ప్రత్యయము బహుళముగా కన్పించును.

(ఏ) తృతీయలో వేదమున సాధారణముగా 'ఏభిస్' ప్రత్యయమే వచ్చు చుండును.

(ఐ) ఈ ప్రక్రియలో స్వరవిషయమున చెప్పదగినదేదియు లేదు. ప్రకృతిలో ఉదాత్తము గలిగిన యక్షరము తన యుదాత్తమును నిలబెట్టుకొనును ఇది అకారాంత ప్రకృతుల సామాన్యధర్మము (క్రియా ప్రక్రియలోగూడ నిది ఇంతే)

## విశేషణములు

(ఓ) విశేషణములలో అకారాంతములు చాలా ఎక్కువ. అవియన్నియు పై శబ్దములవలెనే ప్రక్రియను బొందును.

(ఔ) అకారాంతధాతువులులేవు. గావున అకారము అంతమునగల ధాత్వంత విశేషణములునులేవు కాని కొన్ని యెడల ఆకారాంతధాత్వంత విశేషణములలో, అంతముననున్న ఆకారమునకు బదులు అకారము నిక్షేపింపబడి అకారాంత ప్రకృతులకువలె ప్రక్రియను జేయుదురు. ఉదా॥ _గ, _జ, -ద, -స్థ, ... మున్నగునవి యంతమున గల సమాసపదములు (విశేషణములుగానీ, విశేష్యములుగానీ) వీనిలోని అంత్యధాతువుల రూపములు గా, జా, దా, స్థా ... యని గమనింపవలయును.

(అం) అకారాంతనామవాచకము అంతమునగల విశేషణము మామూలు అకారాంత శబ్దమువలెనే ప్రక్రియనుబొందును.

(ఊ) అకారాంత పుంలింగనామవాచకముల కనురూపములగు స్త్రీలింగ రూపములు సాధారణముగా అంతముననున్న అకారమును దీర్ఘీకరించుటచే నేర్పడును. ఐతే కొన్నియెడల నివి ఈకారాంతములుగనుండును.

ఉదా॥ తద్ధిత ప్రక్రియలో

ఆమిత్ర'—త్రీ, మా'నుష—షీ, పావమాన'—నీ', పౌర్ణమాస'—సీ',

ఇట్లే 'ఆన' అంతమునగల జన్యప్రకృతులలో

చో'దన—నీ, సంగ్ర'హణ—ణీ, సుభాగంక'ర్ణ—ర్ణీ,

'అ' అంతమున గల జన్యప్రకృతులలో

దివాకర'—రీ', అప్రక్రమ'—మీ',

'మయ', 'తన' అంతమునగల జన్యప్రకృతులలో

అయస్మయ'—యీ', అద్యతన'—నీ',

పదాంతముననున్న అక్ష—అక్షీ (లోహితాక్షీ, గవాక్షీ, ద్వ్యక్షీ, ...
,, పర్ణ—పర్ణీ (తిలపర్ణీ, సప్తపర్ణీ, ...
,, ముఖ—ముఖీ (కృష్ణముఖీ, దుర్ముఖీ, ...
,, అంగ—అంగీ (అనవద్యాంగీ సర్వాంగీ, ...
,, కేశ—కేశీ (సుకేశీ, ముక్తకేశీ లేక ముక్తకేశా)
కర్ణ—కర్ణీ (మహాకర్ణీ కాని గోకర్ణా)
ఉదర—ఉదరీ (లంబోదరీ, ...

## 3.6 II. ఇకారాంత, ఉకారాంత శబ్దములు (అన్ని లింగములలోను)

ఇకారాంత ఉకారాంత శబ్దముల సుబంత ప్రక్రియ ఇంచు మించు ఒకే విధముగా నుండుటచే వానిని ప్రత్యేకముగా వివరించుట యనవసరము. ఇవి మూడు లింగములలో నున్నవి. వీనిలో ఇకారాంతములు ఉకారాంతములకంటె విరివి వీని ప్రత్యయములు గూడను అకారాంత శబ్దముల ప్రత్యయములవలె మామూలుకంటె చాలా భిన్నముగా నుండును. ముందుగా వీని పథకములను వివరించెదము.

ఇకారాంతములు:— అగ్ని పుం. (నిప్పు) గతి స్త్రీ (నడక); వారి. న పుం (నీరు)

అగ్నిశబ్దము. పుం. (నిప్పు) గతిశబ్దము స్త్రీ. (నడక)

| | ఎ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|
| ప్ర | అగ్నిః | అగ్నీ' | అగ్న'యః | గ'తిః | గ'తీ | గతయః |
| ద్వి | అగ్ని'మ్ | అగ్నీ' | అగ్నీ'న్ | గ'తిమ్ | ,, | గ'తీః |
| తృ | అగ్ని'నా | అగ్ని'భ్యాం | అగ్ని'భిః | గ'త్యా | గ'తిభ్యామ్ | గ'తిభిః |
| చ | అగ్న'యే | ,, | అగ్ని'భ్యః | గ'తయే, గ'త్యై | ,, | గ'తిభ్యః |
| పం | అగ్నే'ః | ,, | ,, | గ'తేః, గ'త్యాః | ,, | ,, |
| ష | ,, | అగ్నో'ః | అగ్నీనా'మ్ | ,, | గ'త్యోః | గ'తీనామ్ |
| స | అగ్నౌ' | ,, | అగ్ని'షు | గ'తౌ, గ'త్యామ్ | ,, | గ'తిషు |
| సం | అ'గ్నే | అ'గ్నీ | అ'గ్నయః | గ'తే | గ'తీ | గ'తయః |

న. పుం. వా'రి శబ్దము (నీరు)

| | ఎ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర | వా'రి | వా'రిణీ | వా'రిణి (వారీ) |
| ద్వి | ,, | ,, | ,, |
| తృ | వా'రిణా | వా'రిభ్యామ్ | వా'రిభిః |
| చ | వా'రిణే | ,, | వా'రిభ్యః |
| పం | వా'రిణః | ,, | ,, |
| ష | ,, | వా'రిణోః | వా'రీణామ్ |
| స | వా'రిణి | ,, | వా'రిషు |
| సం | వా'రే, వా'రి | వా'రిణీ | వా'రీణి |

**ఉకారాంత శబ్దములు :**

శ'త్రు పుం (విరోధి), దేను' స్త్రీ (గోవు), మధు న. పుం. (తేనె)
శ'త్రు పుం. (విరోధి) ధేను స్త్రీ (ఆవు)

| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|
| ప్ర | శ'త్రుః | శ'త్రూ | శ'త్రవః | ధేను'ః | ధేనూ' | ధేన'వః |
| ద్వి | శ'త్రుమ్ | ,, | శ'త్రూన్ | ధేను'మ్ | ,, | ధేనూ'ః |
| తృ | శ'త్రుణా | శ'త్రుభ్యామ్ | శత్రుభిః | ధేన్వా' | ధేను'భ్యామ్ | ధేను'భిః |
| చ | శ'త్రవే | ,, | శ'త్రుభ్యః | ధేన'వే. ధేన్వై' | ,, | ధేను'భ్యః |
| పం | శ'త్రోః | ,, | ,, | ధేనోః'. ధేన్వాః' | ,, | ,, |
| ష | ,, | శ'త్రోః | శ'త్రూణామ్ | ,, | ధేనోః' | ధేనూనా'మ్ |
| స | శ'త్రౌ | ,, | శ'త్రుషు | ధేనౌ'. ధేన్వా'మ్ | ,, | ధేను'షు |
| సం | శ'త్రో | శ'త్రూ | శత్రవః | ధే'నో | ధే'నూ | ధే'నవః |

మ'ధు న. పుం. (తేనె)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర | మ'ధు | మ'ధునీ | మ'ధూని (మధూ) |
| ద్వి | ,, | ,, | ,, |
| తృ | మ'ధునా | మ'ధుభ్యామ్ | మ'ధుభిః |
| చ | మ'ధునే | ,, | మ'ధుభ్యః |
| పం | మ'ధునః | ,, | ,, |
| ష | ,, | మ'ధునోః | మ'ధూనామ్ |
| స | మ'ధుని | ,, | మ'ధుషు |
| సం | మ'ధు | మ'ధునీ | మ'ధూని |

ఇందు గమనించవలసిన విషయములు.

ఏకవచనములో

(అ) స్త్రీలింగ శబ్దముల, చతుర్థి, పంచమీ, షష్ఠీ, సప్తమీ విభక్తులకు రెండు రూపములుగలవు మొదటిరూపములు పుంలింగశబ్దముల బోలియుండును, రెండవ రూపములో సంపూర్ణప్రత్యయములను— ఐ, ఆః, ఆః, ఆమ్ — గైకొనును. ఇవి ఈకారాంత, ఊకారాంత స్త్రీలింగశబ్దముల బోలియుండును. ఐతే ఈ రెండవరూపములు ప్రాచీన వాఙ్మయమున చాలా అరుదు.

నపుంసకలింగ దుర్బలతర ప్రత్యయములకు ముందు నుగాగమము— అనగా 'న' నిపాతము లేక పొడి— వచ్చును. వేదమునను ప్రాచీన వాఙ్మయమునను ఇట్టి నిబంధనలేదు. చాలా వరకు పొడి 'న' లేకయే సుబంతరూపములు గన్పించును. ఇది ముఖ్యముగా గమనింపదగిన విషయము.

(అ) వేదములో కొన్ని ఉకారాంతపదములు ఊకారాంత పదములుగా మారును.

ఉదా॥ ఉరూ'; పురూ';

(ఇ) స్త్రీలింగములో తృతీయకు మామూలు ప్రత్యయము 'ఆ' వచ్చును. ఐతే వేదములో దీనికి బదులుగా 'యా', 'వా' ప్రత్యయములును విరివిగనే వచ్చును. అదిగాక స్త్రీలింగ ప్రత్యయము 'యా' ఒక్కొక్కప్పుడు 'ఈ'గను, మరొక్కమారు 'ఇ'గను మారుట కద్దు.

**ద్వివచనములో**

ప్రత్యేకించి గమనించదగిన దేదియును లేదు.

**బహువచనములో**

(ఈ) నపుంసకలింగములో ప్రథమా, ద్వితీయా, విభక్తుల అంతములు 'ఈని', 'ఊని' ఐతే వేదములో వీనికంటె విరివిగా 'ఈ', 'ఊ'లు మాత్రమే అంతములుగా కన్పించును.

(ఉ) కొన్ని ప్రకృతుల యంతములు గుణీకరణమొందుట గమనించదగినది.

(ఊ) స్వరవిషయమున ప్రత్యేకముగా గమనించదగినదేదియును లేదు.

**3.7** ఇకారాంత శబ్దములలో వేదమున సాధారణముగా వచ్చు రూపములు కొన్ని—

**ఏక వచనములో**

(1) ప్రథమలో మార్పులేదు ద్వితీయలో—పుంలింగమున అగ్ని'మ్, యయి అమ్, ఊర్మిణమ్; ... స్త్రీ నపుంసకలింగములు మామూలే.

(2) తృతీయలో పుంలింగమున—అగ్ని'నా, రయ్యా', ఊర్మియా', స్త్రీలింగమున—అ'చిత్తీ, ఊతిఅ', మత్యా', సువృక్తి' ధాసి'నా;

(3) చతుర్థిలో. పుం—అగ్న'యే; ... ... స్త్రీ—తుజ'యే, ఊతీ' తుర్యాయి'—నపుం—శుచయే; ...

(4) పంచమీ, షష్ఠీ—పుం—అగ్నే'ః, అవ్యః, అరి అ'ః, ... స్త్రీ—అ'దితేః, హేత్యాః; భూ'మి ఆః, ... నపుం—భూ'రేః

(5) సప్తమీ—పుం—అగ్నౌ; అగ్నా', ... స్త్రీ—ఆ'గతా, ఉ'దితా, వేదీ, భూమ్యామ్, ... నపుం—అప్రతా; సప్తరశ్మౌ; ...

ద్వివచనములో

(6) ప్రథమా, ద్వితీయ, సంబోధనః పుం—హ'రీ; ... స్త్రీ—యువ'తీ; ... నపుం—శు'చీ; హ'రిణీ (?)

బహువచనములో

( ) ప్రథమ పుం—అగ్నయః, ... స్త్రీ—మ'తయః, భూ'మీః, ... నపుం—శు'చీ; భూ'రి; భూ'రీణి, ...

(8) ద్వితీయ. పుం—అగ్నీ'న్, ... స్త్రీ—క్షి'తీః, ...

(9) షష్ఠీ. పుం, స్త్రీ—కవీనా'మ్, ఋషీనా'మ్,

ఉకారాంత శబ్దములలో వేదమున సాధారణముగా వచ్చు రూపములు కొన్ని.

ఏకవచనములో

(1) తృతీయా:—పుం—కే'తునా, పశవా', క్ర'తు ఆ, ... స్త్రీ—అ'ధేను ఆ,
పనవా', ఆశుయా' ... ... నపుం—మ'ధునా, మధ్వా;

(2) చతుర్థీ. పుం—కేత'వే; శిశ్వే, ... స్త్రీ—శ'రవే, ఇషావై, ...
నపుం—ఉరవే, మధునే, ... ...

(3) పంచమీ, షష్ఠీ: పుం—మన్యో'ః, పిత్వః, చా'రుణః, ...
స్త్రీ—సి'ంధోః, ఇ'ష్వాః, ... ...
నపుం—మ'ధ్యః, మ'ధుఅః, మ'ధోః, మధునః,

(4) సప్తమీ. పుం—పూరఉ', సూన'వి; ...
స్త్రీ—సి'ంధౌ, ర'జ్జ్వామ్,...
నపుం—సా'నౌఉ, సా'నవి, సా'నో, సా'నూని....

**ద్వివచనములో**

(5) ప్ర సం ద్వి లో నపుం— ఉర్వీ, జానునీ. ...

**బహువచనములో**

(6) ప్రథమా. పుం— ఋభ'వః, మృ'దుఅః, మధ్వః, ...
స్త్రీ—ధేన'వః, శతక్రత్వః, ...
నపుం— పురూ'ణి, పురు, పురూ', . .

**విశేషశబ్దములు**

**3.8** ఉకారాంతములలో విశేషశబ్దములులేవు. ఇకారాంతములగు విశేష శబ్దములు కొన్ని మాత్రమే కలవు.

(అ) ఇకారాంత పుంలింగము. స'ఖి (స్నేహితుడు)

దీనికి మొదటి యైదురూపములలో (అనగా బలీయరూపములలో) ఒక రకమగు వృద్ధివచ్చును. అనగా ప్రకృతి 'సఖాయ్' యగును. ఇది ప్రథమైక వచనమున 'సఖా' శబ్దముగామారును మిగిలిన రూపములు మామూలే. తృ. చ. ఏకవచనములలో గుణముగాని, నుగాగముగాని రాదు పం. ష ఏకవచనము లలో ప్రత్యయము 'ఉస్' సప్తమీ ఏకవచన ప్రత్యయము ఔ. మిగిలినభాగము అగ్నిశబ్దమువలె ప్రక్రియను బొందును. ఇట్లు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర | స'ఖా | స'ఖాయౌ | స'ఖాయః |
| ద్వి | స'ఖాయమ్ | ,, | స'ఖీన్ |
| తృ | స'ఖ్యా | స'ఖిభ్యామ్ | స'ఖిభిః |
| చ | స'ఖ్యే | ,, | స'ఖిభ్యః |
| పం | సఖ్యుః | ,, | ,, |
| ష | ,, | సఖ్యోః | స'ఖీనామ్ |
| స | స'ఖ్యౌ | ,, | స'ఖిషు |
| సం | స'ఖే | స'ఖాయౌ | స'ఖాయః |

(ఆ) వేదమున సాధారణముగా యకారమునకు బదులు ఇకారము నిక్షేపింపబడియుండును. ఉదా॥ స'ఖిఆ, స'ఖిఉః, ...

(ఇ) పుంలింగ సఖిశబ్దమునకు ప్రతిగా స్త్రీలింగమున సఖీ శబ్దమును కలదు. ఇది దేవీశబ్దమువలెనే ప్రక్రియను బొందును.

(ఈ) సమాసాంతముననున్న పుంలింగ పతిశబ్దము (ప్రభువు, యజమాని యను అర్థము కలది) మామూలుగా అగ్ని శబ్దమువలెనే ప్రక్రియను బొందును విడిగా 'పెనిమిటి' యను అర్థమునవచ్చు పతిశబ్దము, తృతీయా, చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమీ విభక్తుల ఏకవచనములలో సఖి శబ్దమువలె ప్రక్రియను బొంది వరుసగా ప'త్యా, ప'త్యే, ప'త్యుః, ప'త్యుః, పత్యౌ, అను రూపముల బొందును. మిగిలిన రూపములు మామూలు అగ్ని శబ్దరూపములే.

(ఉ) సఖిశబ్దమునకువలెనే పతిశబ్దమునకు స్త్రీలింగరూపమున పత్నీ శబ్దము గలదు దీని ప్రక్రియ మామూలే.

ఉదా॥ జీవపత్నీ, దాసపత్నీ, ...

(ఊ) జ'ని (భార్య)శబ్దమునకు వేదమున షష్ఠీ ఏకవచనమున జ'న్యుః అను రూపము గలదు.

(ఋ) అ'క్షి (కన్ను), అ'స్థి (ఎముక), ద'ధి(పెరుగు), స'క్థి(తొడ) వీని ప్రకృతులు లోపభూయిష్ఠములు. ఇవి 'అన్' అంతమునగల జన్యప్రకృతులతో వినిమయము బొందుచుండును (చూ.4.8 (ఋ)) ఇవి నపుం లింగములు.

(ౠ) పుం. క్రోష్టు (నక్క (howler)) శబ్దమునకు బలీయరూపములు క్రోష్టృ శబ్దమునకువలె నుండును.

## విశేషణములు

**3.9** (అ) ఇకారాంతములగు విశేషణములు చాలా స్వల్పము ఉకారాంతమున ఇంతకంటె నెక్కుడుగానున్నవి. వీని ప్రక్రియ. ఇకారాంత. ఉకారాంత శబ్దముల ప్రక్రియవలెనే యుండును. నపుంసకలింగ రూపముల దుర్బలతర విభక్తులలో వచ్చు నుగాగమము ఐచ్ఛికము. రాకపోయినను ప్రత్యవాయములేదు.

(ఆ) ఇకారాంత, ఉకారాంత ధాతువులు, పదాంతములందు వచ్చినపుడు

వానికి తప్పక 'త్' కలుపబడును. కావున ధాత్వంత విశేషణములు ఇకారాంత ఉకారాంతములుగా నుండవు

ఉదా॥ విశ్వజిత్, సర్వహుత్, ...

(ఇ) నామవాచకాంత విశేషణములు. నామవాచకములవలెనే ప్రక్రియను బొందును.

(ఈ) అనేక ఇకారాంత పుంలింగ శబ్దములకు ప్రతిరూపములు ఈకారాంత స్త్రీలింగములును కలవు.

పుం — స్త్రీ,
ఉదా॥ క్రి'మి — క్రిమీ',
స'ఖి — సఖీ'
దుందుభి—దుందుభీ.
ధు'ని—ధునీ'
శకు'ని—శకునీ'

వీనిలోని ఉదాత్తస్థానము మారుట గమనించదగినది.

(ఉ) ఉకారాంత నామవాచకశబ్దములనుండి స్త్రీలింగశబ్దముల యుత్పత్తి యనేకరీతులుగా జరుగును. కొన్ని యెడల ఉకారముయొక్క దీర్ఘీకరణము చేతను, కొన్నిచోట్ల ఈకారము కలుపుటచేతను, మరికొన్నిచోట్ల రెండిటిచేతను వచ్చును, గ్రంథ విస్తరభీతిచే వానిని వదలివేయుచున్నాము.

## 3.10 III ఆకార, ఈకార, ఊకారాంత శబ్దములు.

దీర్ఘ స్వరాంత ప్రకృతులు రెండు విధములు. (అ) ఏకాచ్క ప్రకృతులు— చాలావరకు కేవలధాతువులు; వీని సంయుక్త పదములు లేక సమాసపదములు. (ఆ) ఆకారాంత, ఈకారాంత, ఊకారాంత స్త్రీలింగ ప్రకృతులు. వీనిలో నామవాచకములు, విశేషణములును కలవు. పుంలింగ నామవాచకములనుండి స్త్రీలింగ నామవాచకములను తయారుజేయుటకు వాని చివరనున్న హ్రస్వస్వరమును దీర్ఘీకరింతురు. ఆకారాంత పుంలింగ నామవాచకములు వేదములో ఏడెనిమిది మాత్రమున్నవి.

ఉదా॥ ప'ంథా; మ'ంథా; ఋభుక్షా'; ...

మిగిలినవి స్త్రీ లింగములే. ఇక ఇకారాంత పుంలింగనామవాచకములను స్త్రీ లింగములు చేయదలయుచో వానిని ఈ కారాంతములుగా చేయుదురు.

ఉదా॥ క్రి'మి—> క్రిమీ': శ'కుని—> శకునీ'; స'ఖి—> సఖీ'; దుందుభి' —> దుందుభీ'; ధు'ని—> ధునీ'; ...

ఇట్లే ఉకారాంత పుంలింగముల కనురూపములగు స్త్రీలింగ శబ్దములు. అంతమున నున్న స్వరము యొక్క దీర్ఘీకరణముచే నేర్పడును.

ఉదా॥ కారూ; దప్రూ'; శున్ధ్యూ'; చరిష్ణూ'; వచస్యూ'; ... కొన్ని ఉకారాంత పదములకు దీర్ఘీకరణమునకు బదులు, ఈకారము చేర్చుటచేతను స్త్రీలింగ రూపములేర్పడును.

ఉదా॥ ఉర్వీ'; గుర్వీ'; బహ్వీ'; లఘ్వీ; మృద్వీ'; ... ...

కొన్నియెడల రెండు రూపములును కన్పించును. ఇట్లే అకారాంత పుంలింగ పదములనుండియు ఈకారాంత స్త్రీ లింగపదములు చేయుటకద్దు.

ఉదా॥ గోపీ; గోష్ఠీ; పన్నగీ; భుజగీ; సురాపీ; ... ...

(అ) ధాతు ప్రకృతులు, వాని సుబంత ప్రక్రియ.

నమూనాగా ఆ, ఈ, ఊలు అంతమునగల ప్రకృతుల సుబంత ప్రక్రియ నీ క్రింద పొందుపరచనైనది మూడు స్త్రీలింగములే. (1) జా (స్త్రీ, సంతానము) (2) ధీ (స్త్రీ, బుద్ధి) (3) భూ (స్త్రీ. భూమి).

చివరిరెంటిలోను, అజాది పత్యయములకు ముందున్న ఈ,ఊలు వరుసగా ఇయ్, ఉవ్‌గా మారును. వీని చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమీ, ఏకవచనములలో సంపూర్ణ ప్రత్యయములు ఐ, ఆస్, ఆస్, ఆమ్‌లు వచ్చుట గూడా అర్వాచీన వాఙ్మయమునకలదు (ఇది వేదమునలేదు).

ఆకారాంత శబ్దములపై ఉదాత్తము ప్రకృతిపైననే యుండును.

ఈకారాంత ఊకారాంత ప్రకృతుల బలహీనరూపములలో ఉదాత్తము ప్రత్యయముపైకి మారును.

**3.11** జా. (స్త్రీ సంతానము) ధీ (స్త్రీ బుద్ధి)

| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|
| ప్ర | జా'ః | జౌ' | జా'ః | ధీ'ః | ధి'యౌ | ధి'యః |
| ద్వి | జా'మ్ | ,, | ,, | ధి'యమ్ | ,, | ,, |
| తృ | జా' | జా'భ్యామ్ | జా'భిః | ధియా' | ధీ'భ్యామ్ | ధీ'భిః |
| చ | జే' | ,, | జా'భ్యః | ధియే'.ధియై' | ,, | ధీభ్య'ః |
| పం | జ'ః | ,, | ,, | ధియ'ః,ధియా'ః | ,, | ,, |
| ష | ,, | జో'ః | జా'మ్ | ధియః,ధియాః | ధియో'ః | ధియా'మ్ (ధీనా'మ్) |
| స | జి' | ,, | జా'సు | ధి'యి.ధియా'మ్ | , | ధీషు' |
| సం॥ | జా'ః | జౌ' | జా'ః | ధీ'ః | ధి'యౌ | ధి'యాః |

భూ (స్త్రీ భూమి)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర | భూ'ః | భు'వౌ | భు'వః |
| ద్వి | భు'వమ్ | ,, | ,, |
| తృ | భువా' | భూభ్యా'మ్ | భూభి'ః |
| చ | భువే',భువై' | ,, | భూభ్య'ః |
| పం | భువ'ః,భువా'ః | ,, | ,, |
| ష | ,, | భువో'ః | భువా'మ్, భూనా'మ్ |
| స | భువి',భువా'మ్ | ,, | భూషు' |
| సం | భూ'ః | భు'వౌ | భు'వః |

సూచన :— పై జెప్పబడిన శబ్దముల వంటివి సమాన పదముల కంతమున నున్నప్పుడు, వానిలోని ఆకారాంత పదముల సుబంత ప్రక్రియ పై విధముననే యుండును. ఐతే ఈకారాంత, ఊకారాంత శబ్దముల విషయమున, అజాది ప్రత్యయములకు ముందున్న అచ్చులు వరుసగా ఇయ్ గనో ఉవ్ గనో మారును.

కొన్నిచోట్ల కేవలము య, వ లు వచ్చుట గూడను కలదు. వీనిపైనున్న ఉదాత్తము ప్రత్యయమునకు సంక్రమించదు కావున య, వ ల మీద నుండు స్వరము స్వరితమని గుర్తించనగును. -ధీ శబ్ద, -భూ శబ్దములకు పై ప్రక్రియ ననుసరించి రూపావళిని తిరిగి వ్రాసికొనునది.

**3 12** (అ) బహ్వాచ్క-ధాతు ప్రకృతులు అర్వాచీన వాఙ్మయమున చాలా అరుదు. ప్రాచీన వాఙ్మయమునను అంతగా కనుపించవు. ఐతే ఋగ్వేదమున మాత్రము ఇవి కొంత విరివిగా కన్పించును. కావున వీని సుబంత ప్రక్రియను తెలియగోరువారు వేదవ్యాకరణమును చూడనగును.

(ఆ) ఆకారాంత పుంలింగములు వేదములో కొన్ని మాత్రము గన్పించును. అవి ప'ంథా, మ'ంథా, ఋభుక్షా', ... మొన్నగునవి. ఈకారాంత ప్రకృతులు (ఇంచుమించు అన్నియు స్త్రీలింగములే. ఇవి ఆకారాంత పుంలింగముల నుండి ఏర్పడినవి) కలా'్యణీ (పుం కలా'్యణ) పురు'షీ (పుం పురుష), యమీ' (పుం. యమ) ... మున్నగునవి పుంలింగరూపము నుండి యుద్భవించినవిగాక స్వతఃసిద్ధములైన కొన్ని ఈకారాంత స్త్రీలింగములు లక్షీ'్మః సూరీ'్మ; నదీ'; ... మొదలగునవికలవు. ఈకారాంత పుంలింగములు కూడను కొన్ని (సుమారు పదిమాత్రము) కన్పించును. అవి, రథీ'; పావీ'; అహీ'; ఆపథీ'; ... మున్నగునవి. ఇక ఊకారాంత పదములు మరీ స్వల్పములు. వానిలో చాలావరకు విశేషణములే. (స్త్రీలింగ) కొన్ని తనూ'; వధూ'; చమూ'; వంటివానికి అనురూపములగు పుంలింగములు కానరావు.

(ఇ) పైవాని సుబంతప్రక్రియకు ఈ క్రింది నమూనా గ్రహించవలయును.

| | రథీ (పుం. రథికుడు) | | | నదీ (స్త్రీ ఏఱు) | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| ప్ర | రథీ'ః | రథి'ఆ | రథి'అః | నదీ'ః | నది'ఆ | నది'అః |
| ద్వి | రథిఅమ్ | ,, | ,, | న'దిఅమ్ | ,, | ,, |
| తృ | రథిఆ | [రథీ'భ్యామ్] | [రథీ'భిః] | నది'ఆ | నదీ'భ్యామ్ | నదీ'భిః |
| చ | రథి'ఏ | ,, | [రథీభ్యః] | నది'ఏ | ,, | నదీ'భ్యః |
| ప | రథి'అః | ,, | ,, | నది'అః | ,, | ,, |
| ష | ,, | [రథిఓః] | రథీ'నామ్ | ,, | నది'ఓః | నదీ'నామ్ |
| స | [రథీ'ఇ] | ,, | [రథీ'షు] | [నదీ'ఇ] | ,, | నదీ'షు |
| సం | ర'థీ | ర'థిఆ | [రథిఅః] | న'దీ | న'దిఆ | న'దిఅః |

ఇట్లే స్త్రీలింగ తనూశబ్దమును (శరీరము)

ఏకవచనములో :— త'నుః; తను'అమ్; తను'ఆ; త'నువే; తను'అః; తను'ఇ; త'ను

ద్వివచనములో :— తనుఆ; [తనూ'భ్యామ్]; తను'ఓః;

బహువచనములో ;— తను'అః, తను'భిః, తనూ'భ్యః, తనూనామ్, తను'షు;

అను రూపము లేర్పడును.

సూచన :—

(1) వాఙ్మయములో నెచ్చటను కనుపించని రూపము లు కుండలీకరణములో జూపబడినవి.

(2) వేదములో ఈ పదము లు విసంధిగనే యుచ్చరింపబడవలయును. గాన ఇచ్చటను విసంధిగనే వ్రాయబడినది.

**3.13.** (అ). ఆ, ఈ, ఊ లు అంతమునగల జన్యప్రకృతులు.

పూర్వమున వివరించిన ధాతుప్రకృతులు, ధాత్వంత విశేషణ విశేష్యములు గాక మిగిలినవి యన్నియును ఈ వర్గమున చేరును వీనిలోని కొన్ని— ఈకారాంత, ఊకారాంత పదములు- మొదటి వర్గములోనివి, ప్రాచీన వాఙ్మయమునకు చెందినవి, అర్వాచీనులచే రెండవ వర్గమున చేర్చబడినవి. ఇట్టివి

(i) ఆకారాంత జన్యప్రకృతులు : విశేషణములు, విశేష్యములును. వీని ప్రక్రియ ప్రాచీనార్వాచీన వాఙ్మయములలో ఎట్టి మార్పును లేక యధాతధముగా నిలిచియున్నది.

(ii) ఈకారాంత స్త్రీలింగ ప్రకృతులు. ఇవి చాలావరకు అర్వాచీన వాఙ్మయమునకు చెందినవే. ప్రాచీన వాఙ్మయములోని ఈకారాంత స్త్రీలింగములకు ఉదాత్తము చివరి యచ్చుపైలేని యప్పుడే ఈ ప్రక్రియ వర్తించును. ఇతరములకు (అనగా ఉదాత్తము చివరి యచ్చుపై నున్న వానికి) 3.12 (ఇ) లో చెప్పబడిన ప్రక్రియయే.

(iii) ఊకారాంత విశేషణ విశేష్యముల సంఖ్య చాలా స్వల్పము.

**3.14.** వీనికి నమూనాగా ఈ క్రింది శబ్దముల ప్రక్రియలు గ్రహించుదము. (i). సే'నా (స్త్రీలింగము). (ii) కన్యా' (స్త్రీలింగము), (iii) దేవీ' (స్త్రీలింగము), (iv) వధూ' (స్త్రీలింగము).

| | సే'నా (స్త్రీలింగము) | | | కన్యా (స్త్రీలింగము) | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| ప్ర | సే'నా | సే'నే | సే'నాః | కన్యా | కన్యే | కన్యాః |
| ద్వి | సే'నామ్ | ,, | ,, | కన్యామ్ | ,, | ,, |
| తృ | సే'నయా | సే'నాభ్యామ్ | సే'నాభిః | కన్యయా | కన్యాభ్యామ్ | కన్యాభిః |
| చ | సే'నాయై | ,, | సే'నాభ్యః | కన్యాయై | ,, | కన్యాభ్యః |
| పం | సే'నాయాః | ,, | ,, | కన్యాయాః | ,, | ,, |
| ష | సే'నాయాః | సే'నయోః | సే'నానామ్ | ,, | కన్యయోః | కన్యానామ్ |
| స | సే'నాయామ్ | ,, | సే'నాసు | కన్యాయామ్ | ,, | కన్యాసు |
| సం | సే'న | సే'నే | సే'నాః | క`న్య | క`న్యే | క`న్యాః |

| | దేవీ (స్త్రీలింగము) | | | వధూ (స్త్రీలింగము) | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| ప్ర | దేవీ' | దేవ్యౌ' | దేవ్య'ః | వధూ'ః | వధ్వౌ' | వధ్వ'ః |
| ద్వి | దేవీ'మ్ | ,, | దేవీ'ః | వధూ'మ్ | ,, | వధూ'ః |
| తృ | దేవ్యా' | దేవీ'భ్యామ్ | దేవీ'భిః | వధ్వా' | వధూ'భ్యామ్ | వధూ'భిః |
| చ | దేవ్యై' | ,, | దేవీ'భ్యః | వధ్వై' | ,, | వధూ'భ్యః |
| పం | దేవ్యా'ః | ,, | ,, | వధ్వా'ః | ,, | ,, |
| ష | ,, | దేవ్యో'ః | దేవీ'నామ్ | ,, | వధ్వో'ః | వధూ'నామ్ |
| స | దేవ్యా'మ్ | ,, | దేవీషు | వధ్వా'మ్ | ,, | వధూ'షు |
| సం | దే'వి | దే'వ్యౌ | దే'వ్యః | వ'ధు | వ'ధ్వౌ | వ'ధ్వః |

**3.15** గమనించవలసిన విషయములు :

(అ) ప్రథమా ఏకవచనమున చివరి విసర్గ ఊకారాంత పదములకును, కొన్ని కొన్ని ఈకారాంత పదములకును మాత్రము వచ్చును. ఉదా॥ లక్ష్మీః; తరీః; తంత్రీః; తంద్రీః. ...

(ఆ) ద్వితీయా ఏక, బహువచనములలో వరుసగా మ్, స్ లు వచ్చును.

(ఇ) చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమీ, ఏకవచనములలో, మామూలు ప్రత్యయములకు బదులుగా, వాని సంపూర్ణరూపములగు ఐ, ఆః; ఆః; ఆమ్

వచ్చును. వీనిని ఆకారాంత ప్రకృతులకు కలుపుటకు 'య'ను పొడిగా వాడుదురు.

(ఈ) స్త్రీలింగ నామవాచకమగు స్త్రీ' పదము (ఇది బహుశః సూత్రీ' యను పదమునకు సంక్షిప్తరూపము గావచ్చును) మిశ్రమ ప్రక్రియను బొందును. ఇట్లు ఏకవచన—స్త్రీ', స్త్రి'యమ్ (లేక స్త్రీ'మ్), స్త్రియా', స్త్రియై', స్త్రియాః', స్త్రియా'మ్ అను రూపములును, ద్వివచనమున స్త్రి'. స్త్రి'యౌ, స్త్రీభ్యా'మ్, స్త్రి'యోః అనియు బహువచనమున స్త్రి'యః, స్త్రి'యః (లేక స్త్రీ'ః), స్త్రీభి'ః, స్త్రీభ్య'ః, స్త్రీణా'మ్, స్త్రీషు' అను రూపములు గల్గును.

## 3.16 IV ఋ (లేక అర్) అంతమునగల పదములు.

ఈ వర్గమునకుచెందిన నామవాచకములు (i) తృ లేక తర్ అంతమున గల కర్త్రర్థకనామ వాచకములు (ii) బాంధవ్యమును తెలియజేయు దే'వృ (పుం), శ్వ'శ్రృ (స్త్రీ), ననంద్రృ (స్త్రీ) (iii) నృ' (పుం). స్త్రృ' (పుం), ఉస్రృ' (స్త్రీ) మొదలగునవియు (iv) ఇవిగాక తిస్రృ, చతస్రృ మొదలగు సంఖ్యావాచకములును (v) 'తృ' అంతమునగల స్త్రీలింగ రూపములు మాతృ', దుహితృ', యాతృ' ... మొదలగునవియు కలవు.

(అ) వీని సుబంతప్రక్రియ ఇకారాంత ఉకారాంత ప్రకృతుల ప్రక్రియ వలెనే యుండును ఐతే భేదము ప్రకృతుల స్వరూపములలోనే. బలీయ ప్రకృతులలో నొక జాతికిచెందిన పదములకు (ఇవియే వాఙ్మయమున చాలా విరివిగా వచ్చును. వీనిలో కర్త్రర్థక పదములన్నియును, న'ప్తృ, శ్వ'శ్రృ మొదలగు బాంధవ్య సూచకములును గలవు) అంతమున నున్న ఋ కారమునకు వృద్ధియై 'ఆర్' అగును, రెండవ జాతికిచెందిన వానిలో (దీనిలో బాంధవ్య సూచక పదములు విస్తారము) ఋకారమునకు గుణము వచ్చి 'అర్' అగును దుర్బల రూపములలో ప్రకృత్యంతము 'ఋ', దుర్బలతరరూపములలో 'ర' యగును. అన్నిటికిని సప్తమీ ఏకవచనమున ప్రకృత్యంతము 'అర్'.

(ఆ) వీని ప్రత్యయములు మామూలే. ఐతే ఈ క్రింది యపవాదములు గమనింపవలయును. (i) ప్ర॥ ఏకవచనము (పుం. స్త్రీ) 'ఆ'తో అంతమగును. సంభోదన ఏకవచనము అర్ చే అంతమగును. (2) ద్వితీయా ఏకవచనమున

ప్రత్యయము కు అమ్. ద్వి॥ బహువచనములో పుంలింగమున న్, స్త్రీలింగమున 'స్' వచ్చును. (ఇకారాంత, ఉకారాంత ప్రకృతులకువలెనే) దీనిలోని ఋకారము దీర్ఘీకరింపబడును. (3) పంచమీ, షష్ఠీ విభక్తుల ఏకవచనములో ఋ, ఉర్ గా మారును. (4) షష్ఠీ బహువచనములో ఆమ్‌నకు ముందు నకారమువచ్చి ప్రకృత్యంతము దీర్ఘీకరింపబడును.

(ఇ) వేదములో ప్రథమా, సంబోధన, ద్వితీయా విభక్తుల ద్వివచనములలో మామూలుగా 'ఆ' వచ్చును (ఔ కుబదులు)

(ఈ) ఉదాత్త విషయమున నివి ఇకారాంత ఉకారాంత శబ్దముల వలెనే ప్రవర్తించును. ప్రకృతికి చివరి యక్షరముపై ఉదాత్తమున్న నది యన్ని రూపములలోను అట్లే యుండును (షష్ఠీ బహువచనములలో నిది ప్రత్యయముపైకి మారును) దుర్బలతర ప్రకృతుల ఋకారము రకారముగా మారినప్పుడు ప్రత్యయముపై ఉదాత్తముండును.

(ఉ) ఈ ప్రక్రియకు ఉదాహరణముగా ( ) బలీయప్రకృతులలో 'ఆర్' వచ్చు దాతృ (పుం ఇచ్చువాడు) శబ్దమును, బలీయ ప్రకృతులలో అర్‌వచ్చు స్వ్సృ (స్త్రీ. చెల్లెలు (sister)), పితృ (పుం. తండ్రి) శబ్దమును స్వీకరించుదము.

| | దా'తృ (పుం. ఇచ్చువాడు) | | | స్వ'సృ (స్త్రీ. చెల్లెలు (sister)) | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| ప్ర | దాతా' | దాతా'రౌ (దాతారా) | దాతా'రః | స్వ'సా | స్వసా'రౌ | స్వ'సారః |
| ద్వి | దాతా'రమ్ | ,, | దాత'ౄన్ | స్వ'సారమ్ | ,, | స్వ'సౄన్ |
| తృ | దాత్రా' | దాత'ృభ్యామ్ | దాత'ృభిః | స్వ'స్రా | స్వ'సృభ్యామ్ | స్వ'సృభిః |
| చ | దాత్రే' | ,, | దాత'ృభ్యః | స్వ'స్రే | ,, | స్వ'సృభ్యః |
| పం | దాతు'ర్ | ,, | ,, | స్వ'సుర్ | ,, | ,, |
| ష | ,, | దాత్రో'ః | దాతౄ'ణామ్ | ,, | స్వ'స్రోః | స్వ'సౄణా'మ్ |
| స | దాత'రి | ,, | దాత'ృషు | స్వ'సరి | ,, | స్వ'సృషు |
| సం | దా'తర్ | దా'తారౌ | దా'తారః | స్వ'సర్ | స్వ'సారౌ | స్వ'సారః |

ఇట్లే పితృ (పుం. తండ్రి)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర | పితా' | పిత'రౌ | పిత'రః |
| ద్వి | పితరమ్ | ,, | పిత'ౄన్ |
| తృ | – | – | – |
| | – | – | – |

(ఊ) మాతృశబ్దము పితృశబ్దము వలెనే ప్రక్రియను బొందును. ఐతే దీని ద్వితీయా బహువచనములో 'మాతౄః' అగును

(ఋ) 'తృ' అంతమున గల పదములకు నపుంసకలింగ శబ్దముల ప్రక్రియను గూడను వైయాకరణులు నిర్ణయించియున్నారు. వీని రూపములు వా'రి శబ్దరూపములే. ఇట్లు

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | దాతృ | దాతృ'ణీ | దాతౄ'ణి |
| ద్వి. | ,, | ,, | ,, |
| తృ. | దాతృణా | దాతృభ్యామ్ | దాతృభిః |
| | – | – | – |

## విశేషణములు

ఋకారాంత విశేషణములు స్వతః ఏమియు లేవు.

స్త్రీలింగ రూపములు ఈకారము అంతమున చేర్చుటచే నేర్పడును. ఉదా॥ దాత్రీ'

(ౠ) ఋకారాంత ధాతువులు చివరి పదముగా నున్న సమాసపదముల సుబంత ప్రక్రియకై దాని చివర తకారము చేర్పబడును.

ఉదా॥ కర్మకృ'త్; వజ్ర భృ'త్; బలిహృ'త్; ...

**3.17** సంయుక్త స్వరాంత పదముల ప్రక్రియ.

(అ) ఏకారాంతనామవాచకములు కనుపించవు.

(ఆ) ఔ, ఐ, ఓ అంతమునగల కొన్ని పదములు కలవు.

ఉదా॥ నౌ (నౌక); గ్లౌ (బంతి); రై (ధనము); గో (గోవు); ద్యో (ఆకాశము) ... వీని సుబంత ప్రక్రియ ఈ క్రింది విధముగా నుండును.

(ఇ) నౌశబ్ద ప్రక్రియ క్రమబద్ధముగా నుండును. ఇది స్త్రీ లింగము. వీనికి మామూలు ప్రత్యయములే. ఉదాత్తము ఏకాచ్క్ధాతుపదములకువలె బలహీనప్రకృతులలో ప్రత్యయమునకు మారును. దీని రూపములు ఏకవచనములో— నౌ', నా'వమ్, నావా', నావే', నావ'ః, నావి, అనియు. ద్వివచనములో నా'వౌ, నౌభ్యా'మ్, నా'వోః అనియు, బహువచనములో నా'వః, నౌభి'ః, నౌభ్య'ః, నావా'మ్, నౌషు' అనియు ఏర్పడును. గ్లౌ శబ్దరూపములు గూడను ఇంతే.

(ఈ) రై (స్త్రీ) శబ్దరూపములు 'రా' శబ్దరూపములవలెనే. ఐతే అజాదిప్రత్యయములను అతుకుటకు 'య' అను పొడివాడవలయును. కావున దీని రూపములు.

ఏకవచనములో :— రా'ః, రా'యమ్, రాయా', రాయే', రాయః', రాయి'
అనియు

ద్వివచనములో :— రా'యౌ, రాభ్యా'మ్, రాయో'ః, అనియు

బహువచనములో :— రా'యః, రాయ'ః, రాభి'ః, రాభ్య'ః, రాయా'మ్, రాసు'
అనివచ్చును.

(ఉ) ఓకారాంత (పుం స్త్రీ. ఎద్దు, ఆవు) గోశబ్దము.

ఇది చాలా అక్రమ పద్ధతిగా నడచును. ద్వితీయా ఏకవచన బహువచనములలో తప్ప మిగిలిన బలీయరూపములలో నిది 'గౌ' (నౌశబ్దమువలె) అగును. ద్వితీయా ఏకవచన బహువచనములలో నిది (రైశబ్దమువలె) గా'మ్, గా'ః యను క్లుప్తరూపముల వహించును. పంచమీ, షష్ఠీ ఏకవచనములలో ('గు' శబ్దమువలె) 'గో'ః' అగును ఇతరరూపములు మామూలే. వేదములో వీనికి ఇతర రూపములును గలవు.

(ఊ) స్త్రీలింగ ద్యో శబ్దము. (ఇది వేదములో సాధారణముగా పుంలింగము) అర్థము ఆకాశము లేక దినము,

దీని నడకయు చాలా క్రమరహితము, దీనికి సులభమగు ప్రకృతి 'ద్యు' అనునది కలదు. ఈ సులభ ప్రకృతి అజాదిప్రత్యయములకు పూర్వమున 'ఉవ్'గా మారును.

ద్యో'శబ్దము సరిగా గో'శబ్దము వలెనే నడచును.

ద్యు శబ్దమును, దివ్ శబ్దమును వేరు శబ్దములుగా భావించి వాని విభక్తి రూపములను సాధించవచ్చును.



# 4. హలంత శబ్దముల విభక్తి ప్రక్రియ

**4.1** (అ) హలంతశబ్దము లన్నిటిని కలిపి ఒకవర్గముగా పరిగణించ వచ్చును. ఏల ననగా వీని ప్రక్రియలో ప్రత్యయముల మార్పులేదు. వీనికి మామూలు ప్రత్యయములే వచ్చుచుండును. ఐతే వీని ప్రకృతులలో మార్పులు ఎక్కువ. ప్రకృతులలో బలీయ, దుర్బల, దుర్బలతరప్రకృతులు ప్రత్యేక గుణములు గలిగియుండును. వీనిలోని భేదములు 'న' యను పొడిచేతను, లేదా ప్రకృతిలోని యచ్చు యొక్క దీర్ఘీకరణముచేతను లేక హ్రస్వీకరణముచేతను, గుణవృద్ధులచేతను, మరి ఇతరవిధముల చేతను గుర్తించనగును.

(ఆ) హలంత శబ్దములలో పుంలింగ స్త్రీలింగరూపములు ఒకేవిధమగు ప్రక్రియను బొందును. వీనిలో స్త్రీలింగ శబ్దములు చాలా తక్కువ. పుంలింగ శబ్దముయొక్క దుర్బల రూపమునకు 'ఈ' చేర్చినచో స్త్రీలింగరూప మేర్పడును. ఇక నపుంసకలింగ శబ్దములు, కేవలము, ప్రథమా, సంబోధన, ద్వితీయా విభక్తులలోనే ఇతరములతో భేదించును. ఈ మూడు విభక్తులలో నివి ఒకే రూపముల నుండును.

(ఇ) అధ్యయన సౌలభ్యముకొరకు హలంత శబ్దముల నీ క్రింది విభాగములుగా విభజించి, వానిని ప్రత్యేకముగా అధ్యయనము చేయుదుము.

I ధాతు ప్రకృతులు; ధాత్వంత ప్రకృతులు, వీనివలె ప్రక్రియను బొందు ఇతర శబ్దములును.

| | | | |
|---|---|---|---|
| II | జన్య ప్రకృతులు | — | అస్, ఇస్, ఉస్ అంతమునగలవి. |
| III | ,, | — | అన్ (అన్, మన్, వన్) ,, |
| IV | ,, | — | ఇన్ (ఇన్, విన్, మిన్) ,, |
| V | ,, | — | అన్త్ (అన్త్, వన్త్, మన్త్) ,, |
| VI | ,, | — | వాన్స్ ,, (పరోక్షభూత, పరస్మైపద, అసమాపక క్రియా విశేషణములు:) perfect Active participles |
| VII | ,, | — | యాన్స్ లేక యస్ అంతమున గలవి. (comparatives) |

**4.2 I** ధాతు ప్రకృతులు; ధాత్వంత ప్రకృతులు; వానివలె ప్రక్రియను బొందు ఇతర శబ్దములును.

వీనిని ఈ క్రింది విధముగా వర్గీకరించవచ్చును.

(i) ధాతువులో ఎట్టి మార్పును లేక యథా తథముగా వచ్చునవి

ఉదా॥ ఋ'చ్ (పద్యము); గి'ర్ (పాట); ప'ద్ (అడుగు);
ది'శ్ (దిశ) మ'హ్ (గొప్పది)

ఐతే ఇట్టి ధాతువులు కొన్ని చోట్ల కొలది మార్పులతో గూడను వచ్చుచుండును.

ఉదా॥ వచ్ —> వా'క్; సృజ్ —> స్ర'జ్; ముష్ —> మూ'ష్;
వస్ —> ఉ'ష్; ...

ఇవిగాక ఋకారాంత ధాతువులనుండి ఇర్, ఉర్ అంతమునగల ప్రకృతులు గూడను ఏర్పడును.

ఉదా॥ స్తి'ర్; గి'ర్; జు'ర్; తు'ర్; ధు'ర్; పు'ర్; ము'ర్;
స్తు'ర్; స్ఫు'ర్; ...

(ii) హ్రస్వస్వరాంత ధాతువులకు 'త్' చేర్చినచో కొన్ని ప్రకృతులేర్పడును.

ఉదా॥ జిత్; ద్యు'త్; శ్రు'త్; కృ'త్; ...

(iii) ధాత్వంతములు కాకపోయినను కొన్ని ఏకాచ్క ప్రకృతులు వీని వలెనే ప్రక్రియను బొందును.

ఉదా॥ త్వ'చ్; (చర్మము) పథ్ (బాట); హృ'ద్ (గుండె); వా'ర్
(నీరు); ద్వా'ర్ (ద్వారము) అ'ప్ (ఉదకము); ఆ'స్ (నోరు).

బహ్వచ్క ప్రకృతులలో కకుభ్ లేక కకుద్ (శిఖరము) మొదలగునవి.

(iv) కొన్ని జన్య ప్రకృతులు— తకారము అంతమున గలవి: అనగా అత్, ఆత్, ఇత్ అంతమున గలవి; కొన్ని ప్రకృతులు 'అద్' అంతమున గలవి; కొన్ని జకారాంత ప్రకృతులు— వీనిని ఈ వర్గమున చేర్చవచ్చును.

(అ) ధాత్వంతప్రకృతులు సాధారణముగా పనిని తెలుపునవి (Nomen actionis) అర్థములో పుంలింగములు. పనిని తేలియజేయ అర్థములో (Nomen actionis) స్త్రీలింగములును.

(ఆ) ఏకాచ్క ప్రకృతుల బలీయరూపములలోని స్వరస్థానముమారదు. ఇతరములలో ఉదాత్తము ప్రత్యయముపైకి వచ్చిచేరును.

(ఇ) కొన్నికొన్ని బలీయరూపములలో నుగాగమము వచ్చును. మరికొన్నిటిలో ధాతువులోని అకారము దీర్ఘీకరించబడును.

**4.3** మచ్చునకు ఈ క్రింది పధకములలో వా'చ్; ప'ద్: మరు'త్; త్రివ'ృత్ పదముల ప్రక్రియ నొసగబడినది.

వచ్ —> వా'చ్ ధాతువులోని అచ్చు దీర్ఘీకరింపబడినది (స్త్రీ (voice)) ప'ద్ (పుం. అడుగు)

| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|
| ప్ర | వా'క్ | వా'చౌ | వా'చః | పా'త్ | పా'దౌ | పా'దః |
| ద్వి | వా'చమ్ | వా'చే | వాచః | పా'దమ్ | ,, | పదః |
| తృ | వాచా' | వాగా'భ్యామ్ | వాగి'భిః | పదా' | పధా'భ్యామ్ | పది'భిః |
| చ | వాచే' | ,, | వాగ'భ్యః | పదే' | ,, | పద'భ్యః |
| పం | వాచ'ః | ,, | ,, | పద'ః | ,, | ,, |
| ష | వాచ'ః | వాచో'ః | వాచా'మ్ | పద'ః | పదో'ః | పదా'మ్ |
| స | వాచి' | వాచో'ః | వాక్షు' | పది' | ,, | పత్సు' |
| సం | వా'క్ | వా'చౌ | వా'చః | పా'త్ | పా'దౌ | పాదః |

మరు'త్ (పుం గాలి) త్రివ'ృత్ (నపుం. మూడువిధములుగలది)

| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|
| ప్ర | మరు'త్ | మరు'తౌ | మరు'తః | త్రివ'ృత్ | త్రివ'ృతీ | త్రివ'ృన్తి |
| ద్వి | మరు'తమ్ | ,, | ,, | ,, | ,, | ,, |
| తృ | మరు'తా | మరు'ద్భ్యామ్ | మరు'ద్భిః | త్రివ'ృతా | త్రివ'ృద్భ్యామ్ | త్రివ'ృద్భిః |
| చ | మరు'తే | ,, | మరు'ద్భ్యః | త్రివ'ృతే | ,, | త్రివ'ృద్భ్యః |
| పం | మరు'తః | ,, | ,, | త్రివ'ృతః | ,, | ,, |
| ష | ,, | మరు'తోః | మరు'తామ్ | ,, | త్రివ'ృతోః | త్రివ'ృతామ్ |
| స | మరు'తి | ,, | మరు'త్సు | త్రివ'ృతి | ,, | త్రివ'ృత్సు |
| సం | మ'రుత్ | - | - | త్రివ'ృత్ | - | - |

సూచన :— చివరి రెండు శబ్దములలో ఉదాత్తస్థానము మారకుండుట గమనించదగినది.

**4.4** హలంత శబ్దముల ప్రక్రియకు ఉదాహరణముగా ఈ క్రింది రూపముల గమనించవలయును.

(అ) జకారాంత ప్రకృతులు (యుజ్ వర్గమునుండి ఉత్పన్నములు) : భిష'జ్ (వైద్యుడు) భిష'క్; భిష'జమ్; భిష'గ్భిః; భిష'క్సు: — మృజ్‌వర్గము స(మ్రా'జ్ : స(మ్రా'ట్, స(మ్రా'జమ్, స(మ్రా'డ్భిః, స(మ్రా'ట్సు;

(ఆ) ధకారాంత ప్రకృతులు (వృధ్ నుండి వచ్చినవి) : — వ'ృత్; —వ'ృద్ధమ్;—వృద్భిః;— వృత్సు;...బుధ్ నుండియుత్పన్నములు:—భు'త్; — బు'ధమ్;—భు'ద్భిః;—భు'త్సు;

(ఇ) భకారాంత ప్రకృతులు (స్తుభ్ నుండి జన్యములు): — స్తుప్; —స్తు'భమ్;—స్తుబ్భిః;—స్తు'ప్సు;

(ఈ) శకారాంత ప్రకృతులు దిశ్ ది'క్; ది'శమ్; దిగ్'భిః; దిక్షు'; వి'శ్ (జనులు) : వి'ట్; విశమ్; విడి'భిః; విట్సు' (వేదములో విక్షు')

(ఉ) షకారాంత ప్రకృతులు : ద్విష్ (ద్వేషించు) ది'ట్; ది'వషమ్; ద్విడా'భ్యామ్; ద్విడి'భిః; ద్విట్సు';

(ఊ) హకారాంత ప్రకృతులు దుహ్ (పితుకు) : ధు'క్; దు'హమ్; ధు'గ్భిః; ధు'క్షు; ఇట్లే రుహ్ తరగతికి చెందినవి — లిహ్ వర్గమునకు చెందినవి : లిట్; లిహమ్; లిడ్భిః; లిట్సు;

(ఋ) ఇర్, ఉర్ అంతమున గల ప్రకృతుల ప్రథమైక వచనమునను, దుర్భల ప్రత్యయములలోను, వీనిలోని ఇ, ఉ లకు దీర్ఘము అగును. ఉదా॥ గీ'ర్ (గీః) ; గి'రమ్, గిరా', ... గి'రౌ, గీర్భ్యా'మ్, గిరో'ః, గి'రః, గీర్'భిః, గీర'భ్యః, గిరా'మ్, గీర్షు,

ఇట్లే పు'ర్ (పురము) శబ్దముయొక్క రూపములు

పూ'ర్, పు'రమ్, పురా', ... పు'రౌ, పూరా'భ్యామ్, పురోః, పుర'ః, పూరి'భిః, పూర'భ్యః, పురామ్, పూర్షు'.

సూచన : (i) దుర్బల రూపములలో ఉదాత్తస్థానము మారుట గమనించదగినది.

(ii) ఇర్, ఉర్, ఇస్ అంతమునగల ప్రకృతులు సమాసపదముల లోను, జనన క్రియ యందును. తమ అచ్చుల దీర్ఘత్వమును పొందును. ఉదా॥ గీర్వాణ, పూరి'భిద్, ధూర్గత, ఘూస్త్వా, ఆశీర్దా', ఆశీర్వన్త్, (గిర్వన్, గిర్వణః రూపములును కలవు).

(ఋ) అప్ (స్త్రీ. నీరు) బహువచనముననే ప్రక్రియను బొందును. దీని రూపములు : ఆ'పః, అప'ః, అద్'భిః, అద్భ్యః, అపామ్, అప్'సు.

(క్రింద గీత నుంచిన రూపములను గమనించవలయును)

ప్రథమలో అపః అనియు. ద్వితీయలో ఆ'పః అనియు ప్రయోగము లున్నవి

(ౠ) పు'ంస్ (పుం. పురుషుడు) శబ్దప్రక్రియ చాలా క్రమరహితముగా నుండును దీని బలీయ ప్రకృతులు 'పుమాన్స్' హలాది ప్రత్యయముల ముందు (అనగా దుర్బలరూపములలో) దీనిలోని సకారము లుప్తమగును సంబోధన ఏకవచమున పు'మన్ (గమనించుడు) దీని రూపములు— ఏకవచనములో పు'మాన్, పు'మాంసం; పుంసా', పుంసే, పుంసః', పుంసి';— ద్వివచమున పు'మాన్సౌ; పుంభ్యా'మ్; పుంసోః; బహువచనమున పు'మాన్సః, పుంస'ః పుంభి'ః, పుంభ్'యః, పుంసా'మ్, పుంసు'.

ఈ పు'ంస్ శబ్దము సంయుక్తపదములలో బహువిచిత్ర రూపములు ధరించును. ఉదా॥ పుంశ్చలీ', పుంస్త్వా, పుంస్వన్త్. — పుంస్క, పు'ంవత్స, పు'ంరూప, పుంవత్, పుమర్ధ, పుంసవన్త్, స్త్రీ పుంసా, మహాపుంసా, స్త్రీపుమా.

(ఌ) పథ్ (మార్గము, త్రోవ) శబ్దముయొక్క బలీయప్రకృతి పంథా (లేక పంథన్) శబ్దము నుండియు, దుర్బలములు పథి శబ్దమునుండియు, దుర్బల తరములు పథ్ నుండియు ఏర్పడును.

(ఏ) దంత్ (పన్ను) పుం. యొక్క బలీయప్రకృతి ద'ంతః, బలహీన ప్రకృతి ద'త్. వీనితో నేర్పడు రూపములు మామూలే.

(ఐ) ఈవర్గములోని కొన్ని ప్రకృతులు అసమగ్రములు కొన్ని హలంత ప్రకృతులైనను, చివరన అచ్చు నొకదానిని చేర్చి అజంతప్రక్రియకు బదిలీ

చేయుటయైనది. మొదటిజాతికి చెందినవి హృ'ద్ (నపుం. హృదయము), మాంస్ (నపుం మాంసము); మాస్ (పుం. నెల), నస్ (స్త్రీ. ముక్కు), నిశ్ (స్త్రీ. రాత్రి) పృ'త్ (స్త్రీ సైన్యము). వీని బలీయప్రకృతులు వరుసగా హృదయ, మాంస', మా'స, నాసికా', నిశా, పృ'తనా, ...

అజంత ప్రక్రియకు మారినవి పా'ద, - మాద, - దాశ, భ్రాజ', విష్ట'ప, ద్వార, దుర, పుర, - దృశ, నా'సా, నిడా, క్షి'పా, క్షపా', ఆశా' ...... మొదలగునవి.

## విశేషణములు

**4.5** (అ) ధాతురూప విశేషణములు ప్రాచీన వాఙ్మయమున చాలా అరుదు. అర్వాచీనవాఙ్మయమున నతిస్వల్పము. ఐతే ధాత్వంత విశేషణములు ప్రాచీనార్వాచీన వాఙ్మయములో చాలా విరివిగా కన్పించును. వీని సుబంతప్రక్రియ మామూలు ధాత్వంత విశేష్యముల ప్రక్రియవలెనే యుండును.

(ఆ) ఈక్రింది ధాత్వంతసమాస పదముల క్రమరహిత ప్రక్రియను గమనింపవలసియుండును. (i) హన్ (చంపు) అంతమునగల పదములు (ii) వహ్ (మోయు) అంతమునగల పదములు ఉదా॥ వృత్రహన్ (ఇంద్రుడు), హవ్యవహ్ (హవ్యమును మోయువాడు - అగ్ని)

(ఇ) 'హన్' అంతముగల పదములు, ఇంచుమించు, అన్ అంతమున గల పదములవలె ప్రక్రియను పొందును. ఇది ప్రథమా ఏకవచనమున 'హా'' యగును. దుర్బలప్రకృతులలో నకారము లుప్తమగును. దుర్బర తరప్రకృతులలో అకారము లుప్తమగును. ఐతే ఇట్టిచోట 'హ్', తరువాత వచ్చిన నకారముతో కలిసి దాని పూర్వరూపమగు 'ఘ్'గా మారును. ఇట్లు

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | వృత్రహా' | వృత్రహ'ణౌ | వృత్రహ'ణః |
| ద్వి. | వృత్రహ'ణమ్ | ,, | వృత్రఘ్నః |
| తృ. | వృత్రఘ్నా' | వృత్రహ'భ్యామ్ | వృత్రహ'భిః |
| చ. | వృత్రఘ్నే' | ,, | వృత్రహ'భ్యః |
| పం. | వృత్రఘ్నః' | ,, | ,, |
| ష. | ,, | వృత్రఘ్నో'ః | వృత్రఘ్నా'మ్ |
| స. | వృత్రఘ్ని'-హ'ని | ,, | వృత్రహ'సు |
| సం॥ | వృ'త్రహన్ | వృ'త్రహణౌ | వృ'త్రాహణః |

(ఈ) సమాసాంత పదమున వచ్చు వహ్, వాహ్‌గా మారును. ఇది బలీయ, దుర్బలప్రకృతులలో మాత్రమే జరుగును. దుర్బలతర ప్రకృతులలో ఇది 'ఊ'హ్'గా మారును. ఇది దీనిముందున్న అకారముతో కలిసి 'ఔ' అగును. ఇట్లు హవ్య వహ్ శబ్దమునకు

ఏకవచనములో హవ్యవా'ట్, హవ్యవా'హమ్, హవ్యౌ'హా . .

ద్వివచనములో హవ్యవాహౌ', హవ్యవా'డ్భ్యామ్, హవ్యౌహోః.

బహువచనములో హవ్యవా'హః, హవ్యౌ'హః, హవ్యవా'డ్భిః ...

(ఉ) 'వహ్' అంతమున వచ్చు పదములలో చాలా విరివిగా వచ్చునది, చాలా క్రమరహిత పద్ధతిని ప్రక్రియను బొందునది యగు పదము అనడ్వాహ్ (బరువును మోయునది, ఎద్దు : అనస్ + వహ్). దీని బలీయప్రకృతి "అనడా'హ్వ" దుర్బలప్రకృతి "అనడుద్", దుర్బల తరప్రకృతి "అనడుహ్". ఇవిగాక దీని ప్రథమా, సంబోధనా ఏకవచనములు 'అనడ్వాన్' అగును. దీని రూపావళిని సంపూర్ణముగా వ్రాయునది.

(ఊ) అచ్ లేక అఞ్చ్ అంతమునగల సమాసపదములు. ఇవిఉపసర్గలతోను, ఇతర పదములతోను కలిసి చాలా విశేషణము లేర్పడును. వీని ప్రక్రియయు చాలా క్రమరహితముగా నుండును.

ఉదా॥ ప్రాఞ్చ్ (ముందున నున్న, తూర్పువైపు); ప్రత్య'ఞ్చ్ (వెనుక, పడమర) విష్వ'ఞ్చ్ (విడిపోవు) ......

(ఋ) 'అఞ్చ్' అనునది బలీయ రూపము. (ఒకొక్కప్పుడు 'అంక్' గూడను) బలహీనరూపములు (దుర్బల, దుర్బలతర రూపములు రెండును) 'అచ్' (ఒకొక్కమారు బలహీనరూపమున 'చ్' మాత్రము నిలుచును.) దీనికి ముందున్న అకారము తత్పూర్వమునన్న ఇ, ఉలతో విలీనమై వరుసగా ఈ, ఊలుగామారును ఉదాహరణకు ప్రా'ఞ్చ్ శబ్దరూపావళి ఈ దిగువనీయబడినది.

| | ఏక (పుం) | ఏక (నపుం) | ద్వి (పుం) | ద్వి (నపుం) | బ (పుం) | బ (నపుం) |
|---|---|---|---|---|---|---|
| ప్ర | ప్రా'న్ | ప్రా'క్ | ప్రా'ఞ్చౌ | ప్రా'చీ | ప్రా'ఞ్చః | ప్రా'ఞ్చి |
| ద్వి | ప్రా'ఞ్చమ్ | ,, | ,, | | ,, | |
| తృ | ప్రా'చా | | ప్రా'గ్భ్యామ్ | | ప్రా'గ్భిః | |
| చ | ప్రా'చే | | ,, | | ప్రా'గ్భ్యః | |
| పం | ప్రా'చః | | ,, | | ,, | |
| ష | ప్రా'చః | | ప్రా'చోః | | ప్రా'చామ్ | |
| స | ప్రా'చి | | ,, | | ప్రా'క్షు | |
| సం॥ | ప్రా'న్, | ప్రా'క్ | ప్రా'ఞ్చౌ, | ప్రా'చీ | ప్రా'ఞ్చః, | ప్రా'ఞ్చి |

ఇట్లే ప్రత్య'ఞ్చ్; విష్వ'ఞ్చ్; అపా'ఞ్చ్; అర్వా'ఞ్చ్; పరా'ఞ్చ్; ...
వీని స్త్రీలింగరూపములు ప్రా'చీ, ప్రతీచీ', వి'షూచీ, ......
వీని ప్రక్రియ ఈకారాంత స్త్రీలింగ శబ్దముల వలెనే.

**4.6** (అ) అస్, ఇస్, ఉస్ అంతమునగల జన్యప్రకృతులు.

ఈ జాతిలోని శబ్దములు చాలావరకు నపుంసక లింగములు. ఐనను కొన్ని పుంలింగములును, ఒకటిరెండు స్త్రీలింగములును లేకపోలేదు. వీనిలో 'అస్' అంతమునగల ప్రకృతులసంఖ్య ఎక్కువ. మిగిలినవి ఇస్, ఉస్ అంతమునగలవి. (కొలది ప్రకృతులు తస్, నస్ అంతమున గలవికూడా కలవు)

వీనిప్రక్రియయు చాలావరకు సక్రమమే. ఐతే అస్ అంతమునగల ప్రకృతులు, ప్రథమా ఏకవచనమున, స్త్రీ, పుంలింగములలో 'ఆస్'తో అంత మగును. ఇట్లే నపుంసక లింగముల ప్రథమా, సంబోధన, ద్వితీయా బహు వచనములలో నుగాగమమునకు ముందున్న అచ్చు దీర్ఘీకరణమును బొందు. వీనిప్రక్రియకు నమూనాగా ఈ క్రింది శబ్దములను స్వీకరించుదము.

( ) అ'ంగిరస్ (పుం-ఆంగిరసుడు) ( ) మ'నస్ (నపుం. మనస్సు). (3) హవిస్ (నపుం. హవిస్సు) (4) చక్షుస్ (నపుం. కన్ను).

(1) అంగిరస్ (పుం) (2) మనస్ (నపుం).

| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|
| ప్ర | అ'ంగిరాః | అ'ంగిరసౌ | అ'ంగిరసః | మ'నః | మ'నసీ | మ'నాంసి |
| ద్వి | అ'ంగిరసమ్ | ,, | ,, | ,, | ,, | ,, |
| తృ | అ'ంగిరసా | అ'ంగిరోభ్యామ్ | అ'ంగిరోభిః | మ'నసా | మ'నోభ్యామ్ | మ'నోభిః |
| చ | అ'ంగిరసే | ,, | అ'ంగిరోభ్యః | మ'నసే | ,, | మ'నోభ్యః |
| పం | అ'ంగిరసః | ,, | ,, | మ'నసః | ,, | ,, |
| ష | ,, | అ'ంగిరసోః | అ'ంగిరసామ్ | మ'నసః | మ'నసోః | మ'నసామ్ |
| స | అ'ంగిరసి | ,, | అ'ంగిరఃసు | మ'నసి | ,, | మ'నఃసు |

| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|
| | (3) హవి'స్ (నపుం. హవిస్సు) | | | (4) చక్షుస్ (నపుం. కన్ను) | | |
| ప్ర | హవి'స్ | హవి'షీ | హవీ'ంషి | చ'క్షుస్ | చ'క్షుషీ | చ'క్షూంషి |
| ద్వి | ,, | ,, | ,, | ,, | ,, | ,, |
| తృ | హవి'షా | హవి'ర్భ్యామ్ | హవి'ర్భిః | చ'క్షుషా | చ'క్షుర్భ్యామ్ | చ'క్షుర్భిః |
| చ | హవి'షే | హవి'ర్భ్యామ్ | హవి'ర్భ్యః | చ'క్షుషే | చ'క్షుర్భ్యామ్ | చ'క్షుర్భ్యః |
| పం | హవి'షః | ,, | ,, | చ'క్షుషః | ,, | ,, |
| ష | ,, | హవి'షోః | హవి'షామ్ | ,, | చ'క్షుషోః | చ'క్షుషామ్ |
| స | హవి'షి | ,, | హవి'ఃసు | చ'క్షుషి | ,, | చ'క్షుఃసు |

సూచన: పైశబ్దములలోని ఉదాత్తస్థానము మారకుండుట గమనించదగినది.

## విశేషణములు.

**4.7** 'ఇస్' అంతమునగల అసలు విశేషణములు కానరావు. కాని 'ఉస్' అంతమునగల విశేషణవాచకములు విరివిగనే కన్పడుచున్నవి. వీని నామవాచక రూపములలోను, విశేషణ రూపములలోను ఉదాత్తస్థానము ఒకటే. ఉదా॥ త'పుస్ (వేడి, వేడిగల): వ'పుస్ (ఆశ్చర్యము, ఆశ్చర్యకరమగు) ఐతే అస్ అంతమునగల విశేషణవాచకములలో ఉదాత్త స్థానము మారియుండును. ఉదాత్త స్థానముమారిన అర్థమును భేదించు శబ్దముల యుదాహరణకై ఈ క్రింది శబ్దములు గమనించిన చాలును.

ఆ'పస్ (పని), అప'స్ (చురుకైన)—త'రస్ (త్వరితగతి): తర'స్ (త్వరితగతిగలిగిన)—య'శస్ (కీర్తి): యశ'స్ (కీర్తిగల)...

సాధారణముగా విశేషణములలో ఉదాత్తము చివరియచ్చు పైనుండును.

నామవాచకము అంతమునగల విశేషణములును భాషలోమెండుగానున్నవి ఉదా॥ సుమ'నస్; దీర్ఘా'యుష్; శుక్ర' శోచిష్;...

వీని ప్రక్రియలు మామూలే. స్త్రీ పుం లింగముల ప్రథమైక వచనములో 'ఆస్' (అంగిరస్ శబ్దములోవలె) వచ్చును.

ఉదా:

| | ఏక | | | ద్వి | | | బహు. | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | పుం. | స్త్రీ | నపుం | పుం | స్త్రీ | నపుం. | పుం | స్త్రీ | నపుం |
| ప్ర | సుమ'నాః | | —నః | సుమ'నసౌ | | —నసీ | సుమ'నసాః | | —నాంసి |
| ద్వి | సుమనసమ్ | | —నః | ,, | | ,, | ,, | | ,, |

ఇతరములు మామూలే

ఇట్లే

| పుం. స్త్రీ. | నపుం. | పుం స్త్రీ | నపుం. | పుం. స్త్రీ | నపుం |
|---|---|---|---|---|---|
| దీర్ఘా'యుః | | దీర్ఘా'యుషౌ | —యుషీ | దీర్ఘా'యుషః | —యూంషి |
| దీర్ఘా'యుషమ్ | | ,, | ,, | ,, | ,, |
| దీర్ఘా'యుషా | | దీర్ఘా'యుర్భ్యామ్ | | దీర్ఘా'యుర్భిః | |

ఇతరములు మామూలే

**4.8** (ఇ) 'అన్' అంతమునగల జన్య ప్రకృతులు

ఈ జాతి ప్రకృతుల యంతమున అన్, మన్, వన్ లు ఉండును. ఇవి యన్నియును సాధారణముగా పుంలింగములో, నపుంసకలింగములో. వీని ముఖ్యగుణమేమనగా. వీని ప్రకృతులకు మూడు రూపములుండును. (i) పుంలింగము యొక్క బలీయరూపములో 'అన్' లోని అకారము దీర్ఘమగును (ii) దుర్బలతర రూపములో (అజాది ప్రత్యయములకుముందు) నీ అకారములోపించును. (iii) దుర్బల ప్రత్యయములలో (హలంత ప్రత్యయములకుముందు) 'న్' లోపించును. ఇవిగాక పుం నపుం లింగముల ప్రథమైక వచనములందును 'న్' లోపించికేవలము ఆ, అ లుగా నిలచిపోవును. నపుంసకలింగ రూపములు మామూలుగా ఇతరనపుంసక లింగశబ్దరూపములనే పోలియుండును.

(అ) ఉదాహరణకు రా'జన్, ఆత్మ'న్, నా'మన్ శబ్దముల రూపావళి ఈ క్రింద నొసగబడినది

| | రాజన్ (పుం. రాజు) | | | ఆత్మన్ (పుం. ఆత్మ) | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| ప్ర | రా'జా | రా'జానౌ | రా'జానః | ఆత్మా' | ఆత్మా'నౌ | ఆత్మా'నః |
| ద్వి | రా'జానమ్ | ,, | రా'జ్ఞః | ఆత్మా'నమ్ | ,, | ఆత్మ'నః |
| తృ | రా'జ్ఞా | రా'జభ్యామ్ | రా'జభిః | ఆత్మ'నా | ఆత్మ'భ్యామ్ | ఆత్మ'భిః |
| చ | రా'జ్ఞే | ,, | రా'జభ్యః | ఆత్మ'నే | ,, | ఆత్మ'భ్యః |
| పం | రా'జ్ఞః | ,, | ,, | ఆత్మ'నః | ,, | ,, |
| ష | ,, | రా'జ్ఞోః | రా'జ్ఞామ్ | ఆత్మ'నః | ఆత్మ'నోః | ఆత్మ'నామ్ |
| స | రా'జ్ఞి, రాజని | ,, | రా'జసు | ఆత్మ'ని | ,, | ఆత్మ'సు |

నా'మన్ (నపుం. పేరు)

| | ఏ | ది | బ |
|---|---|---|---|
| ప్ర | నా'మ | నా'మనీ, నా'మ్నీ | నా'మాని |
| ద్వి | ,, | ,, | ,, |
| తృ | నా'మ్నా | నా'మభ్యామ్ | నా'మభిః |
| చ | నా'మ్నే | ,, | నా'మభ్యః |
| పం | నా'మ్నః | ,, | ,, |
| ష | ,, | నా'మ్నోః | నా'మ్నామ్ |
| స | నా'మ్ని, నా'మని | ,, | నా'మసు. |

(అ) ఈ శబ్దములకు వేదవాఙ్మయమున అనేకములగు మార్పులు గనుపించును సర్వసాధారణముగా ప్రథమా సంబోధన, ద్వితీయావిభక్తుల ద్వివచనములలో 'ఔ' ప్రత్యయమునకు బదులు 'ఆ' ప్రత్యయము వచ్చును. ఇతర వివరములకు వేదవ్యాకరణమును చూడనగును.

(ఇ) కొన్నికొన్ని ప్రకృతుల (ప్రథమైకవచనమున తప్ప) బలీయ రూపములలోని అకారము దీర్ఘీకరింపబడదు ఉదా॥ వైదిక దైవముల పేర్లగు పూష'న్, అర్యమ'న్ మొదలగునవి. కొన్నికొన్నిచోట్ల ఉక్ష'న్ (ఎద్దు) యో'షన్ (ఆడుది). వృ'షన్ (కోడె)... (ఐతే వీని మామూలు రూపములు గూడను కనుపించును)

(ఈ) శ్వ'న్ (పుం. కుక్క), యు'వన్ (యవ్వనుడు) శబ్దముల బలీయ, దుర్బల ప్రకృతులు మామూలే యైనను, దుర్బలతర ప్రకృతులలో మాత్రము, అవి సంకుచితములై వరుసగా శు'న్, 'యూన్' అగును (ఉదాత్త స్థలము మారదు) ఇట్లు వీనిరూపములు శ్వా'. శ్వా'నమ్, శు'నా, శునే ... శ్వ'భ్యామ్, శ్వ'భిః,... మరియు యు'వా, యువానమ్, యూ'నా, యువభిః...

(ఈ శబ్దముల రూపముల నన్నిటిని పూర్తిగా ఊహించునది)

(ఉ) మఘ'వన్ (ఇంద్రుడు) శబ్దప్రకృతి దుర్బలతరరూపమున 'మఘోన్' అగును.

(ఊ) అహన్ (నపుం దినము) అర్వాచీనవాఙ్మయములో బలీయ, దుర్బలతరరూపములలో మాత్రమే వాడబడుచున్నది. దుర్బలరూపములు అహర్ లేక అహస్ శబ్దమునుండి యుత్పన్నములు. అహః (ప్ర. ద్వి ఏక) అహోభ్యామ్, అహోభిః,... వగైరా.

(ఋ) నపుంసకరూపములగు అక్ష'న్ (కన్ను), అస్థ'న్ (ఎముక) దధ'న్ (పెరుగు) సక్థ'న్ (తొడ) మొదలగునవి అర్వాచీన వాఙ్మయమున దుర్బలతర రూపములలోనే వాడబడుచున్నవి. అక్ష్ణా', అక్ష్ణే', దధ్నా', సక్థ్ని'. వీని ఇతర రూపములు ఇకారాంతప్రకృతులచే (అక్షి... వగైరా) ఏర్పడును. (చూ. 3.8 (ఋ))

(ౠ) పంథన్ (పుం) శబ్దముయొక్క బలీయప్రకృతి పంథన్, దుర్బలరూపప్రకృతి 'పథి', దుర్బలతర రూపప్రకృతి పథ్, ఐతే ప్రథమా సంబోధన ఏకవచనములలో విసర్గచేర్చబడును. ఇట్లే మ'ంథన్ (కవ్వము) శబ్దమును.

విశేషణములు

'అన్' అంతమునగల విశేషణములు సాధారణముగా 'వన్' ప్రత్యయముచే నేర్పడును. య'జ్వన్ (యజించుచున్న), సు'త్వన్ (బయటకు నెట్టుచున్న) జి'త్వన్ (జయించుచున్న)... ఇవి పుంలింగ నపుంసక లింగములలో మాత్రమే యుండును. వీని స్త్రీలింగరూపములు య'జ్వరీ, సు'త్వరీ, జి'త్వరీ, వగైరా.

వీని ప్రక్రియ 'అన్' అంతమున గల నామవాచకములవలెనే యుండును. 'అన్' అంతమునగల నామవాచకముతో నేర్పడిన సమాసపదముల ప్రక్రియలో 'అన్' కు బదులు అకారాంతము వచ్చును.

ఉదా॥ రాజ; జన్మ; అధ్వ; అహ; వగైరా వీని స్త్రీలింగరూపములు ఆకారాంతములగును.

4.9 (ఈ) 'ఇన్' అంతమునగల జన్యప్రకృతులు (విశేషణములు)

ఈ తరగతి ప్రకృతులు ఇన్, మిన్, విన్ అనుసర్గలచే నేర్పడును. ఇవి యన్నియు సాధారణముగా పుంలింగ, నపుంసక లింగములే—వీనికి ఈకారము చేర్చినచో స్త్రీలింగరూపము లేర్పడును.

ఇన్ అంతమునగల ప్రకృతులు వాఙ్మయమున చాలా బహుళముగా నున్నవి ఏ యకారాంతనామవాచకమునకైనను 'ఇన్' చేర్చినచో దాని స్వత్వార్థక విశేషణమేర్పడును (possessive adjective).

ఉదా॥ బ'ల (బలము)—> బలిన్ (బలముగలిగియున్న)

దీని స్త్రీలింగరూపము బలి'నీ.

వీని ప్రక్రియయు చాలా సక్రమ పద్ధతిని నడచును. ఐతే వీని దుర్బల ప్రకృతులలో నకారము లోపించును. ప్రథమైకవచనమున పుంలింగమున ఇకారము దీర్ఘమగును

**4.10** బలిన్ (పుం నపుం బలముగలిగిన)

| | ఏ | | ద్వి | | బ | |
|---|---|---|---|---|---|---|
| | పుం. | నపుం. | పుం. | నపుం | పుం. | నపుం. |
| ప్ర | బలీ' | బలి' | బలి'నౌ | బలి'నీ | బలి'నః | బలీ'ని |
| ద్వి | బలి'నమ్ | ,, | ,, | ,, | ,, | ,, |
| తృ | బలి'నా | | బలి'భ్యామ్ | | బలి'భిః | |
| చ | బలి'నే | | ,, | | బలి'భ్యః | |
| పం | బలి'నః | | ,, | | ,, | |
| ష | ,, | | బలి'నోః | | బలి'నామ్ | |
| స | బలి'ని | | ,, | | బలి'షు | |

(అ) స్త్రీలింగరూపములు ఈకారాంత స్త్రీలింగరూపములవలెనే ప్రక్రియను బొందును

**4 11** (ఉ) అన్త్ (లేక అత్) అనుసర్గ గల జన్య (విశేషణ) ప్రకృతులు.

ఈ ప్రకృతులు రెండు విధములుగా నుండును. (1) క్రియాపదములకు అన్త్ లేక అత్ అనుసర్గలను చేర్చుటచే నేర్పడు అసమాపక క్రియావిశేషణములు. ఇవి వర్తమానకాలమునకు సంబంధించినవి కావచ్చును, లేక భూతకాలమునకు సంబంధించినవి కావచ్చును. (2) స్వత్వమును తెలియజేయు మన్త్, వన్త్ (లేక మత్, వత్) అనుసర్గలచే నేర్పడు స్వత్వార్థక విశేషణములు (possessive adjectives)ఇవి పుంలింగ నపుంసకలింగములలో నేయుండును. వీని స్త్రీలింగరూపములు ఈకారాంతములచే నేర్పడును. వీని ప్రక్రియయు, ఈకారాంత స్త్రీలింగ ప్రకృతుల ప్రక్రియకువలెనే యుండును.

( ) అన్త్, అత్‌లతో నేర్పడు అసమాపకక్రియావిశేషణములు.

(అ) సాధారణముగా వీని ప్రకృతులకు రెండేరూపములుండును బలీయములు, బలహీనములును, బలీయప్రకృతుల యంతమున 'అన్త్', బలహీన ప్రకృతుల యంతమున 'అత్' ఉండును.

(ఆ) కొన్ని ప్రకృతులు కేవలము 'అత్' తోనే అంతమగును. వర్తమానకాలమున, పరస్మైపదములతో కవ పురుష బహువచనమున (3rd person, plural of Parasmipada Voice in Present Tense) అ'న్తి యను ప్రత్యయమునకు బదులు 'అ'తి' యను ప్రత్యయము ఏ క్రియాపదములలో వచ్చునో ఆ క్రియాపదముల వర్తమాన అసమాపకక్రియావిశేషణములన్నియును 'అత్' తో నేర్పడును వీనిలో బలీయ దుర్బల, దుర్బలతరభేదములు లేవు

(ఇ) వీని సుబంత ప్రక్రియ సక్రమపద్ధతినే నడచును

(i) భవ'న్త్ (ఉండుచున్న) (ii) జుహ్'వత్ (యజించుచున్న)

| | ఏక | | ద్వి | | బ | |
|---|---|---|---|---|---|---|
| | పుం. | నపుం. | పుం. | నపుం | పుం | నపుం. |
| ప్ర | భ'వన్త్ | భ'వత్ | భ'వన్తౌ | భ'వతీ | భ'వన్తః | భ'వన్తి |
| ద్వి | భ'వన్తమ్ | ,, | ,, | ,, | ,, | ,, |
| తృ | భ'వతా | | భ'వద్భ్యామ్ | | భ'వద్భిః | |
| చ | భ'వతే | | భ'వద్భ్యామ్ | | భ'వద్భ్యః | |
| పం | భ'వతః | | భ'వద్భ్యామ్ | | భ'వద్భ్యః | |
| ష | భ'వతః | | భ'వతోః | | భ'వతామ్ | |
| స | భ'వతి | | భ'వతోః | | భ'వత్సు | |

| (ii) | ఏక | | ద్వి | | బ | |
|---|---|---|---|---|---|---|
| | పుం | నపుం. | పుం. | నపుం. | పుం. | నపుం. |
| | జు'హ్వత్ | జు'హ్వత్ | జు'హ్వతౌ | జు'హ్వతీ | జు'హ్వతః | జు'హ్వతి |
| | జు'హ్వతమ్ | ,, | ,, | ,, | ,, | ,, |
| | జు'హ్వతా | | జు'హ్వద్భ్యామ్ | | జు'హ్వద్భిః | |
| | జు'హ్వతే | | ,, | | జు'హ్వద్భ్యః | |
| | జు'హ్వతః | | ,, | | ,, | |
| | ,, | | జు'హ్వతోః | | జు'హ్వతామ్ | |
| | జు'హ్వతి | | ,, | | జు'హ్వత్సు | |

(ఈ) స్త్రీలింగరూపములు అంతమున ఈకారము చేర్చుటచే నేర్పడును. వీని ప్రక్రియయు ఈకారాంత స్త్రీలింగశబ్దములవలెనే.

(ఉ) కొన్ని శబ్దములు రూపమున అసమాపకక్రియావిశేషణములవలె నున్నను అర్థములో మాత్రము అసమాపక క్రియలుగావు. వాని సుబంత ప్రక్రియ పైవానివలెనే యుండును

ఉదా॥ బృహ'న్త్ (పెద్ద) బృహ'త్, బృహ'తీ, బృహ'న్తి...
మహ'న్త్ (పెద్ద) బలీయ రూపములలో దీనిలోని అకారము దీర్ఘీకరింపబడును. మహా'న్, మహా'న్తమ్, మహా'న్తౌ;...
కాని తృతీయావిభక్తిలో మహతా'...
ఋహ'న్త్(చిన్న); పృష'న్త్(చిలుకుచున్న); రు'శన్త్ (హింసించుచున్న)...
వీని స్త్రీలింగరూపములన్నియు 'అతీ' ప్రత్యయముతోనే యంతమగును. బృహతీ', మహతీ', పృ'షతీ, రు'శతీ,...
(అసమాపక క్రియలయొక్క స్త్రీలింగరూపములకును, వీనికిని భేదము గమనింపదగినది)
జ'గత్ (కదలుచున్న: అర్వాచీనవాఙ్మయమున ప్రపంచము) ఇది గా (గమ్?) నుండి యుద్భవించినది (పునర్ద్విత్వముచే)

2. మన్త్, వన్త్ చివరగాగల స్వాత్వార్థక విశేషణములు

పైరెండు అనుసర్గలచే నేర్పడు విశేషణముల సుబంత ప్రక్రియ ఒకే విధముగానుండి ఇంచుమించు అసమాపకక్రియావిశేషణముల ప్రక్రియను బోలి యుండును (భేదము. పుం. ప్ర. ఏకవచనమునమాత్రము. వీనిలోని అకారము దీర్ఘీకరించబడును).

(ఊ) వీని స్త్రీలింగరూపములు దుర్బల ప్రకృతులచే నేర్పడును.
ఉదా॥ —మతీ, —వతీ...

దీనిలోని ఉదాత్తస్థానము ఎల్లప్పుడును ప్రకృతిపైననే యుండును. (అసమాపకక్రియల కిది విరుద్ధము)

(ఋ) పశుమన్త్ (పశువుల గలిగియున్న)
భగవన్త్ (ఐశ్వర్యము గలిగియున్న)

| | ఏ | | ద్వి | | బ | |
|---|---|---|---|---|---|---|
| | పుం. | నపుం. | పుం. | నపుం. | పుం. | నపుం |
| ప్ర | భగవాన్ | భగవత్ | భగవన్తౌ | భగవతీ | భగవన్తః | భగవన్తి |
| ద్వి | భగవన్తమ్ | ,, | ,, | ,, | భగవతః | ,, |

మిగిలిన రూపములు మామూలే.

ఇట్లే పశుమ'న్త్ శబ్దమును.

(ఋ) అ'ర్వాన్త్ (పరుగెత్తుచున్న, గుఱ్ఱము) యొక్క ప్రథమైకవచన రూపము అ'ర్వా (అ'ర్వ నుండి)

(౧) సర్వనామ విశేషణములగు తా'వన్త్, ఏతా'వన్త్, యా'వన్త్....

వైదికములగు ఈ'వన్త్, మా'వన్త్, త్వా'వన్త్... మొదలగువాని ప్రక్రియయు నామవాచక జన్యప్రకృతుల ప్రక్రియవలెనే

వైదికప్రయోగములకు వేదవ్యాకరణమును గమనించునది.

**4.12** (ఊ) 'వాన్స్' అంతమునగల పరోక్షభూత అసమాపక క్రియా విశేషణములు. (Perfect Participles ending in Vans)

పరస్మైపద క్రియారూపముల పరోక్షభూత అసమాపక క్రియావిశేషణముల సుబంత ప్రక్రియలో, వాని ప్రకృతులు విచిత్రములగు మార్పులను పొందును దీని బలీయరూపములో (నపుం. ప్ర ద్వి. సం. బహువచనముతో సహా) అనుసర్గ 'వాన్స్' అగును, ఇదే ప్రథమైకవచనమున 'వాన్' అగును (చివర ఒకే హల్లు ఉండు నియమముచే). ఇది సంబోధనైకవచనములో హ్రస్వీకరణమును బొంది 'వన్' అగును దుర్బలతర ప్రకృతులలో అనుసర్గము సంకుచితమై 'ఉష్' అగును. ఇది దుర్బలరూపములలోను, నపుం ప్ర సం. ద్వి ఏకవచనములలోను 'వత్' గా మారును. బలీయ, దుర్బల ప్రకృతులలో హల్లి 'ఇ' యుండిన నిది దుర్బలతర రూపములలో ('ఉష్' కు ముందు) లోపించును.

(అ) ఉదాహరణముగా (1) విద్వాన్స్ (తెలిసికొనియున్న) (2) తస్థివాంస్ (ఉండియున్న) ప్రక్రియలను సూచించుదుము.

(1) విద్వాన్స్ (తెలిసికొనియుండిన)

| | ఏ | | ద్వి | | బ | |
|---|---|---|---|---|---|---|
| | పుం. | నపుం. | పుం. | నపుం. | పుం | నపుం. |
| ప్ర | వి'ద్వాన్ | వి'ద్వత్ | వి'ద్వాన్సౌ | వి'దుషీ | వి'ద్వాన్సః | వి'ద్వాన్సి |
| ద్వి | వి'ద్వాన్సమ్ | ,, | ,, | ,, | వి'దుషః | ,, |
| తృ | వి'దుషా | | వి'ద్వద్భ్యామ్ | | వి'ద్వద్భిః | |
| చ | వి'దుషే | | ,, | | వి'ద్వద్భ్యః | |
| పం | వి'దుషః | | ,, | | ,, | |
| ష | , | | వి'దుషోః | | వి'దుషామ్ | |
| స | వి'దుషి | | ,, | | వి'ద్వత్సు | |
| సం | వి'ద్వన్ | | వి'ద్వాన్సౌ | | వి'ద్వాన్సః | వి'ద్వాన్సి |

(2) తస్థివాన్స్ (ఉండియున్న)

| | ఏ | | ద్వి | | బ | |
|---|---|---|---|---|---|---|
| | పుం. | నపుం. | పుం. | నపుం. | పుం. | నపుం. |
| ప్ర | తస్థివా'న్ | తస్థివ'త్ | తస్థివాన్సౌ | తస్థుషీ | తస్థివా'న్సః | తస్థివా'న్సి |
| ద్వి | తస్థివా'న్సమ్ | ,, | ,, | ,, | తస్థు'షః | ,, |
| తృ | తస్థు'షా | | తస్థివ'ద్భ్యామ్ | | తస్థివ'ద్భిః | |
| చ | తస్థు'షే | | ,, | | తస్థివ'ద్భ్యః | |
| పం | తస్థు'షః | | ,, | | ,, | |
| ష | తస్థు'షః | | తస్థు'షోః | | తస్థు'షామ్ | |
| స | తస్థు'షి | | ,, | | తస్థివ'త్సు | |
| సం | త'స్థివాన్ | త'స్థివత్ | త'స్థివాన్సౌ | త'స్థుషీ | త'స్థివాన్సః | త'స్థివాన్సి |

సూచన: అనుసర్గయగు 'వాన్స్' లోని నకారము అనుస్వారముగా మారి (సంధిప్రక్రియచే) 'వాంస్' అగును. కావున పైశబ్దములలోని నకారమును అనుస్వారముగా మార్చి వ్రాసుకొనవలయును. ప్రక్రియను స్పష్టముగా తెలుపుటకు మాత్రమే నకారము వాడబడినది.

(అ) వీని స్త్రీలింగరూపములకై దుర్బలతర రూపప్రకృతికి 'ఈ' చేర్చగా ఉషీయగును. ఇట్లు

విదుషీ; తస్థుషీ;... మొదలగునవి.

(ఆ) వీనిలోని ఉదాత్తము ఎల్లప్పుడును అనుసర్గపైననే యుండుట గమనింపదగినది.

(ఇ) వీనికి ఉదాహరణములు

విద్ — > విదా'ంస్; స్థా — > తస్థివా'ంస్: కృ — > చకృవా'ంస్;
నీ — > నినీవా'ంస్; భూ — > బభూవా'ంస్; తన్ — > తేనివా'ంస్

**4.13** (ఋ) **ఊనాధికభేదముల సూచించు విశేషణములు, వాని సుబంత ప్రక్రియ.**

(అ) వీనిలో రెండు రకములగు అనుసర్గలు కలవు. I ముఖ్యములు II గౌణములు. ముఖ్యములు ధాతువునుండి సరాసరిగా ఏర్పడునవి గౌణములు, ధాతువునుండి సరాసరి గాక, కొంచెము డొంకతిరుగుడు వ్యవహారముతో ఏర్పడునవి ఇవి ఇతర జన్యప్రకృతులనుండిగాని, సమాసపదములనుండిగాని ఏర్పడవచ్చును.

I ముఖ్యవృత్తికి చెందినవి 'ఈయస్' (లేక 'ఈయాంస్') అనునవి. ఇవి రెండు విశేష్యముల గుణములను పోల్చి, వానిలోని ఎక్కువ తక్కువలను సూచించును. (Comparative degree) రెండవది 'ఇష్ఠ' యను అనుసర్గము. ఇది రెంటికంటె నెక్కుడగు విశేష్యముల గుణములను పోల్చి, వానిలో నన్నిటికంటె ఎక్కుడు దానిని సూచించును. (Superlative). ఈ రెంటికిని ముందు వచ్చు ధాతువులోని యచ్చు (వీలున్నచో) గుణీకరణమును జెంది, దానిపై ఉదాత్తము వచ్చును (కారణము ఈ ప్రత్యయములపై ఉదాత్తముండదు). కొన్నికొన్నిచోట్ల గుణాదేశమునకు బదులు, అచ్చుయొక్క దీర్ఘీకరణముగాని, యనునాసికముగాని రావచ్చును. ఇవి ప్రాచీన వాఙ్మయమున నతి విస్తారములు. అర్వాచీన వాఙ్మయమున నివి రానురాను పల్చబడిపోయి కొన్ని మాత్రమే నిలిచినవి. కొన్నిచోట్ల నివి తమకు సంబంధములేని ఇతరపదములనుండి గూడా యుద్భవించుట కద్దు.

(అ) క్షిప్ ——> క్షే'పీయస్; క్షే'పిష్ఠ. ఇది క్షి'ప్ర' (త్వరగా) అను విశేషణమునుండి వచ్చినది.

వృ ——> వ'రీయస్; వ'రిష్ఠ. ఇది ఉరు (విశాలమైన)... ... ... ...

వృ కు అసలు అర్థము చుట్టుముట్టు.

వృధ్ ——> వ'ర్షీయస్, వ'ర్షిష్ఠ : ఇది వృద్ధ ... ... ... ... ...

ఇట్లుండగా వైయాకరణులు చెప్పునదేమనగా

యువన్ (చిన్నవయసుగల, జవాన్) లేక అ'ల్ప (కొంచెము) అను విశేషణములనుండి క'నీయస్, క'నిష్ఠ అనునవి ఏర్పడును : :

న'వ అను విశేషణమునుండి న'వీయస్, న'విష్ఠ ఏర్పడును.

ఐతే సరాసరి ధాతువునుండి గూడా జనించిన పదములు లేకపోలేదు వేదములో

ఉదా తప్ ——> త'పిష్ఠ; యజ్ ——> య'జీయస్, య'జిష్ఠ;

యుధ్ ——> యో'ధిష్ఠ; జూ ——> జ'వీయస్, జవిష్ఠ; ...

క్రియలతో సంబంధములేని పదములనుండియు ఇవి యొక్కొకసారి యుద్భవించుట కద్దు. ఉదా॥ న'వ (క్రొత్త) ——> న'వీయస్ లేక న'వ్యః; న'విష్ఠ; స'న (ముసలి) ——> స'న్యస్ (ఇవి యన్నియు ఋగ్వేదములోనివే)

(ఇ) ఇష్ఠ అను ప్రత్యయము అంతమునగల విశేషణములన్నియును, అకారాంతవిశేషణములవలెనే ప్రక్రియను బొందును.

వీని స్త్రీలింగరూపములు ఇష్ఠా (దీర్ఘీకరణము) అను ప్రత్యయముచే నేర్పడును.

(ఈ) యస్ లేక యాన్స్ అంతమునగల పుంలింగ, నపుంసకలింగ ప్రకృతులు రెండు విధములుగా నుండును. బలీయములు, బలహీనములు (వీనిలో దుర్బల దుర్బలతర భేదములేదు) బలీయప్రత్యయము 'యాన్స్'. బలహీన ప్రత్యయము 'యస్' (లేక ఈయస్, సాధారణముగా) పుం సం. ఏకవచనములో 'యన్' అగును. వీని స్త్రీలింగరూపములు దుర్బలప్రకృతులకు (పుం. నపుం ) 'ఈ' చేర్చుటచే నేర్పడును.

వీని సుబంత ప్రక్రియకు ఉదాహరణముగా శ్రేయస్ (శ్రీ + యస్) శబ్దమును; గరీయస్ శబ్దమును గ్రహింతము.

| | ఏ | | ద్వి | | బ | |
|---|---|---|---|---|---|---|
| | పుం. | నపుం. | పుం. | నపుం. | పుం. | నపుం. |
| ప్ర | శ్రే'యాన్ | శ్రే'యస్ | శ్రే'యాంసౌ (న్) | శ్రే'యసీ | శ్రేయాంసః (న్) | శ్రేయాంసి (న్) |
| ద్వి | శ్రే'యాంసమ్ (న్) | ,, | ,, | ,, | ,, | ,, |
| తృ | | శ్రే'యసా | | శ్రే'యోభ్యామ్ | | శ్రేయోభిః |
| | | - | | - | | - |
| | | - | | - | | - |

ఇష్టే

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ప్ర | గ'రీయాన్ | గ'రీయస్ | గ'రీయాంసౌ (న్) | గ'రీయసీ | గ'రీయాంసః (న్) | గ'రీయాంసి (న్) |
| ద్వి | గ'రీయాంసమ్ (న్) | ,, | ,, | ,, | ,, | ,, |
| తృ | | గ'రీయసా | | గరీయోభ్యామ్ | | గ'రీయోభిః |
| | | - | | - | | - |

(ఊ) వీని స్త్రీలింగరూపములు శ్రే'యసీ; గ'రీయసీ;...
వీని ప్రక్రియ మామూలే.

II గౌణములు.

ఈ యనుసర్గలలో గౌణజాతికిజెందినవి 'తర, 'తమ' యనునవి. ఇవి భాషయొక్క సర్వదశలయందును కనుపించును. ఇవి అన్నిరకముల విశేషణములకును సరాసరి తగిలించవచ్చును. ఇవి సర్వనామములలో కొన్నిటికిని తగిలించబడును దీనిచే ప్రకృతిలోని ఉదాత్తస్థానము మారదు. సాధారణముగా నివి దుక్కల ప్రకృతులకు తగిలించబడును. వీని స్త్రీలింగరూపములు ఆకారాంతములు. వీని సుబంతప్రక్రియ మామూలే (అకారాంత, ఆకారాంత ప్రకృతులకువలె).

(ఋ) కొన్ని ఉపసర్గలకు ఊనాధికభేదములను సూచించుటకు ర, మ అనుసర్గలు చేర్చబడును.

ఉదా॥ అ'ధర, అధమ'
అ'పర, అపమ'
అ'వర, అవమ'
ఉ'పర, ఉపమ'
అ'ంతర, అంతమ

ఇవిగాక పరమ', మధ్యమ', చరమ', అంతిమ, ఆదిమ' పశ్చిమ,...వగైరా.



# 5. సర్వనామములు వాని సుబంత ప్రక్రియ

**5.0** సర్వనామములకును, ఇతర నామవాచకములకును భేదమేమనగా ఈసర్వనామములు కొన్ని ప్రత్యేక మూలకములనుండి(సర్వనామవాచకధాతువులు) మాత్రమే ఏర్పడును. వీని సుబంతప్రక్రియయు కొంత యసాధారణముగనే యుండును. సర్వనామములను పోలిన కొన్ని విశేషణములును కలవు. వాని సుబంతప్రక్రియయు ఇందు సూచింపబడినది

సర్వనామములు ముఖ్యముగా నాలుగు విధములుగా నున్నవి. అవి 1. పురుషసర్వనామములు 2. నిర్దేశక సర్వనామములు 3. ప్రశ్నార్థక సర్వనామములు 4. సాపేక్ష సర్వనామములు.

### 1 పురుష సర్వనామములు (Personal pronouns)

**5.1** పురుష సర్వనామములలో ప్రథమ, ద్వితీయ పురుషలను సూచించునవి విచిత్రప్రక్రియను బొందును. (ఈ గ్రంథములో ఉత్తమ, మధ్యమ, ప్రథమ పురుషలనుటకు బదులు పాశ్చాత్యపద్ధతిని ప్రథమ, ద్వితీయ, తృతీయ పురుషలనియే వ్యవహరింతుము) వ్యాకరణములో ప్రథమ పురుష ప్రకృతులు 'మద్', 'అస్మద్' అనియు, ద్వితీయ పురుష ప్రకృతులు 'త్వద్', 'యుష్మద్' అనియు నిర్ణయించియున్నారు. దీనికి కారణము జనన్రకియయందును, శబ్దనిర్మాణమునందును, సమాసనిర్మాణములోను నివి బహుళముగా వాడబడుటయే గావచ్చును. ఉదా॥ మ'త్కృత, మ'త్సఖి, అస'్మత్సఖి, మ॒త్ర॑', అస్మద్దేవస్య, మా'వన్॒, అస్మత్రా', అస్మద్రుహ్; ... ...

ఇట్లే త'్వద్యోని, త'్వద్వివాచన, త'్వత్ప్రసూత, త్వద్దేవత్యే, యువద్దేవత్యే, యుష్మద్దేవత్యే, త'్వయత, తా'్వవన్॒, తా'్వదత్త॒, తా'్వహత, యుషా'్మదత్త॒, యువా'దత్త॒, యువా'నీత;...

పై ప్రయోగములన్నియును వేదమున కలవు. ఇవిగాక, తా'్వంకామ, తా'్వమాహుతి, మాంపశ'్య, మమసత'్య, అహంపూర'్వ అహముత్త॒'ర వంటి ప్రకృతులునుగలవు. ఇవిగాక వీనినుండి మదీ'య, త్వదీ'య, అస్మదీ'య, యుష'్మదీయ వంటి స్వత్వార్థక విశేషణములును ఏర్పడును.

అర్వాచీన వాఙ్మయములోని వీని రూపములు ఈ క్రింద నుదహరింపబడినవి. ప్రాచీన వాఙ్మయరూపములు వాని క్రింద కుండలీకరణములో నీయబడినవి. వీనిలోని ప్రకృతులు, ప్రత్యయములు, పొడులు స్పష్టముగాగోచరించుటకై, వానిని విడివిడిగా వ్రాయనైనది. ఉచ్చారణలో వానిని కలిపి యుచ్చరించవలయును

ఈ రెండు సర్వనామములకును లింగభేదములేదు.

(1) అహమ్ (నేను) (అస్మత్ శబ్దము)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర | అహ్-అ'మ్ | ఆవ-అ'మ్ (వా'మ్) | వయ్-అ'మ్ |
| ద్వి | మ'-ఆమ్; మా | ఆవ'-ఆమ్; నౌ | అస్'మ-ఆన్ |
| తృ | మ'-య్-ఆ | ఆవ'-ఆ-భ్యామ్ | అస్'మ-ఆ-భిః |
| చ | మ'-హ్యమ్; మే (మ'హ్యా) | ,, ; నౌ | అస్'మ-భ్యమ్ |
| పం | మ'త్ | ,, (ఆవ'ద్) | అస్'మ-ద్ |
| ష | మ'-మ; మే | ఆవ'-య్-ఓః; నౌ | అస్మా'క-మ్ |
| స | మ'-య్-ఇ (మే') | ,, | అస్'మ-అ-సు (అస్మే') |

(2) త్వమ్ (నీవు) (యుష్మత్ శబ్దము)

| | | | |
|---|---|---|---|
| ప్ర | తు-అ'మ్ | యువ-అ'మ్ | యూ-య్- అ'మ్ |
| ద్వి | తు'-ఆమ్; త్వా | యువ'-ఆమ్ | యుష్'మ-ఆన్; వః |
| తృ | తు'-అయ్-ఆ (తా'వ) | యువ'-ఆ-భ్యామ్ (యువా'-భ్యామ్) | యుష్'మ-ఆ-భిః (యుష్మా'న్) |
| చ | తు'-భ్యమ్; తే | ,, | యుష్'మ-భ్యమ్; వః |
| పం | తు'-అత్ | ,, (యువ'-ద్) | యుష్'మ-త్ |
| ష | తో'-అవ; తే | యువ'-య్-ఓః (యువో'ః) | యుష్మా'క మ్; వః |
| స | తు'-అయ్-ఇ (త్వే') | యువ'-య్-ఓః | యుష్మా'మ-అ-సు (యుష్మే) |

పై పథకములలోని ఈ క్రింది విషయములు గమనింపదగును.

(అ) (i) అస్మత్ శబ్దమునకు ప్రథమావిభక్తిలో తప్ప ఇతర విభక్తులలో, ఏకవచన ద్వివచన, బహువచన ప్రకృతులు వరుసగా మ', ఆవ', అస్మ' (షష్ఠీబహువచనములో తప్ప - ఇచ్చట ప్రకృతి అస్మా'క)

(ii) యుష్మత్ శబ్దమునకు ప్రథమావిభక్తిలో తప్ప ఇతర విభక్తులలో ఏకవచన, ద్వివచన, బహువచన ప్రకృతులు వరుసగా, తు', యువ', యుష్మ' (షష్ఠీ బహువచనములో తప్ప. ఇచ్చట ప్రకృతి యుష్మా'క)

(iii) చతుర్థీవిభక్తి మూడు వచనములయందును ప్రత్యయము 'భ్యమ్' (హ్యామ్)

(iv) పైడులను గమనించవలయును.

(ఆ) ప్రథమపురుష ఏ, ద్వి, బ; వచనములలో ఉదాత్తము వరుసగా మకార, వకార, సకారములతోనున్న అచ్చులపై వచ్చును. ఈ మూడు వ్యంజనములును ప్రథమపురుషను సూచించును. ఇట్లే ద్వితీయ పురుష, ఏ, ద్వి, బ వచనములలో ఉదాత్తము వరుసగా త, వ, స కారములపై నుండును. ఇవి మూడును. ద్వితీయ పురుషకు చిహ్నములు. రెండు పురుషలలోను వకారము ద్వివచనమునకును, సకారము బహువచనమునకును సూచకములు.

(ఇ) ద్వితీయా, చతుర్థీ, షష్ఠీ విభక్తులలో వచ్చు రెండవరూపములు ఉదాత్తరహితములు. కావున వీనిని వాక్యమునకుగాని, పాదమునకుగాని మొదట యుపయోగించరాదు. ఐతే వీనికి విశేషణములుగా వీని వెన్నంటివచ్చు పదములపై ఉదాత్తము ఉండవచ్చును.

ఉదా॥ తేజ'యతః; వోవృతా'భ్యః; నక్త్రిభ్'యః; ...

(ఈ) పైవానిలోని ప్రత్యయములు గమనార్హములు వీనికిని నామవాచకముల సుబంతప్రక్రియలో వచ్చు ప్రత్యయములకును ఉన్న భేదమును ముఖ్యముగా గమనింపదగినది

## 2. నిర్దేశక సర్వనామములు

**5.2** వీని ప్రకృతులలో నన్నిటికంటె సులభమైనది 'త'. ఇది తృతీయ పురుషకు సంబంధించిన సర్వనామముగా గూడ వాడబడుచున్నది దీనిలో లింగ భేదములుకలవు. అనేక సర్వనామములు దీనివలెనే ప్రక్రియను బొందును, గావున దీని ప్రక్రియను సాధారణ సర్వనామ ప్రక్రియ యనవచ్చును. దీని ప్రథమా విభక్తి పుంలింగ, స్త్రీలింగరూపములు వరుసగా 'స'ః', సా' (త'ః, తా' కు బదులుగా) దీని సుబంత ప్రక్రియ నీ క్రింద పొందుపరచనైనది.

| | ఏ | | | ద్వి | | | బ | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | పుం. | నపుం. | స్త్రీ. | పుం. | నపుం | స్త్రీ. | పుం. | నపుం. | స్త్రీ. |
| ప్ర | స'ః | త'త్ | సా' | తా' | తే' | తే' | తే' | తా'ని | తా'ః |
| ద్వి | త'మ్ | ,, | తా'మ్ | ,, | ,, | ,, | తా'న్ | ,, | తా'ః |
| తృ | | తే'న | త'యా | తా'భ్యామ్ | తా'భ్యామ్ | | | తై'ః | తా'భిః |
| చ | | త'స్మై | త'స్యై | | ,, | ,, | | తే'భ్యః | తా'భ్యః |
| పం | | త'స్మాత్ | త'స్యాః | | ,, | ,, | | ,, | ,, |
| ష | | త'స్య | త'స్యాః | త'యోః | త'యోః | | | తే'షామ్ | తా'సామ్ |
| స | | త'స్మిన్ | త'స్యామ్ | | ,, | ,, | | తే'షు | తా'సు |

(అ) ఈ సర్వనామముయొక్క ప్రకృతి 'తద్' గా పేర్కొనబడినది. ఈ ప్రకృతి నుండియే తదీయ, తత్త్వ, తద్వ'త్, తన్మయ, తచ్ఛీల, తజ్ఞా, తత్కర, తదనంతర, తన్మాత్ర, త'దన్న, తద్వ'ద్, తద్వ'శ మొదలగునవి గాక త'తః; తత్ర; త'థా, త'దా, తా'వన్త్, త'తి మొదలగు క్రియావిశేషణములు (adverbs) ఉద్భవించినవి.

(ఆ) వేదములో, పైజెప్పబడిన 'తత్' గాక 'త్య' (అది, ఆ) అను ప్రకృతియు వాడబడుచున్నది. ఇది చాలా వరకు విశేషణముగనే ఉపయోగపడుచుండును. దీని సుబంతప్రక్రియయు కొంతవరకు తత్ శబ్దప్రక్రియవలెనే యుండును. ఐతే ఈ రూపములన్నియు అర్వాచీనవాఙ్మయమున ఉత్పన్నమైనవి.

(ఇ) ఇంకొక ప్రకృతి 'ఏతత్' (ఇది, ఇచ్చటిది) ఇది ప్రాచీన వాఙ్మయమునను, అర్వాచీన వాఙ్మయమునను బహుళముగా గన్పట్టును. దీని ప్రక్రియయు మామూలుగా తచ్ఛబ్దమునకువలెనే. ఏషః, ఏషా', ఏతత్;... ...

(ఈ) ఇంకొక సర్వనామ ప్రకృతి 'ఏన'. ఇది అసమగ్రము. దీనిపై యుదాత్తముండదు. ఇది, ద్వితీయావిభక్తి మూడు వచనములలోను, తృతీయా ఏకవచనమునను, షష్ఠీ, సప్తమీ ద్వివచనములలోను మాత్రము కన్పించును. దీని స్వరూప మీ క్రింది పథకమున నీయబడినది.

| | | పుం. | న. పుం. | స్త్రీ |
|---|---|---|---|---|
| ఏకవచనము | ద్వి. | ఏనమ్ | ఏనత్ | ఏనామ్ |
| | తృ. | ఏనేన | | ఏనయా |
| ద్వివచనము | ద్వి | ఏనౌ | ఏనే | ఏనే |
| | ష, స | ఏనయోః | | ఏనయోః |
| బహువచనము | ద్వి | ఏనాన్ | ఏనాని | ఏనాః |

(ఉ) పై జెప్పిన నిర్దేశక సర్వనామములు గాక మరి రెండు నిర్దేశక సర్వనామములును కలవు ఇవి అయమ్ (ఇది, అది) మరియు 'అసౌ' (అల్లది) వీని ప్రక్రియలు చాలా క్రమరహితముగా నుండుటచే పూర్తిగా పొందుపరచ వలసినదే.

అయమ్ (ఇది, అది)

| | ఏ | | | ద్వి | | | బ | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | పుం. | నపుం. | స్త్రీ. | పుం. | నపుం. | స్త్రీ. | పుం. | నపుం. | స్త్రీ. |
| ప్ర | అయ'మ్ | ఇద'మ్ | ఇయ'మ్ | ఇమౌ' | ఇమే' | ఇమే' | ఇమే' | ఇమా'ని | ఇమా'ః |
| ద్వి | ఇమ'మ్ | ,, | ఇమా'మ్ | ,, | ,, | ,, | ఇమా'న్ | ,, | ,, |
| తృ | అనే'న | | అన'యా | ఆభ్యా'మ్ | | ఆభ్యా'మ్ | ఏభి'ః | | ఆభి'ః |
| చ | అస్మై' | | అస్యై' | ,, | | ,, | ఏభ్యః | | ఆభ్యః |
| పం | అస్మా'త్ | | అస్యాః | ,, | | ,, | ,, | | ,, |
| ష | అస్య' | | ,, | అన'యోః | | అన'యోః | ఏషా'మ్ | | ఆసామ్ |
| స | అస్మి'న్ | | అస్యా'మ్ | ,, | | ,, | ఏషు' | | ఆసు |

అసౌ (అల్లది)

| | ఏ | | | ద్వి | | | బ | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | పుం. | నపుం' | స్త్రీ. | పుం | నపుం. | స్త్రీ. | పుం. | నపుం. | స్త్రీ. |
| ప్ర | అసౌ' | అద'ః | అసౌ' | అమూ' | అమూ' | అమూ' | అమీ' | అమూని' | అమూ'ః |
| ద్వి | అము'మ్ | ,, | అమూ'మ్ | ,, | ,, | ,, | అమూన్ | ,, | అమూ'ః |
| తృ | అమూ'నా | | అము'యా | | అమూ'భ్యామ్ | | అమీ'భిః | | అమూ'భిః |
| చ | అము'ష్మై | | అము'ష్యై | | ,, | | అమీ'భ్యః | | అమూ'భ్యః |
| పం | అము'ష్మాత్ | | అము'ష్యాః | | ,, | | ,, | | ,, |
| ష | అము'ష్య | | ,, | | అము'యోః | | అమీ'షామ్ | | అమూ'షామ్ |
| స | అము'ష్మిషాన్ | | అముష్యామ్ | | ,, | | అమీ'షు | | అమూ'షు |

(ఊ) పైవానిలోని అయమ్ శబ్దము పలువిధములగు ప్రకృతులచే నేర్పడిన యతుకుల బొంత యని స్పష్టము. వీనిలో ముఖ్యప్రకృతి అస్ రెండవ దాని ముఖ్య ప్రకృతి. అమూ.

## 3. ప్రశ్నార్థక సర్వనామములు

**5.3** ప్రశ్నార్థక సర్వనామములకు మూలము 'క' దీని పుంలింగ రూపము 'కః', నపుంసకలింగరూపము 'కిమ్', స్త్రీలింగరూపము 'కా'. ఏకవచనమున

| | పుం. | నపు. | స్త్రీ |
|---|---|---|---|
| ప్ర | క'ః | కి'మ్ | కా' |
| ద్వి | కమ్ | కిమ్ | కామ్ |

దీని మిగిలిన ప్రక్రియ తచ్ఛబ్దమువలెనే యుండును. వేదములో మామూలుగా కా'ః, కై'ః రూపములకు బదులు కా', కే'భిః అను రూపములు వచ్చును.

## 4. సాపేక్ష లేక సంబంధ సర్వనామములు

**5.4** ఈ సర్వనామముయొక్క మూలము 'య' దీని ప్రక్రియయు, సాధారణముగా ఇతర సర్వనామముల ప్రక్రియ కనుగుణముగా నుండి సక్రమముగా నడచును.

| | పుం | | | స్త్రీ | | |
|---|---|---|---|---|---|---|
| ప్ర | య'ః | యా' | యే' | యా' | యే' | యా'ః |
| ద్వి | య'మ్ | ,, | యాన్ | యా'మ్ | ,, | ,, |
| తృ | యేన | యా'భ్యామ్ | యై'ః | య'యా | యా'భ్యా'మ్ | యా'భిః |
| చ | య'స్మై | ,, | యే'భ్యః | యస్యై | ,, | యాభ్యః |
| పం | య'స్మాత్ | ,, | ,, | యస్యాః | ,, | ,, |
| ష | యస్య | యయోః | యేషామ్ | ,, | యయోః | యాసామ్ |
| సం | యస్మిన్ | ,, | యే'షు | య'స్యామ్ | ,, | యాసు |

నపుంసకలింగములో

| | | | |
|---|---|---|---|
| ప్ర | యత్ | యే | యాని |
| ద్వి | ,, | ,, | ,, |

ఇతరములు పుంలింగ రూపములే

(అ) 'యత్' సర్వనామరూపము వాఙ్మయములో ప్రాచీనకాలమునుండి కలదు. అది రానురాను ఎక్కువయై అనేక పదములకు జనక స్థానము వహించును. ఇట్లు వేదములో య'త్కామ, య'త్కారిన్, యద్దేవత్య మొదలగు పదములేగాక య'తః, య'తి, య'త్ర, య'థా, య'దా, య'ది, యా'వన్త్, యతర'. యతమ'... మొదలగు పదజాలమునకు దారితీయును.

## 5.5 ఇతర సర్వనామములు.

(అ) సమ, సిమ (ప్రతిది, every one) అను రెండు సర్వనామములు ఋగ్వేదమున మాత్రము కన్పించును.

(ఆ) స్వయమ్ (స్వ అను మూలకమునుండి) అను సర్వనామమునకు ప్రక్రియలేదు.

(ఇ) కొన్ని నామవాచకములు సర్వనామములుగా వాడబడుచున్నవి. ఇట్టి వానిలో ముఖ్యమైనవి ఆత'్మన్; తనూ';

(ఈ) భవన్త్ అను అసమాపకక్రియావిశేషణము "మీరు, తమరు" అను అర్థములో ద్వితీయ పురుష సర్వనామముగా వాడబడుచున్నది.

## 5 6 సర్వనామజన్యములు.

సర్వనామ ప్రకృతులనుండియు, కొన్ని నామవాచక ప్రకృతులనుండియు, విశేషణార్థములుగల ప్రత్యయములను జేర్చినచో సర్వనామవిశేషణములుగా (Pronominal adjectives) తయారగును. ఇట్టివి.

(అ) 'మద్' మొదలగువానినుండి మదీయ, అస్మదీయ, త్వదీయ, యుష్మదీయ తదీయ, ఏతదీయ, అస్మాకమ్, యుష్మాకమ్ ... మొదలగునవి యుద్భవించినవి.

(ఆ) సర్వనామధాతువుల యంతమున నున్న అచ్చులను దీర్ఘీకరించి, 'వన్త్' అను అనుసర్గను చేర్చుటచే మా'వన్త్, త్వా'వన్త్, యుష్మా'వన్త్, యువా'వన్త్, తావన్త్, ఏతా'వన్త్, యా'వన్త్ మొదలగునవి యుద్భవించును. వీనిలో చివరి మూడు మాత్రము అర్వాచీన వాఙ్మయమున కనుపించును. ఇవి 'వన్త్' అంతమునగల ఇతర విశేషణముల వలెనే ప్రక్రియను బొందును.

(ఇ) ఈవిధముగా నేర్పడినవి - మాదృశ్, త్వాదృశ్, యుష్మాదృశ్, ఏతాదృశ్, యాదృశ్, ఈదృశ్, తాదృశ్;...

(ఈ) తా, కా, యా అను సర్వనామ మూలములనుండి త'తి, క'తి య'తి మొదలగునవి వచ్చును.

(ఉ) యా, కా నుండి యతర, యతమ, కతర, కతమ, ... ఏర్పడును.



# 6. క్రియా పరిచ్ఛేదము

## సామాన్య విషయములు

**6.1** సంస్కృత భాషలోని ధాతువులు (క్రియలు) స్థూలముగా రెండు విధములు. (1) పరస్మైపదులు. (2) ఆత్మనేపదులు. ధాతువులలో నూటికి 85 వంతులు పరస్మైపదులే. క్రియయొక్క ఫలము కర్తనుగాని, ఇతరులనుగాని చెందునపుడు పరస్మైపదమనియు, క్రియయొక్క ఫలము కర్తకుమాత్రమే చెందునపుడు ఆత్మనే పదమనియూ సాధారణముగా చెప్పవచ్చును. వీనిని ఇంగ్లీషున Transitive మరియు Reflexive అనవచ్చునేమో॥ ఈ విభాగము తెలుగులో గూడ నున్నది. ఉదా॥ వండు, వండుకొను; తెలియు, తెలిసికొను; నడచు, నడచుకొను;... 'కొను' ప్రత్యయము చేరినవన్నియు ఆత్మనేపదములే. ఐతే, ఈవిధముగా అర్థమునుబట్టి పదనిర్ణయము చేయుట ప్రాచీనకాలమున నుండెనో, ఏమో. కాని రానురాను అది ఉత్పన్నమై అర్థము ననుసరించిగాక, కేవలము పదస్వరూపమునుబట్టియే (అనగా వ్యాకరణ ప్రక్రియచేతనే) అది నిర్ణయింపబడుచున్నది. కొన్ని ధాతువులు కేవలము పరస్మైపదములకు సంబంధించిన ప్రత్యయములనే పొందును. మరి కొన్ని కేవల మాత్మనే పదములకు సంబంధించిన ప్రత్యయములనే పొందును కొన్నింటి విషయమున ఏ ప్రత్యయములనైనను వాడవచ్చును. ఇట్టివి ఉభయపదు లందురు. ఒక్కొకసారి ధాతువునకు ఉపసర్గను చేర్చినచో దాని పదము గూడా మారును.

ఆత్మనే పద ప్రత్యయములు కర్మణి ప్రయోగమున (Passive voice) గూడ నుపయోగింతురు. వర్తమానకాలమున కర్మణి ప్రయోగమునకు ప్రత్యేక ప్రకృతులు గలవు. ఇతరకాలములలో నీ కర్మణి ప్రయోగములు చాలా చాలా అరుదు (లేవనియే చెప్పవచ్చును ధాతు - అద్యతన భూతకాలములో 3వ పురుష ఏకవచనమునతప్ప)

**6.2** సంస్కృతములోని క్రియాపదములకు నాలుగు కాలములును, ప్రతి కాలమునకు ఆరు భావార్థకములును ఉండును. అవి.

(1) వర్తమానకాలము (Present tense)
(2) పరోక్ష భూతకాలము (Perfect tense)
(3) భవిష్యత్కాలము (Future tense)
(4) అద్యతనభూతకాలము (Aorist tense)

పైవానిలోని ప్రతికాలమునకును సంబంధించిన ఆరు భావార్థకములు.

(1) సూచకార్థకము (Indicative mode)
(2) నిర్బంధార్థకము (Subjunctive mode)
(3) విధ్యర్థకము (Optative mode)
(4) ఆజ్ఞార్థకము (Imperative mode)
(5) ఆశీరర్థకము (Precative mode)
(6) అపరోక్షభూతార్థకము (Imperfect లేక Preterit)

వీనిలో అపరోక్ష భూతార్థకము వర్తమానకాలమునకే విరివిగా వచ్చును. పరోక్షభూతమునకు (వేదమునతప్ప) అపరోక్షభూతార్థకము లేదు. ఇట్లే అద్యతన భూతకాలమునకును (వేదముననేతప్ప) అపరోక్షభూతార్థకములులేవు. ఇక భవిష్యత్కాలమునకు ఉన్నది. కాని, ప్రాచీనార్వాచీనవాఙ్మయములలో నిది చాలా యరుదుగా వచ్చును (ఇంత యరుదుగా వచ్చునది మరి యేప్రక్రియయులేదు). అందుచే నీ యపరోక్షభూతార్థకమును. వర్తమానకాల క్రియాప్రక్రియలో నంత భాగముగ చేర్చవచ్చును. ఇట్లే ఆశీరర్థక ప్రకృతులు సోష్మ-అద్యతన భూత కాల ప్రకృతులచేతనే ఏర్పడుచున్నవి గావున దానిని అద్యతభూతకాల క్రియా ప్రక్రియలో జేర్చవచ్చును.

అపరోక్షభూతము, పరోక్షభూతము, అద్యతన భూతము — వీనిలోని భేదములు వ్యాకరణ ప్రక్రియలచే నేర్పడినవేగాని అర్థములో మాత్రము అన్నియును భూతకాలమునే సూచించును. ఇట్లు భిన్నముగా గుర్తింపబడుటకు కారణము, ఈ భాషాకుటుంబమునకు చెందిన యన్నిభాషలలోను (గ్రీకు, లాటిన్ మొదలగు నవి) భూతకాలము ఈవిధముగా మూడు భిన్నప్రక్రియలచే నేర్పడి, అవి యన్నియు విడిగా గుర్తింపబడి యుండుటయే. అద్యతన భూతకాలమును సూచించు ప్రకృతులు ఏడు విధములుగా నేర్పడును (వీని వ్యాప్తి ప్రాచీన వాఙ్మ

యముననేగాని అర్వాచీన వాఙ్మయమున తక్కు(వ) భవిష్యత్కాలము రెండు విధములుగా నేర్పడును. దీనికి సంబంధించిన యపరోక్షభూతార్థకమును కలదు

కావున పైజెప్పబడిన కాల, భావార్థకములను ఈ క్రింది విధమున తిరిగి వర్గీకరించవచ్చును.

I వర్తమానకాలము : దీనిలో దీనికి సంబంధించిన భావార్థకములు, అపరోక్షభూతార్థకము, దీనికి సంబంధించిన యసమాపకక్రియయు చేరును.

II పరోక్షభూతకాలము : దీనిలో దీనికి సంబంధించు అసమాపక క్రియయు చేరును. (దీని భావార్థకములు, అపరోక్షభూతార్థకము వేదవాఙ్మయముననే కలవు. ఇవి అర్వాచీన వాఙ్మయమున లేవు.)

III భవిష్యత్కాలము : దీనిలో ప్రాత అనగా ఊష్మవ్యంజనముచే నేర్పడు భవిష్యత్తు, దానికి సంబంధించిన యపరోక్షభూతార్థకము (క్రియాతిపత్తి) గాక అసమాపక క్రియయు చేరును. రెండవ రకపు భవిష్యత్తు, సహాయకక్రియా భవిష్యత్తు లేక సమాస పదభవిష్యత్తును దీనియందే చేరును. (Periphrastic Future)

IV అద్యతన భూతకాలము : దీనిలో మామూలు అద్యతనము, పునర్ద్విత్వప్రకృతులతో నేర్పడు అద్యతన భూతము, ఊష్మవ్యంజనములతో నేర్పడు అద్యతన భూతకాలమును చేరును. ఇవిగాక ఆశీరర్థకమును ఈ ప్రక్రియకు చెందినదే. (వేదములోనే వీనికి సంబంధించిన భావార్థకములు, అసమాపక క్రియయు కలవు గాని అర్వాచీనవాఙ్మయమున నివి లేవు).

**6.3** సంస్కృతభాషలోని క్రియాపదములకు, నామవాచకములకున్న మూడు వచనములు; ఏకవచనము, ద్వివచనము, బహువచనములు కలవు. ప్రతి వచనమునను ప్రథమ, ద్వితీయ, తృతీయ పురుష లను మూడు పురుషలు కలవు. ఇవి యన్నియు, ప్రతిపదమునకును, (పరస్మైపదము, ఆత్మనేపదము) గాక, ప్రతికాలమునకును, ప్రతి భావార్థకమునకును ఉండును.

**6.4** పై జెప్పబడిన క్రియాప్రక్రియగాక ప్రతి ధాతువునుండియు జనించిన కొన్ని ఇతరపదములునుగలవు ఇవి (1) అసమాపకక్రియలు (Participls) (2) (క్రియాజన్య విశేష్యవిభక్తులు తుమున్ ప్రత్యయాంతములు మొ॥ Infinitives) (3) సమాపకక్రియలు (Gerundives) ను కలవు. వీనిలో రెండవరకమునకు

జెందినవి వేదమున పలురకములు గలవు అర్వాచీనవాఙ్మయమున నవి యన్ని యును పోయి, నామ వాచకములకు చెందిన ద్వితీయావిభక్తికి సంబంధించిన 'తుమున్' ప్రత్యయాంత మొక్కటి మాత్రము మిగిలినది. వీని నన్నిటిని ప్రత్యేక ప్రకరణమున వివరింపవలసి యుండును.

**6.5** పైజెప్పబడిన కాల, భావార్థకములను సూచించుటకు ఏర్పడిన ప్రక్రియను ముఖ్యప్రక్రియయందురు. ఇదిగాక మరొక రకమగు ప్రక్రియయుగలదు. దానిని గౌణప్రక్రియ యందురు (Secondary Conjugation) ఈ గౌణ ప్రక్రియ ఈక్రింది రూపములు సాధించుటకు ఉపయోగించును (1) కర్మణ్యర్థకములు (2) సమభిహారార్థకములు (Intensives) (3) ఇచ్ఛార్థకములు (Desideratives) (4) ప్రేరణార్థకములు (Causatives). వీనిలో ధాతువును యథాతథముగా గాక కొంత సంస్కారముచే ప్రకృతిగా తయారుజేయుదురు ఐతే పరిశీలి పగా ఇదియు వర్తమానకాలమునకు చెందిన క్రియాప్రక్రియయే— కొలదిమార్పులతో పైన జెప్పబడినవిగాక కొన్ని ఇతర ప్రక్రియలును కలవు. నామధాతుకరణము (నామవాచక ప్రకృతులను, విశేషణవాచక ప్రకృతులను క్రియార్థక ప్రకృతులుగా మార్చుట) వీని నన్నిటిని గూడ ప్రత్యేకప్రకరణమున వివరింపవలసియుండును.

## పురుష ప్రత్యయములు (Personal endings)

**6.6** సంస్కృతవాక్యములలోని క్రియలయొక్క పద, పురుష, వచనములు వానితో గలిసియున్న పురుషప్రత్యయములచేతనే తెలియనగును. ఆ క్రియ యొక్క కాలము, భావములుగూడ కొంతవరకు వీనిచేతనే విశదమగును. ఐతే కాల భావభేదములు ఆధాతువుయొక్క కాలప్రకృతి (Tense stem) చేతను. లేక భావప్రకృతి (Mode stem) చేతను గూడ తెలియనగును. ఈ పురుష ప్రత్యయములు కాల, భావ ప్రకృతులకు చేర్చబడియుండును.

అర్వాచీన వాఙ్మయములో వచ్చు పురుషప్రత్యయములు ఈ క్రింది పథకమున నీయబడినవి

అ. ముఖ్యప్రత్యయములు (Primary endings)

| | పరస్మైపదము | | | ఆత్మనేపదము | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | మి | వ’స్ | మ’స్ | ఏ’ | వ’హే | మ’హే |
| 2 | సి | థ’స్ | థ’ | సే’ | ఆ’థే<br>ఇ’థే | ధ్వే’ |
| 3 | తి | త’స్ | అ’ంతి,అ’తి | తే’ | ఆ’తే<br>ఇ’తే | అ’ంతే,అ’తే |

స్వీకరించవు. వీనితో కలిసిన ప్రకృతులపైనుండు ఉదాత్తస్వరస్థానము మారదు. దుర్బల ప్రత్యయములతో కలిసిన ప్రకృతిపైనుండు ఉదాత్తస్థానము మారి ప్రత్యయముపైకి చేరును (దీనికి అపవాదము అకారాంత ప్రకృతులు. అకారాంత ప్రకృతులలోని ఉదాత్తస్థానము ఏ ప్రత్యయము చేరినను మారదు. ఇది వీని సామాన్య ధర్మము) బలీయ ప్రత్యయములతో చేరు ప్రకృతులను బలీయ ప్రకృతులనియు, దుర్బల ప్రత్యయములతో చేరు ప్రకృతులను దుర్బల ప్రకృతు లనియు వ్యవహరించ వచ్చును.

(అ) పైపట్టికలోని అ ముఖ్యప్రత్యయములు వర్తమానకాల సూచకార్థ మును, భవిష్యత్కాలమును సూచించుటకును, (కొంతవరకు నిర్బంధార్థకము నను) ఉపయోగింపబడును. (ఆ) గౌణప్రత్యయములు, అపరోక్షభూతార్థకము, క్రియాతిపత్తి, అద్యతనభూతకాల ప్రక్రియకు, ఆశీరర్థకమునను, కొంతవరకు నిర్బంధార్థకమునను, గౌణప్రక్రియ యందును వాడబడును

(ఇ) ఆత్మనేపద ప్రత్యయములలోని ద్వితీయా తృతీయా ద్వివచనముల లోని ప్రథమాక్షరమగు ఆకారము, అకారాంత ప్రకృతుల యంతమగు అకారముతో గలిసి ఇకారమగును.

**6.7** పై ప్రత్యయములచే భావార్థక ప్రత్యయములను ఈ క్రింది విధమున నేర్పరచుదురు

## I నిర్బంధార్థకము (Subjunctive mode)

ఇది వేదముననే కన్పించును. రానురాను ఇది భాషలో కనుపించకుండా పోవును. దీని ప్రథమపురుష ప్రత్యయములు మాత్రము (ఉభయపదములలో) మిగిలి, ఆజ్ఞార్థక ప్రత్యయములై నిలచినవి వేదములోని నిర్బంధార్థక ప్రత్య యము లన్నియును బలీయములే. వానిపై ఉదాత్తముండదు. దానికి సూచకము గనే అర్వాచీనవాఙ్మయములోని ప్రథమ పురుష, ఆజ్ఞార్థక ప్రత్యయములకుగూడా ఉదాత్తముండదు. వీని ప్రకృతులు ఈక్రిందివిధముగా నేర్పడును.

ఈ భావార్థకమునకు గుర్తు 'అ' అనుపొడి. ఈ పొడిచేత ప్రకృతిని, ప్రత్యయమును అతుకుదురు. దీనిలో ఉదాత్తము ప్రకృతి పైనుండునుగాన దాని బలీయరూపమునే స్వీకరించవలయును.

(బలీయరూపములో గుణాదేశముగాని, నుగాగమముగాని, అచ్చుయొక్క దీర్ఘీకరణముగాని, ఇతరములుగాని వచ్చును) ఈ పొడి, ప్రత్యయమునకు మొదటనున్న అకారముతో కలిసి 'ఆ' యగును. దీని ప్రత్యయములు కొన్ని ముఖ్యప్రత్యయములనుండియు, కొన్ని గౌణప్రత్యయములనుండియు గ్రహింప బడినవి వీని నీ క్రింద పొందుపరచితిమి

| | పరస్మైపదము | | | ఆత్మనేపదము | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | ఆని | ఆవ | ఆమ | ఐ | ఆవహై | ఆమహై |
| 2 | అసి, అస్ | అథస్ | అథ | అసే, ఆసై | ఐథే | అధ్వే, ఆధ్వై |
| 3 | అతి, అత్ | అతస్ | అన్ | అతే, ఆతై | ఐతే | అంతే, అంత, ఆంతై |

## 11 విధ్యర్థకము

(అ) ఇది వేదములో బహు స్వల్పముగా కన్పించును. బ్రాహ్మణములలో నిది నిర్బంధార్థకము కంటె విరివిగా వ్యాపించినది. తరువాత వాఙ్మయములో బహుళ వ్యాప్తిని బొందినది. విధ్యర్థకముయొక్క గుర్తు పొడి, పరస్మైపద ప్రకృతులకు రెండు విధములుగా నుండును. (1) అకారాంత ప్రకృతులకు ఈకారము దీనిపై ఉదాత్తము ఉండదు. కావున వీనితో చేరిన ప్రకృతులపైననే యుదాత్తముండును. (అకారాంత ప్రకృతులపై నున్న యుదాత్త స్థానము మారకుండుట వాని సామాన్యధర్మము) ఈ పొడి యగు ఈకారము ప్రకృత్యంతమగు అకారముతో గలిసి ఏకారముగా మారును ఈ ఏకారము అజాది ప్రత్యయములకు ముందు (అమ్, ఉస్) వచ్చినచో సంధి ప్రక్రియప్రకారము మామూలుగా యడాగమము వచ్చును (2) అకారాంతములుగాని ఇతర ప్రకృతులకు పొడి 'యా' దీనిపై ఉదాత్తముండును. కాన నిది దుర్బల ప్రకృతులతోడనేచేరును.

ఇక ఆత్మనేపదప్రకృతుల కన్నిటికిని పొడి. ఈకారము. ఇది ప్రకృత్యంతముననున్న అకారముతో కలిసి మామూలుగా ఏకారముగా మారును.

విధ్యర్థక ప్రత్యయము లీ క్రింద పొందుపరచబడినవి.

(1) అకారాంత ప్రకృతులకు

| | పరస్మైపదము | | | ఆత్మనేపదము | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | ఏయమ్ | ఏవ | ఏమ | ఏయ | ఏవహి | ఏమహి |
| 2 | ఏస్ | ఏతమ్ | ఏత | ఏథాస్ | ఏయాథామ్ | ఏధ్వమ్ |
| 3 | ఏత్ | ఏతామ్ | ఏయుః | ఏత | ఏయాతామ్ | ఏరన్ |

(2) ఇతర ప్రకృతులకు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | యా'మ్ | యా'వ | యా'మ | ఈయ' | ఈవ'హి | ఈమ'హి |
| 2 | యా'స్ | యా'తమ్ | యా'త | ఈథా'స్ | ఈయా'థామ్ | ఈధ్'వమ్ |
| 3 | యా'త్ | యా'తామ్ | యు'ః | ఈత' | ఈయా'తామ్ | ఈర'న్ |

సూచన: పరస్మైపదముల 3వ బహువచనములో యుస్ వచ్చును (అన్‌కాదు) ఆత్మనే పదమున... రన్...

## ఆశీరర్థకములు

(ఇ) విధ్యర్థకసూచకమునప్రకృతికిని ప్రత్యయమునకును నడుమ సకారము జొనిపినచో ఆశీరర్థకప్రత్యయము లేర్పడును. ఐతే కొన్ని ప్రత్యయములలో ని సకారము లోపించుటచే నవి విధ్యర్థక ప్రత్యయములో, ఆశీరర్థక ప్రత్యయములో చెప్పుటకు వీలుపడదు. అట్టి వానిని ఈ క్రింద కుండలీకరణములలో చూపనైనది.

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | యా'సమ్ | యా'స్వ | యా'స్మ | [ఈయ'] | [ఈవ'హి] | [ఈమ'హి] |
| 2 | [యా'స్] | యా'స్తమ్ | యా'స్త | ఈష్ఠా'ః | ఈయా'స్థామ్ | ఈఢ్'వమ్ |
| 3 | [యాత్] | యా'స్తామ్ | యా'సుః | ఈష్ట' | ఈయా'స్తామ్ | [ఈర'న్] |

## ఆజ్ఞార్థకము

(ఈ) ఆజ్ఞార్థకమునకు గుర్తుగా పొడి యేదియు లేదు. వీని ప్రత్యయములు నేరుగా ప్రకృతులకు తగిలించబడును. ఇట్లే సూచకార్థకమునను ప్రత్య

యములను నేరుగా ప్రకృతుల కతికించుదురు.

'తాత్' ప్రత్యయాంతము ఆజ్ఞార్థకము.

వర్తమానకాల ప్రకృతికి 'తాత్' అను ప్రత్యయము కలుపుటచే, ముఖ్యముగా ద్వితీయపురుష ఏకవచనమునకు—కొన్నికొన్నిసార్లు ఇతరపురుష, వచనముల కును— ఆజ్ఞార్థక మేర్పడును. ఉదా॥ బ్రూతాత్, హతాత్, పిప్రతాత్, జహీతాత్, ధత్తాత్, కృణుతాత్, గృహ్ణీతా'త్, అ'వతాత్, ర'క్షతాత్, వసతాత్, విశతాత్, అస్యతాత్, నశ్యతాత్, క్రియతాత్,...

వేదమునను, బ్రాహ్మణముల యందును దీని ప్రయోగములను గమనించి చూడగా, ఇది భవిష్యత్కాలమున జరుపబడు కార్యమునకై వర్తమానమున నొసగబడు ఆజ్ఞార్థకముగా గోచరించును భవిష్యత్కాలమున జరుపబడు కార్యములకై యొసగబడు ఆజ్ఞార్థకములకై సంస్కృతమున ప్రత్యేకప్రత్యయములు ఒకప్పుడుండినను, ఇప్పుడవి యా యర్థమున ప్రయోగింపబడుటలేదు.

ఉదా॥ ఇహైవ' మా తి'ష్ఠన్తమ్ అభ్యే' హీ'తి బ్రూహి తా'మ్
తు నా ఆ'గతామ్ ప్రతిప్ర'బ్రూతాత్
అవ్యుషా'మ్ జాగ్రతా దహ'మ్
భవాన్ ప్రసాదమ్ కురుతాత్
... . . ... ...

## పరిశిష్ట విషయములు

## 6.8 అసమాపక క్రియలు (participles)

అన్ని క్రియాప్రకృతులచేతను, ఉభయ పదములలోను అసమాపకక్రియ లేర్పడును. ఐతే అద్యతన భూతకాల క్రియాప్రకృతులచే నేర్పడు అసమాపక క్రియలు చాలా అరుదు. ఇట్లే క్రియాతిపత్తి రూపప్రకృతులకును అసమాపక క్రియలు లేవు. సాధారణముగా అసమాపకక్రియా ప్రత్యయములు — పరస్మైపదమున అన్త్ (దీని దుర్బల రూపము అత్; స్త్రీలింగరూపము అన్తీ లేక అతి); ఆత్మనేపదములలో ఆన (స్త్రీలింగరూపము ఆనా). ఐతే

(అ) ఆకారాంత ప్రకృతులకు పరస్మైపద రూపములలోని చివరి అకారము లోపించి 'న్త్' అగును. ఆత్మనే పదరూపములలో 'ఆన'కు బదులుగా మాన' వచ్చుట కలదు.

(అ) పరోక్షభూతకాలముయొక్క అసమాపక క్రియాప్రత్యయము పరస్మైపదిలో వాన్స్ అగును (దీని దుర్బలరూపము వత్; దుర్బలతర రూపము ఉష్ (చూ. 4.12) ఆత్మనే పదిలో ఆన'

## ఉపచయము (Augment)

**6.9** క్రియాప్రకృతులకు ప్రసర్గగా చేర్చబడిన అకారమును ఉపచయమందురు, ప్రకృతి అజాదిమైనచో నిది దీని మొదట నున్న యచ్చుతో చేరి వృద్ధియగును (గుణమునకు బదుల) ఇది కలిసిన క్రియాపదములలోనెల్ల ఉదాత్తము దీనిపైననే యుండును. (దీనికి అపవాదము లేదు) వేదములోని కొన్ని రూపములలోని యుపచయము ఆకారముగనుండును. ఉదా॥ ఆ'నట్, ఆ'వర్, ఆ'వృణి, ఆ'వృణక్. ఆ'విధ్యత్, ఆ'యునక్, ఆ'యుక్త, ఆ'యుక్షాతామ్, ఆ'రిణక్,...

(ఆ) ఉపచయము భూతకాల సూచకము. అన్ని కాలములకును సంబంధించిన ప్రకృతులకు ఈ యుపచయమును చేర్చి తత్తత్కాలములకు సంబంధించిన భూతార్థసూచకములగు ప్రకృతుల నేర్పరచవచ్చును వర్తమాన కాలమునకు సంబంధించి యపరోక్షభూతమును; పరోక్షభూతమునకు సంబంధించిన యపరోక్షభూతమను [(Pluperfect) ఇది వేదముననే కలదు]; భవిష్యత్కాలమునకు సంబంధించి క్రియాతిపత్తియు నేర్పడును, అద్యతన భూతకాలమునకు సంబంధించియు. అపరోక్షభూతార్థక క్రియ ఏర్పడును గాని దీని కనురూపమగు వర్తమానసూచకార్థము ఉండదు.

(ఇ) వేదవాఙ్మయములో, ముఖ్యముగా ఋగ్వేదమున, ఉపచయపూర్వక భూతార్థక క్రియలలోని యుపచయము బహుళముగా లోపించును. వానిని సందర్భమునుబట్టి వానిని భూతార్థకక్రియలుగా గ్రహించవచ్చును.

## పునర్ద్విత్వము (Reduplication)

**6.10** (అ) ధాతువుల బలీకరణమునకు పునర్ద్విత్వమొక ప్రక్రియ. ఈ ప్రక్రియలో ధాతువులోని యొక భాగమును దానితో కలిపి క్రొత్త రూపమును తయారుచేయుదురు ఈ పునర్ద్విత్వము సాధారణముగా ఈక్రింది సందర్భములలో పొడసూపును.

(1) కొన్ని ధాతువుల వర్తమానకాల ప్రకృతులను తయారుజేయుటకు (ఇట్టిధాతువుల సమూహమును జుహోత్యాది గణమందురు)

ఉదా॥ ద'దామి. బిభర్మి, ...

(2) ప్రతిధాతువునకును పరోక్షభూతప్రకృతి తయారుజేయుటకు

ఉదా॥ తతా'న, దధౌ', చకా'ర, ౬రే'చ, లులో'ప, ...

(3) అద్యతన భూతప్రకృతిని తయారుజేయుటకు

ఉదా॥ అ'దీధరమ్, అ'చుచ్యవమ్,...

(4) సమభిహారార్థక, ఇచ్ఛార్థక క్రియల ప్రకృతులను తయారుజేయుటకు

ఉదా॥ జ'ఙ్ఘంతి, జో'వవీతి, మర్మృజ్య'తే, పిపాసతి, జి'ఘాంసతి, ...

(5) నామవాచకార్థకములగు జన్యప్రకృతులలో

ఉదా॥ ప'ప్రి, చ'ర్చరా, సాసహి' చికితు', మలిమ్లుచ',

(ఆ) పునర్ద్విత్వీకరణమునకు సాధారణ సూత్రములు.

(1) ధాతువుయొక్క మొదటి యక్షరము పునర్ద్విత్వమును బొందును.

ఉదా॥ బుద్ —— > బుబుద్,...

(2) ఘోషవ్యంజనమునకు బదులు అఘోషవ్యంజనము చేర్చబడును.

ఉదా॥ భీ—— > బిభీ, ధా—— > దధా,...

(3) కంఠ్యముల స్థానమున పునర్ద్విత్వమును పొందిన వ్యంజనము తాలవ్యమగును. 'హ' కు బదులు జ వచ్చును.

ఉదా॥ గమ్ —— > జగమ్, ఖన్ —— > చఖన్. హన్ —— > జఘన్, ...

(4) ధాతువునకు మొదట ఒకటికంటె నెక్కుడు హల్లుబున్న, మొదటి దానికే పునర్ద్విత్వము.

ఉదా॥ క్రమ్ —— > చక్రమ్, ...

(5) ధాతువునకు మొదట ఊష్మమును, దాని వెనువెంట పరుషాక్షరమును ఉన్నచో రెండవయక్షరమునకు పునర్ద్విత్వము కల్గును.

ఉదా॥ స్థా —— > తస్థా, స్కన్ద్ —— > చస్కన్ద్,...

కాని స్వజ్ —— > సస్వజ్ ('వ' పరుషము కాదు గావున)

స్మి —— > సిస్మి ('మ' పరుషము కాదు గావున)

(6) హ్వా తరగతికి చెందిన ధాతువులలో ఋకార ౠకారములకు బదులుగా ఇకారము వచ్చును.

ఉదా॥ భృ—> బిభృ, పృ—> పిపృ, ...
దీనికి అపవాదము వృత్—> వవర్త్

## క్రియాపదముల స్వరము

**6 11** (అ) వాక్యముయొక్క ప్రధానభాగము (Principal clause) లోని క్రియ సాధారణముగా ఉదాత్తరహితముగనే యుండును. అనగా దానిపై యుదాత్తముండదు. ఐతే, ఈ క్రియాపదము వాక్యమునకు గాని, పాదమునకు గాని మొదటనున్నచో దానిపై యుదాత్తము తప్పక యుండును.

ఉదా॥ అగ్ని'మ్ ఈడేపురో'హితమ్
స' ఇద్దేవే'షు గచ్ఛతి
యజ'మానస్య పశూన్ పాహి.
ఐతే
ప'న్థ్యమ్ దై'వ్యాయ క'ర్మణే
దర'య మా యాతుధానాన్

(ఆ) ప్రధానవాక్యభాగములో అనేక ప్రధానక్రియాపదము లున్నచో, వానిలోని మొదటిదానిపైననే యుదాత్తము ఎగిరిపోవును. తరువాతవచ్చు (ప్రధానవాక్యభాగములో) క్రియాపదము లన్నిటిపైనను ఉదాత్తముండును

ఉదా॥ తర'ణిర్ ఇ'జ్ జయతి క్షే'తి పు'ష్యతి
అస్మ'భ్యమ్ జేషి యో'త్సిచ;

(ఇ) అస్వతంత్రవాక్యభాగమున వచ్చిన క్రియాపదము లెల్లను ఉదాత్తమును బొందును. చాలావరకు అస్వతంత్ర వాక్యభాగములు. 'య' అను సాపేక్ష సంబంధ సర్వనామముచే మొదలగును. అట్టి వాక్యభాగములలోని క్రియలపై తప్పక ఉదాత్తముండును.

(ఈ) క్రియాజన్యములగు విశేష్య, విశేషణములును, తుమున్నర్థకములు, త్వార్థకములు, అసమాపక క్రియలును, ఉదాత్తమును వహించును.



# 7. వర్తమానకాలము

**7.1** (అ) అన్నికాల ప్రకృతులలోను వర్తమానకాల ప్రకృతులే ముఖ్యములు. దీనిలోని యంతర్భాగముగా (1) సూచకార్థకము (2) దీనికి సంబంధించిన అపరోక్షభూతార్థకము (3) విధ్యర్థకము (4) ఆజ్ఞార్థకము (5) నిర్బంధార్థకము (వేదములో) (6) ఈకాలమునకు సంబంధించిన అసమాపకక్రియయు చేరును. ఇవిగాక కర్మణిప్రయోగమును (Passive voice) ఒక రకమగు వర్తమాన కాలార్థకమే. ప్రాచీనార్వాచీన వాఙ్మయములో నెల్ల నివియే ఎక్కువగా కన్పించును. వేదవాఙ్మయమున నూటికి 75 వంతులు ఇవియే. ఐతరేయబ్రాహ్మణమున నూటికి 80 వంతులు, హితోపదేశమున నూటికి 85 వంతులు, శాకుంతలమున నూటికి 89 వంతులు, మనుస్మృతిలో నూటికి 97 వంతులును కలవు. దీనిచే వీని ప్రాముఖ్యము విశదమగును.

(ఆ) వివిధ ధాతువులయొక్క వర్తమానకాల ప్రకృతులు వివిధములుగా నేర్పడును. ధాతువుల వర్తమానకాల ప్రకృతులు ఏర్పడు విధమునను సరించి వానిని స్థూలముగా ఎనిమిది విధములుగా విభజించవచ్చును ఇవి మరల అకారాంత ప్రకృతులు గలవి, ఇతరములు (అనకారాంతప్రకృతులు) అనిరెండు విభాగములు చేయవచ్చును. అకారాంతప్రకృతులుగల ధాతువులకు కొన్ని సామాన్యధర్మములు కలవు ఇట్లే ఇతరములకును (అనకారాంత ప్రకృతులుగల వానికి) కొన్ని సామాన్య ధర్మములు (అకారాంతప్రకృతులకులేనివి) కలవు. ధాతువులలో అకారాంత ప్రకృతులుగల ధాతువులే ఎక్కువ పాణిని చెప్పిన సుమారు 2200 ధాతువులలో సుమారు 1500 పైగా నివియే. దీనిచే వీని ప్రాముఖ్యము గమనించనగును.

### అకారాంత ప్రకృతుల ప్రక్రియ

**7.2** వీనియొక్క వర్తమానకాల ప్రకృతులు అకారాంతములుగా నుండును. ఇవి మరల నాలుగు విధములు.

I అ–వర్గము లేక ఉదాత్తరహిత అ–వర్గము (1వ వర్గము లేక భ్వాది వర్గము) ఈ వర్గమునకు చిహ్నము 'అ' యను పొడి. దీనిపై ఉదాత్తము ఉండదు.

కాని దీనికి సంబంధించిన ధాతువుపై తప్పక ఉదాత్తము ఉండును కావున ధాతువు గుణీకరణముచే (కొన్నిసార్లు ఇతరవిధముగా) బలిష్ఠము చేయబడును.

ఉదా. భూ—> భ'వ, నీ—> న'య, బుధ్—> బో'ధ, వద్—> వ'ద; ...

పాణిని చెప్పిన సుమారు 2200 ధాతువులలో ఇంచుమించు 1200 ఈ వర్గమునకు చెందినవియే.

II అ'-వర్గము, లేక ఉదాత్తసహిత అ-వర్గము (6వ వర్గము. తుదాదివర్గము) దీనికి గూడను వర్గచిహ్నము అకారమేగాని, దానిపై ఉదాత్తము ఉండును. అందుచే దీనికి సంబంధించిన ధాతువుపై ఉదాత్తముండదు గావున గుణీకరణ ప్రసక్తి లేదు

ఉదా॥ తుద్—> తుద', సృజ్—> సృజ', సూ—> సువ' (దీనిలోని దీర్ఘము హ్రస్వీకరించుటచే బలహీన పరచనైనది)

III య-వర్గము (4వ వర్గము, లేక దివాదివర్గము). దీనిలో ధాతువునకు 'య' చేర్చుదురు. దీనిపై ఉదాత్తము ఉండదు. కాన ధాతువుపై తప్పక యుదాత్తము ఉండును ఐతే (I వ వర్గమునకు భిన్నముగా) ఈ ధాతువు గుణీకరణమును పొందదు.

ఉదా॥ దీవ్—> దీవ్య, నహ్—> న'హ్య, కృధ్—> క'ృధ్య;...

IV కర్మణిప్రయోగమునకుపయోగించు ప్రకృతులును ఒకవిధముగా వర్తమానార్థక ప్రకృతులే. ఐతే ఇవి యన్నియు సకర్మక క్రియలచేత నేర్పడును. వీని ప్రత్యయములు కేవలము ఆత్మనేపదప్రత్యయములే. దాని వర్గ చిహ్నము ఉదాత్తసహితమగు య'. అనగా దాతువునకు య' చేర్చినచో కర్మణి ప్రయోగమున కనువగు ప్రకృతి ఏర్పడును. దీనికి ఆత్మనేపదప్రత్యయములు చేర్చిన కర్మణిప్రయోగమేర్పడును. దీని ప్రక్రియయు పై జెప్పబడిన య-వర్గ ప్రక్రియ వలెనే యుండును.

ఉదా॥ అద్—> అద్య', రుధ్—> రుధ్య', బుధ్—> బుధ్య', తుద్—> తుద్య';...

సూచనలు:—

(i) సకర్మక క్రియలలో య-వర్గములకు చెందినవాని యాత్మనే పదప్రక్రియచే నేర్పడు పదములు, కర్తరిప్రయోగములా కర్మణిప్రయోగములా తెలియుటకు వానిపైనున్న యుదాత్తస్థానము తప్ప వేరు విధము లేదు.

ఉదా॥ న'హ్యతే=కట్టుచున్నాడు: నహ'్యతే=కట్టబడుచున్నది.
శు'ష్యతే=ఎండుచున్నది: శుష'్యతే=ఎండింపబడుచున్నది

... ... ...

(ii) పైజెప్పబడిన నాలుగు వర్గములుగాక చురాది వర్గమని చెప్పబడు మరియొక వర్గము కలదు. దీని వర్గచిహ్నము అ'య. దీనిని గుణీకరించబడిన ధాతువునకు చేర్చుదురు. ఉదా॥ చుర్ —> చో ర'య; ... ఐతే ఈ ప్రకృతి కేవలము వర్తమానకాలమునకే పరిమితముగాక, ఇతర కాలములకును వర్తించును. ఇదిగాక దీని యర్థములో ప్రేరణార్థకము గూడ నిమిడియుండి, చాలా ధాతువులకు వర్తించుటచే దీనిని గౌణప్రక్రియ యందు (జన్యప్రక్రియ యందు) చేర్చి చర్చించవచ్చును.

(iii) కొలది ధాతువుల చివరనున్న హల్లునకు బదులు (వర్తమానకాల ప్రకృతిలో) 'ఛ' చేర్చుదురు దీనికి అకారము కలిపి మిగిలిన అకారాంత ప్రకృతులకు వలెనే ప్రక్రియను నడపుదురు. ఇది ఒకప్పుడు ఒక వర్గధాతువుల వర్గచిహ్నముగా నుండవచ్చును ఇట్టివి చాలా స్వల్పములు, చాలా క్రమరహిత ప్రవర్తనగలవియు నగుటచే, వానిని ఆయా సందర్భములలో వివరించవచ్చును.

## అకారాంతములు గాని ఇతర ప్రకృతుల క్రియాప్రక్రియ

**7.3** వీనిని ఈ క్రిందివిధముగా వర్గీకరించవచ్చును.

V ధాతువర్గము: (2వ వర్గము లేక అదాదివర్గము) దీని ప్రకృ ధాతువే. దాని కెట్టి మార్పును జేయక ప్రత్యయములను జేర్చుదురు.

ఉదా॥ అద్, ఇ, అస్, యా, ద్విష్, దుహ్;...

VI పునర్ద్విత్వవర్గము: (3వ లేక జుహోత్యాది వర్గము) దీనిలో ధాతువును పునర్ద్విత్వముచేసి ప్రకృతిగా తయారుజేయుదురు.

ఉదా॥ హు—> జుహు, దా—> దదా, భృ—> బిభృ;...

VII అనునాసికావర్గము : (7వ లేక రుధాదివర్గము) ఈ వర్గములో ధాతువు చివర నుండు హల్లునకు ఉపధగా అనునాసికము చేరును. ఈ యను నాసికము బలీయ ప్రకృతులలో 'న' గా మారును.

ఉదా॥ రుధ్—> రున్ధ్ (బలీయప్రకృతి 'రుణధ్')

యజ్—> యుఞ్జ్ (బలీయప్రకృతి 'యునజ్')

VIII ను-వర్గము (5వ వర్గము లేక స్వాదివర్గము)

(అ) ను-వర్గమునకు చెందిన ధాతువులలో, ధాతువులకు సరాసరిగా 'ను' ను తగిలించుదురు.

ఉదా॥ సు—> సును; ఆప్ —> ఆప్ను;

(ఆ) కొలది ధాతువులతో (ఆరు మాత్రము) ఇదివరకే యుండిన చివరి నకారమునకు ఉకారము చేర్చుదురు. (8వ వర్గము తనాదివర్గము) ఇది VIII లో అంతర్భాగముగా పరిగణించవచ్చును. ఈ వర్గములో కృ ధాతువును కూడా చేర్చుదురు (ప్రకృతిలో ఉకారాంతమగును గనుక).

IX నా-వర్గము. (9 వ వర్గము. క్ర్యాదివర్గము) దీనిలో ధాతువునకు చివర 'నా' చేర్చుదురు. ఇది దీని బలీయ ప్రకృతి. దీని దుర్బల ప్రకృతిలో 'నీ' చేరును.

ఉదా॥ క్రీ —> క్రీణా. (దుర్బల ప్రకృతి క్రీణీ)

స్తభ్ —> స్తభ్నా (దుర్బల ప్రకృతి స్తభ్నీ)

**7.4** అకారాంత ప్రకృతుల క్రియాప్రక్రియ యొక్క ముఖ్య విశేషములు.

(1) వర్తమానకాల ప్రకృతికి అంతమున 'అ' వచ్చును.

(2) దీనిపై ఉదాత్తము ఎల్లపుడును ఒకేచోట నుండును ఇది ప్రకృతి పైనుండి ప్రత్యయమునకును, ప్రత్యయముపై నుండి ప్రకృతికిని మారుచుండదు. (ఇది అకారాంత ప్రకృతుల సామాన్యధర్మము. సుబంత ప్రక్రియ యందును, ఇతర ప్రక్రియల యందును ఇట్లే)

(3) విధ్యర్థ సూచకమగు పొడి 'ఈ' ఇది ఉభయపదములలోను గూడా ప్రకృత్యంతముసగల అకారముతో గలిసి 'ఏ'గా మారును. (ఇతర

ప్రకృతులలో విధ్యర్థక సూచకముగా, పరస్మైపదులలో 'యా', ఆత్మనేపదులలో 'ఈ' పచ్చును )

(4) పరస్మైపదమున, ఆజ్ఞార్థకములో 2వ ఏకవచనమునకు ప్రత్యయమేమియు లేదు. ('తాత్' అనునది వాడినచో తప్ప)

(5) ఆత్మనేపద 2వ, 3వ పురుషల ద్వివచనములలో ప్రత్యయమునకు మొదట 'ఆ' వచ్చుటకు బదులు 'ఏ' వచ్చును.

(6) పరస్మైపద 3వ, బహువచనమున ప్రత్యయము అన్ (ఉస్ కాదు)

(7) ఆత్మనేపద 3వ, బహువచనమున ప్రత్యయములు సంపూర్ణ స్వరూపములో అంతే, అంత, అంతామ్, వచ్చును.

(8) ఆత్మనేపద అసమాపక క్రియారూపమున 'ఆన'కు బదులు 'మాన' వచ్చును.

(9) ఉభయపదములలోను, ప్రథమపురుష ద్వితీయా, తృతీయా వచనముల ప్రత్యయముల వకార, మకారములకు ముందు ప్రకృత్యంతమగు అకారము దీర్ఘీకరింపబడును.

(10) అపరోక్షభూత 1వ ఏకవచనమునను, సూచనార్థక 3వ, బహువచనమునను ప్రకృత్యంతము లోపించును.

ఉదా॥ అ'భవమ్=అభవ్ + అమ్

భవన్తి=భ'వ్ + అన్తి, భ'వన్తే=భ'వ్ + అన్తే; ...

(11) ఈ నాలుగు విధములగు ధాతువుల ప్రకృతులేగాక, అకారాంతములగు ఇతరప్రకృతులయొక్కయు (ఉదా॥ కర్మణి, స-భవిష్యత్తు, అద్యతన భూతకాలముయొక్క మూడు రకముల ప్రకృతులు-అనగా (1) అకారాంతములు, (2) స తో అంతమగునవి (3) పునర్ద్విత్వమును పొందినవి గౌణప్రక్రియలోని అకారాంత ప్రకృతుల యొక్కయు) ప్రక్రియలు ఒకే విధముగా నుండును.

అకారాంత ప్రకృతుల క్రియాప్రక్రియయొక్క రూపావళి ఈ క్రింద నుదహరింపబడినవి. నిర్బంధార్థకము వేదములో గాని రాదు కావున దానిని వదలి వేయనైనది. వలసినచో వేదవ్యాకరణమున కనుగొనవచ్చును.

## 7.5 I ఉదాత్తరహిత అ-వర్గము (1వ భ్వాదివర్గము)

సూచన : ఈ గ్రంథమున ఉదాహరించిన ధాతువుల పదములు (పరస్మై, ఆత్మనే) వైదిక వాఙ్మయము ననుసరించి వ్రాయబడినవి లౌకిక వాఙ్మయమున వీనికి భిన్నములుగా నుండవచ్చును.

### సూచకార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | భ'వామి | భ'వావః | భ'వామః | భ'వే | భ'వావహే | భ'వామహే |
| 2 | భ'వసి | భ'వథః | భ'వథ | భ'వసే | భ'వేథే | భ'వధ్వే |
| 3 | భ'వతి | భ'వతః | భ'వన్తి | భ'వతే | భ'వేతే | భ'వన్తే |

### విధ్యర్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | భ'వేయమ్ | భ'వేవ | భ'వేమ | భ'వేయ | భ'వేవహి | భ'వేమహి |
| 2 | భ'వేః | భ'వేతమ్ | భ'వేత | భ'వేథాః | భ'వేయాథామ్ | భ'వేధ్వమ్ |
| 3 | భ'వేత్ | భ'వేతామ్ | భ'వేయుః | భ'వేత | భ'వేయాతామ్ | భ'వేరన్ |

### ఆజ్ఞార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | భ'వాని | భ'వావ | భ'వామ | భ'వై | భ'వావహై | భ'వామహై |
| 2 | భ'వ | భ'వతమ్ | భ'వత | భ'వస్వ | భ'వేథామ్ | భ'వధ్వమ్ |
| 3 | భ'వతు | భ'వతామ్ | భ'వన్తు | భ'వతామ్ | భ'వేతామ్ | భ'వన్తామ్ |

### అపరోక్షభూతార్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | అ'భవమ్ | అ'భవావ | అ'భవామ | అ'భవే | అ'భవావహి | అ'భవామహి |
| 2 | అ'భవః | అ'భవతమ్ | అ'భవత | అ'భవథాః | అ'భవేథామ్ | అ'భవధ్వమ్ |
| 3 | అ'భవత్ | అ'భవతామ్ | అ'భవన్ | అ'భవత | అ'భవేతామ్ | అ'భవన్త |

దీని యసమాపక క్రియలు పరస్మైపదిలో భ'వన్ (స్త్రీ భ'వన్తీ) ఆత్మనే పదిలో భ'వమాన.

**7 6** అ-వర్గప్రక్రియకు అపవాదములు

(అ) కృప్ (లేక క్రప్, పరితపించు) యొక్క ప్రక్రియలో గుణీకరము రాదు. కృ'పతే...

(ఆ) గుహ్ (దాచు) లోని యచ్చునకు గుణీకరణమునకు బదులు దీర్ఘీకరణము వచ్చును ఉదా॥ గూ'హతి;...

(ఇ) క్రమ్ (అడుగులిడు) పరస్మైపదిలో దీని యచ్చు దీర్ఘీకరించ బడును క్రా'మతి; . . కాని ఆత్మనే పదిలో నిదిరాదు. క్ర'మతే;...

(ఈ) మృజ్ నకు గుణీకరణమునకు బదులు వృద్ధి యగును. మా'ర్జస్య.

(ఉ) గమ్; యమ్ లకు వర్తమానకాల ప్రకృతి గ'చ్ఛ, య'చ్ఛ. ఇట్లు గ'చ్ఛామి, య'చ్ఛామి;...

(ఊ) సద్ యొక్క వర్తమానకాలప్రకృతి సీద. సీ'దామి(కూర్చుందును)

(ఋ) ఇతర ధాతువులు (ఈ వర్గమునకు చెందనివి) కొన్ని కాల క్రమమున నీ వర్గమున వచ్చి చేరినవి. వీనిలో ముఖ్యములు ఆకారాంతములగు నీ క్రింది ధాతువులు. స్థా (నిలుచుండు); పా (త్రాగు), ఘ్రా (వాసనచూచు). వీని వర్తమాన ప్రకృతులు వరుసగా తి'ష్ఠ, పి'బ జిఘ్ర, యై భ్వాదివర్గమున చేరినవి.

**7.7** II ఉదాత్త సహిత అ'—వర్గము (6వ లేక తుదాది వర్గము).

దీనికి ఉదాహరణముగా విశ్ (ప్రవేశించు) స్వీకరించుదము. దీని ప్రకృతి విశ'. దీని ప్రక్రియ మొదటిదానివలెనే యుండును గాన పూర్తిగానీయపని లేదు. (దీనిలో ధాతువు బలహీనరూపమున నుండుట ఉదాత్త స్థానమును గమనింప వలయును)

పరస్మై 1. సూచకార్థకము ఆత్మనే

| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|
| 1. | విశా'మి | విశా'వ | విశామ | విశే' | విశా'వహే | విశా'మహే |
| 2. | — | — | — | — | — | — |
| 3 | — | — | — | — | — | — |

2. విధ్యర్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1. | విశే'యమ్ | విశే'వ | విశే'మ | విశేయ | విశేవహి | విశేమహి |
| 2. | — | — | — | — | — | — |
| 3. | — | — | — | — | — | — |

3. ఆజ్ఞార్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | - | - | - | | | |
| 2. | విశ' | విశ'తమ్ | విశ'త | విశ'స్వ | విశే'థామ్ | విశ'ధ్వమ్ |
| 3, | - | - | - | - | - | - |

4. అపరోక్షభూతార్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | అ'విశమ్ | అ'విశావ | అ'విశామ | అ'విశే | అ'విశావహి | అ'విశామహి |
| 2. | - | - | - | - | - | - |
| 3 | - | - | - | - | - | - |

అసమాపకక్రియలు; పరస్మైపదిలో విశ'న్త్; ఆత్మనేపదిలో విశ'మాన

**7 8** అ'—వర్గములోని విశేషరూపములు

(అ). ఇ, ఉ, ఊ అంతమునగల ధాత్వంతములు, వర్గచిహ్నమగు 'అ' 'కు ముందు ఇయ్, ఉవ్, గా మారును. ఉదా॥ క్షియ'; యువ'; రువ'; సువ';

(ఆ) ప్రఛ్ యొక్క ప్రకృతి రూపము పృచ్ఛ'

(ఇ) ఈ వర్గముయొక్క ప్రకృతులు దుర్బలరూపములైనను, కొన్ని కొన్ని ధాతువులు, ఉపధాస్థానమున నిక్షేపింపబడిన యనునాసికముచే బలీయము లగును ఇట్టివి—

ముచ్ —> ముఞ్చ'; సిచ్ —> సిఞ్చ'; విద్ —> విన్ద'
కృత్ —> కృన్త'; పిశ్ —> పింశ'; తృప్ —> తృమ్ప'
లుప్ —> లుమ్ప'; లిప్ —> లిమ్ప';...

ఈ ధాతువులు కొన్ని అనునాసికావర్గము (7.3, VII) నుండి దీనిలోనికి మార్చిడి చేయబడినవి.

## 7.9 *III* య-వర్గము (4వ లేక దివాదివర్గము)

ఈ వర్గముయొక్క వర్తమానకాల ప్రకృతులు ధాతువుయొక్క దుర్బల రూపమునకు 'య' చేర్చుటచే నేర్పడును. (దీనిలో ఉదాత్తము ధాతువుపై నుండును ఐనను నది బలహీనరూపముగనే యుండును. దీనికిని అ-వర్గప్రకృతులకును గల భేదము గమనించదగినది) దీని క్రియాప్రక్రియయు అ-వర్గ ప్రక్రియవలెనే యుండును.

ఉదా॥ నహ్ (కట్టివేయు) —> న'హ్య

1. సూచకార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | న'హ్యామి | నహ్యావః | నహ్యామః | న'హ్యే | న'హ్యావహే | న'హ్యామహే |
| 2 | — | — | — | — | — | — |
| 3 | — | — | — | — | — | — |

2. విధ్యర్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | న'హ్యేయమ్ | న'హ్యేవ | న'హ్యేమ | న'హ్యేయ | న'హ్యేవహి | న'హ్యేమహి |
| 2 | — | — | — | — | — | — |
| 3 | — | — | — | — | — | — |

3. ఆజ్ఞార్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | — | — | — | — | — | — |
| 2 | న'హ్య | న'హ్యతమ్ | న'హ్యత | న'హ్యస్వ | న'హ్యేథామ్ | న'హ్యధ్వమ్ |
| 3 | — | — | — | — | — | — |

4. అపరోక్షభూతార్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | అ'నహ్యమ్ | అ'నహ్యావ | అ'నహ్యామ | అ'నహ్యే | అ'నహ్యావహి | అ'నహ్యామహి |
| 2 | — | — | — | — | — | — |
| 3 | — | — | — | — | — | — |

అసమాపకక్రియలు, పరస్మైపదిలో న'హ్యన్త్ (స్త్రీ. న'హ్యన్తీ)

ఆత్మనేపదిలో న'హ్యమాన

సూచనలు :—

(అ) య-వర్గమునకు చెందిన ధాతువులు చాలావరకు (50 పైగా) మనస్సుయొక్కగాని, శరీరముయొక్కగాని పరిస్థితులను తెలియజేయునవిగా ఉన్నవి. ఉదా॥ కుప్ (కోపించు), క్లమ్ (అలసటజెందు), క్షుధ్ (ఆకలిగొను) ముహ్ (తడబడబడు), లుభ్ (దురాశజెందు), శుష్ (ఎండిపోవు).

(ఆ) ముందు చెప్పబోవు కర్మణి ప్రయోగమున నేర్పడు య' కారసహిత ప్రకృతులలోని యకారమును తీసివేసి ఈ వర్గమున చేర్చబడిన ధాతువులు కొన్ని గలవు. ఐతే వాని యర్థములో కర్మణి పయోగము గోచరించుచుండినను పరస్మై పదప్రత్యయములను జేర్చి ఈ వర్గములో కలుపబడినవి. ఇట్టివి క్షి (నశింపజేయు) తప్ (వేడిచేయు), దృహ్ (దృఢీకరించు, గట్టిచేయు) మొదలగునవి ప్రాచీనవాఙ్మయమునను గోచరించును.

(ఇ) కొన్ని ధాతువులు ఐకారాంతములవి భ్వాదివర్గము (అ వర్గము)లో చేర్చబడియున్నవి. వీని ప్రకృతులు వర్తమానకాలమున గాక ఇతరకాలములలో ఆకారాంతములుగా గోచరించుచున్నవి. ఇట్టివానిని ఆకారాంతధాతువులుగనే పరిగణించి య-వర్గమున చేర్చిన వచ్చు ప్రత్యవాయమేమియును లేదు. ఇట్టివి షా (తగులబెట్టు), గా (పాటపాడు), గ్లా (శ్రమచెందు), త్రా (రక్షించు), ధ్యా (ఆలోచించు), ప్యా (నిండు), మ్లా (వదలించు), రా (మొఱగు) . . . ... కొన్ని ధాతువులు ఏకారాంతములుగా పేర్కొనబడి భవాది (అ-వర్గమున) చేర్చబడియున్నవి. వీనికిని ఆకారాంతరూపములు బహుళముగా కన్పించుచుండుటచే వీనిని య-వర్గమున చేర్చవచ్చును. ఇట్టివి ధా (పీల్చు), మా (మార్పిడిచేయు) వా (నేతనేయు) హ్వా (పిలుచు) మొదలగునవి. ఐతే వీని ఆకారాంతములు బలహీనములై అకారముగా మారును. (ఇది ఈ వర్గముయొక్క ధర్మమేగదా!).

**7.10** య-వర్గములోని విశేషరూపములు.

(1) అమ్ తో అంతమగు ధాతువులలోని అకారము దీర్ఘీకరింపబడును.

ఉదా॥ తమ్—> తా'మ్యతి, శ్రమ్—> శ్రా'మ్యతి, క్లమ్—> క్లా'మ్యతి;

(2) మద్ ——> మా'ద్యతి

(3) ఇట్లే 'ఇవ్' తో అంతమగు కొన్ని ధాతువుల (నిజమునకు వీని యంతములు 'ఈవ్' గాని 'ఇవ్' గాదు) ప్రకృతులలోని ఇకారము దీర్ఘీకరింప బడును.

ఉదా॥ దివ్ ——> దీ'వ్యతి; సివ్ ——> సీ'వ్యతి; ...

## 7.11 IV. య'వర్గము-కర్మణి ప్రక్రియ.

కర్మణిప్రయోగమునకు అనుకూలములగు అన్నిధాతువులతోను (సకర్మక క్రియార్థకములు) వర్తమానకాల ప్రకృతులకు ఉదాత్తసహితమగు య'చేర్చి ఆత్మనే పద ప్రత్యయముల నతుకుటచే కర్మణి ప్రయోగములేర్పడును.

ఉదా॥ హన్ ——> హన్య'; ఆప్ ——> ఆప్య'; గృహ్ > గృహ్య';...

(అ) వర్గ చిహ్నమగు య'కు ఉదాత్తమున్నది గాన ధాతువుయొక్క దుర్బల రూపమునే స్వీకరించవలయును. అందుచే ధాతువులోని ఉపధా స్థాన మున నున్న నకారము లోపించును.

ఉదా॥ బన్ధ్ ——> బధ్య'; అఞ్జ్ ——> అజ్య';

ఇట్లే సంప్రసారణముచే వచ' ——> ఉచ్య'; యజ్ ——> ఇజ్య';......

(ఆ) ధాత్వంతమునగల యచ్చునకు వెంటనే 'య' వచ్చుటచే, ఇతర ప్రక్రియలలోవలె నీయచ్చుగూడ మార్పు జెందును.

ఉదా॥ ఇ,ఉ లు దీర్ఘీకరింపబడును.

(i) మి ——> మీయ'; సు ——> సూయ';.

(ii) ఆకారము ఈకారముగా మారును.

దా ——> దీయ'; హా ——> హీయ';.

(కాని జ్ఞా ——> జ్ఞాయ' ఇచట ఈ కారము రాదు)

(iii) ధాత్వంతముననున్న ఋకారము 'రి' గా మారును.

కృ ——> క్రియ'.

(ఐతే ఋకారమునకు ముందు రెండు హల్లులున్నచో, దీనికి గుణ మేర్ప డును. (దీనికి కారణము మూడు హల్లుల సంయోగముచే ఉచ్చారణ కాఠిన్య మేర్పడుటచేగాబోలు)

ఉదా॥ స్మృ—> స్మర్య';

(ఇ) ఈ వర్గప్రక్రియయు ఇతర అకారాంత ప్రకృతుల ప్రక్రియవలెనే యుండును. ఐతే వీనికి ఆత్మనే పద ప్రత్యయములే వాడబడును.

సూచకార్థము

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| 1 | క్రియే' | క్రియా'వహే | క్రియా'మహే |
| 2 | ... | ... | ... |
| 3 | ... | ... | ... |

విధ్యర్థకము

| | | | |
|---|---|---|---|
| 1 | క్రియే'య | క్రియే'వహి | క్రియే'మహి |
| 2 | ... | ... | ... |
| 3 | ... | ... | ... |

ఆజ్ఞార్థకము

| | | | |
|---|---|---|---|
| 1 | క్రియ'స్వ | క్రియే'థామ్ | క్రియ'ధ్వమ్ |
| 2 | ... | ... | ... |
| 3 | ... | ... | ... |

అపరోక్ష భూతార్థకము

| | | | |
|---|---|---|---|
| 1 | అ'క్రియే | అ'క్రియావహి | అ'క్రియామహి |
| 2 | ... | ... | ... |
| 3 | ... | ... | ... |

అసమాపక క్రియారూపము. క్రియా'మాణ

### 7.12 10వ వర్గమని పిలువబడు చురాది వర్గము.

ఇది నిజముగా ప్రత్యేకవర్గముగాదు. దీని ప్రకృతులు చాలావరకు జన్య ప్రకృతులు. (కొన్ని ప్రేరణార్థకములు. కొన్ని నామధాతుకరణములు) ఈ వర్గములో సుమారు పదిమాత్రము మూలధాతువులు. మిగిలినవన్నియు జన్య

ములే ఈ వర్గచిహ్నము ఉదాత్తసహితమగు అ'య దీనిని సాధారణముగా ధాతువుయొక్క బలీయరూపమునకు తగిలింతురు.

ఉదా॥ చిన్త్ — > చింత'య;...

దీని ప్రక్రియ. వర్తమానమున

| | పరస్మై | ఆత్మనే |
|---|---|---|
| సూచకార్థకము | చింత'యామి | చింత'యే |
| విధ్యర్థకము | చింత'యేయమ్ | చింత'యేయ |
| అపరోక్షభూతము | అ'చింతయమ్ | అ'చింతయే |
| అసమాపక క్రియ | చింత'యన్త్ | చింత'యామాన (చింత'యాన) |

## 7.13 అనకారాంత ప్రకృతుల క్రియాప్రక్రియ

(అ) ఈతరగతికి చెందిన పదముల ముఖ్యగుణము, వానిలోని ఉదాత్తస్థానము యొక్క మార్పు. ఒక్కొక్కసారి ఉదాత్తము ప్రత్యయముపైనను, ఒక్కొక్క సారి ధాతువుపైనను, మరియొకసారి వర్గచిహ్నముపైననుఉండును. ఈమార్పుకు అనుగుణముగా ప్రకృతిలోను మార్పుగల్గును ఉదాత్తము ప్రకృతిపైనున్నపుడు దాని స్వరూపము బలీయముగను ప్రత్యయముపైనున్నపుడు ప్రకృతి దుర్బలము గను ఉండును.

(ఆ) ఈ వర్గములో (i) పరస్మైపద విధ్యర్థకములు, ఆజ్ఞార్థకములో 2వ ఏకవచనము, (ii) ఆత్మనేపదములో 3వ బహువచనము, (iii) ఆత్మనే పద అసమాపక క్రియారూపములు, అకారాంతప్రకృతులలోని రూపములకంటె భిన్నములుగానుండును.

(ఇ) ఈ క్రింద వివరించబోవు మొదటి మూడువర్గముల (V, VI, VII) ప్రక్రియలలో, ప్రకృత్యంశమునగల హల్లులు, ప్రత్యయములకు మొదట నున్న హల్లులతో సంయోగమును బొందును వీనిలో హల్సంధి సూత్రములను బాగుగా గుర్తునందుంచుకొనవలయును. కావున ఉదాహరణలలో ఒకటికంటె నెక్కుడు పదముల ప్రక్రియ ఒసగబడినది.

## 7.14 V. ధాతువర్గము (2వ వర్గము లేక ఆదాదివర్గము)

ఈ వర్గములో వర్గ చిహ్నమేదియులేదు. ప్రత్యయములను ధాతువునకే సరాసరి యతికించుదురు. బలీయ ప్రత్యయములు (అనగా పరస్మైపదములో మూడు పురుషలలోను ఏకవచనములు—ఆజ్ఞార్థకములో ద్వితీయ పురుషతప్ప-ఉభయపదములలో ఆజ్ఞార్థకమున ప్రథమపురుష రూపములన్నియు) గుణీకరణ మును బొంది ఉదాత్తమును వహించును. మిగిలిన ప్రత్యయము లన్నిటిపైనను ఉదాత్తముండుటచే ప్రకృతిబలహీన రూపమున నుండును. అపరోక్షభూతార్థక మున ఉదాత్తము ఉపచయముపైననే యుండును.

ఉదాహణకు పరస్మైపదములో ఇ (పోవు), ఆత్మనేపదములో ఆస్ (కూర్చుండు) ను స్వీకరించి వాని ప్రక్రియను చూపుదుము.

సూచన ;— ఆస్ ధాతువు ప్రక్రియలో ఉదాత్తము ఎల్లప్పుడు ఆ మీదనే యుండును ఇది దీని ప్రత్యేకత.

సూచకార్థకము

| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|
| 1 | ఏ'మి | ఇవ'ః | ఇమ'ః | ఆ'సే | ఆ'స్వహే | ఆ'స్మహే |
| 2 | ఏ'షి | ఇథ'ః | ఇథ' | ఆ'స్సే | ఆ'సాథే | ఆ'ద్ధ్వే |
| 3 | ఏ'తి | ఇత'ః | య'న్తి | ఆ'స్తే | ఆ'సాతే | ఆ'సతే |

ఇట్లే లిహ్ యొక్క ప్రక్రియ. దీనిసంధి ప్రక్రియకై చూ॥ 2.13 (ఊ) ( )

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | లే'హ్మి | లి'హ్వః | లి'హ్మః | లిహే' | లిహా'వహే | లిహా'మహే |
| 2 | లే'క్షి | లీఢ'ః | లీఢ' | లిక్షే' | లిహా'థే | లీఢ్వే |
| 3 | లే'ఢి | లీఢ'ః | లిహ'న్తి | లీఢే' | లిహా'తే | లిహ'తే |

గమనిక :— ఢకారము వచ్చిన రూపములలో ధాతువులోని అచ్చు దీర్ఘీకరింప బడుట గమనింపదగును.

విధ్యర్థకము

విధ్యర్థసూచకము పరస్మైపదములలో 'యా'; ఆత్మనేపదులలో 'ఈ' వీనిని ప్రత్యయములకు అతికి, ధాతువుయొక్క దుర్బల రూపమునకు కూర్చు దురు. ధాతువుపై ఉదాత్తముండదు. దీనికి అపవాదము ఆస్.

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | ఇయా'మ్ | ఇయా'వ | ఇయా'వ | ఆ'సీయ | ఆ'సీవహి | ఆ'సీమహి |
| 2 | ఇయా'ః | ఇయా'తమ్ | ఇయా'త | ఆ'సీథాః | ఆ'సీయాథామ్ | ఆ'సీధ్వమ్ |
| 3 | ఇయా'త్ | ఇయా'తామ్ | ఇయు'ః | ఆ'సీత | ఆ'సీయాతామ్ | ఆ'సీరన్ |

ఇట్లే ద్విష్; గుహ్; ... మొదలగువాని ప్రక్రియను గ్రహించవలయును.

ఆ జ్ఞా ర్థ క ము

(1) పరస్మై ద్వితీయా, ఏకవచనమున హలంతధాతువులకు 'ధి', అజంత ధాతువులకు 'హి' వచ్చును.

(2) ఉభయపదములయందును ప్రథమపురుషప్రత్యయములు వేదము లోని నిర్బంధార్థకమునుండి వచ్చినవి గావున వీనిపై ఉదాత్తముండదు. ప్రకృతి పైననే యుదాత్తముండును. అందుచే ప్రకృతి బలీయముగానుండును. ఇక పరస్మై 3వ. ఏకవచనమునగూడను ప్రకృతి బలీకిరణమును బొంది ఉదాత్తమును వహించును.

మిగిలిన వానికన్నిటికిని ఉదాత్తము ప్రత్యయముపైననే యుండును. ప్రకృతి బలహీనస్థితియందుండును.

ఇట్లు ఇ; ఆస్ చేసి క్రింది రూపములేర్పడును.

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అ'యాని | అ'యావ | అ'యామ | ఆ'సై | ఆ'సావహై | ఆ'సామహై |
| 2 | ఇహి' | ఇత'మ్ | ఇత' | ఆ'స్స్వ | ఆ'సాథామ్ | ఆ'ధ్వమ్ |
| 3 | ఏ'తు | ఇతా'మ్ | య'న్తు | ఆ'స్తామ్ | ఆ'సాతామ్ | ఆ'సతామ్ |

ఇట్లే ద్విష్, దుహ్; లిహ్‌యొక్క రూపములు వరుసగా

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | ద్వే'షాని | ద్వే'షావ | ద్వే'షామ | ద్వే'షై | ద్వే'షావహై | ద్వే'షామహై |
| 2 | ద్విడ్ఢి' | ద్విష్ట'మ్ | ద్విష్ట' | ద్విక్ష్వ' | ద్విషా'థామ్ | ద్విడ్ఢ్వ'మ్ |
| 3 | ద్వే'ష్టు | ద్విష్టా'మ్ | ద్విష'న్తు | ద్విష్టా'మ్ | ద్విషా'తామ్ | ద్విష'తామ్ |

| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|
| 1 | దో'హాని | దో'హావ | దో'హామ | దో'హై | దో'హావహై | దో'హామహై |
| 2 | దుగ్ధి' | దుగ్ధ'మ్ | దు'గ్ధ | దుక్ష్వ' | దుహా'థామ్ | దుగ్ధ్వ'మ్ |
| 3 | దో'గ్ధు | దుగ్ధా'మ్ | దుహ'న్తు | దుగ్ధా'మ్ | దుహా'తామ్ | దుహ'తామ్ |
| 1 | లే'హాని | లే'హావ | లే'హామ | లే'హై | లే'హావహై | లే'హామహై |
| 2 | లీఢి' | లీఢ'మ్ | లీఢ' | లిక్ష్వ' | లిహా'థామ్ | లిహధ్వ'మ్ |
| 3 | లే'ఢు | లీఢా'మ్ | లిహ'న్తు | లీఢా'మ్ | లిహా'తామ్ | లిహ'తామ్ |

అపరోక్ష భూతార్ధకము

బలీయ ప్రకృతులలో ధాతువును గుణాదేశముచే బలీకరణమొనరించి, 'అ' యను ఉపచయముచేర్చి గౌణప్రత్యయముల జేర్చినచో అపరోక్షభూతార్ధక మేర్పడును. ఉదాత్తము ఎల్లప్పుడును ఉపచయముపైననే యుండును.
ఇట్లు.

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | ఆ'యమ్ | ఐ'వ | ఐ'మ | ఆ'సి | ఆ'స్వహి | ఆ'స్మహి |
| 2 | ఐ'ః | ఐ'తమ్ | ఐ'త | ఆ'స్థాః | ఆ'సాథామ్ | ఆ'ధ్వమ్ |
| 3 | ఐ'త్ | ఐ'తామ్ | ఆ'యన్ | ఆ'స్త | ఆ'సాతామ్ | ఆ'సత |

ఇట్లే ద్విష్; దుహ్; లిహ్ లచే నీ క్రిందిరూపము లేర్పడును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | అ'ద్వేషమ్ | అ'ద్విష్వ | అ'ద్విష్మ | అ'ద్విషి | అ'ద్విష్వహి | అ'ద్విష్మహి |
| 2 | అ'ద్వేట్ | అ'ద్విష్టమ్ | అ'ద్విష్ట | అ'ద్విష్ఠాః | అ'ద్విషాథామ్ | అద్విడ్ఢ్వమ్ |
| 3 | అ'ద్వేట్ | అ'ద్విష్టామ్ | అ'ద్విషన్ | అ'ద్విష్ట | అ'ద్విషాతామ్ | అ'ద్విషత |
| 1 | అ'దోహమ్ | అ'దుహ్వ | అ'దుహ్మ | అదు'హి | అ'దుహావహి | అ'దుహామహి |
| 2 | అ'ధోక్ | అ'దుగ్ధమ్ | అదుగ్ధ | అ'దుగ్ధాః | అ'దుహాథామ్ | అ'దుగ్ధ్వమ్ |
| 3 | అ'ధోక్ | అ'దుగ్ధామ్ | అ'దుహన్ | అ'దుగ్ధ | అ'దుహాతామ్ | అ'దుహత |
| 1 | అ'లేహమ్ | అ'లిహ్వ | అ'లిహ్మ | అ'లిహి | అ'లిహ్వహి | అ'లిహ్మహి |
| 2 | అ'లేట్ | అ'లీఢమ్ | అ'లీఢ | అ'లీఢాః | అ'లీహాథామ్ | అ'లీఢ్వమ్ |
| 3 | అ'లేట్ | అ'లీఢామ్ | అ'లిహన్ | అ'లీఢ | అ'లీహాతామ్ | అ'లిహత |

## అసమాపక క్రియారూపములు

పరస్మైపదిలో ధాతువుయొక్క దుర్బలరూపమునకు అ'న్త్ (దీని దుర్బల రూపము అత్) కలిపిన అసమాపక క్రియావిశేషణమగును. కావున వీని రూపములు య'న్త్; దుహ'న్త్; ద్విష'న్త్; లిహ'న్త్ మొదలగునవి వీని స్త్రీ లింగ రూపములు 'అతీ' చేర్చిన నేర్పడును

ఉదా॥ య'తీ, దుహతీ', ద్విషతీ', లిహతీ', మొదలగునవి. కాని ఆకారాంత ధాతువులచే నేర్పడు అసమాపకక్రియలు ఆ'ంతి, ఆ'తి లచే నేర్పడును ఆత్మనే పదిలో ఇవి ధాతువు యొక్క దుర్బల రూపమునకు 'ఆన' చేర్చుటచే నేర్పడును.

ఉదా॥ ఇయాన'; దుహాన', ద్విషాణ', లిహాన', ......

ఆస్ యొక్క ఆత్మనేపద ఆసమాపకక్రియ ఆసీన (ఇది విశేషరూపము)

సూచనలు :—

(1) అర్వాచీన వాఙ్మయములోని ఆకారాంతధాతువులు కొన్ని, పరస్మైపదత్ఱ. బహువచనములో 'అన్'కు బదులు 'ఉస్' అను ప్రత్యయము వైకల్పికముగాస్వీకరించుటకలదు. ఇట్టివి యా—> అ'యుః; పా—> అ'పుః; ఖా—> అ'ఖుః; మొదలగునవి. ఇవిగాక కొన్ని హలంతధాతువులును ఈ ధర్మమునే కలిగియున్నవి. ఇట్టివి విద్; చక్ష్; ద్విష్; దుహ్; మృజ్;

(2) ఈ వర్గమునకు చెందిన కొన్ని ధాతువులకు అకారమును చేర్చి (బలీయరూపములకుగాని, బలహీనరూపములకుగాని), అకారాంత ధాతువులుగా మార్చి భ్వాదివర్గము (అ-వర్గము) న చేర్చబడినవి. ఇట్టివి మృజ్ మొదలగునవి.

(3) ఈ వర్గమునకుచెందినధాతువులలో కొలదిమాత్రమే. యా (వంటివి. ఆకారాంతములు) సక్రమ ప్రక్రియను బొందును. ఇతరములు చాలావరకు క్రమరహితముగనే ప్రవర్తించును. కావున వానిని ప్రత్యేకముగా వివరించుట యవసరము.

## ధాతువర్గము యొక్క విశేషములు

**7 15** (అ) మృజ్‌కు బలీయరూప ప్రకృతులలో గుణమునకుబదులు వృద్ధి యగును. ఇట్లు మా'ర్ష్మి; అమార్జమ్; అ'మార్ట్; (ఈ ధాతువునకు ఇతరకాల

ప్రక్రియలయందును, జనన ప్రక్రియయందును, ఈ విధముగనే గుణమునకు బదులు వృద్ధియగును )

(అ) ఉకారాంతధాతువులకు, హలాదిప్రత్యయములకుముందు, బలీయ ప్రకృతులలో గుణమునకు మారుగా వృద్ధివచ్చును.

ఉదా॥ స్తు——>స్తౌ'మి; అస్తౌత్ ... (కాని అ'స్తవమ్; స్త'వాని యను రూపములునుగలవు)

ఇట్టి ధర్మములుగల ధాతువులు క్ష్ను; యు (కలపు); సులేక సూ, స్ను; స్తు; స్ను; ను; రు; హ్ను; . . . . .

(ఇ) శీ (పరుండు) అనుధాతువు అన్నిరూపములలోను గుణీకరణమును బొందును. ఉదా॥ శ'యే; శేషే; శయాయ; శ'యాన (ఇదిగాక. 3వ. బ.లో శే'రతే; శే'రతామ్; అ'శేరత; మొదలగు రూపములునుగలవు)

(ఈ) కొన్ని కొన్ని ధాతువుల బలీయరూపములలోను దుర్బల రూపములలోనుగూడ ఒకేచోట ఉదాత్తస్థానముండును. (ధాతువులోని అచ్చుపై) ఇవి సాధారణముగా (i) దీర్ఘస్వరముతో మొదలగు ధాతువులు ఆస్; ఈడ్; ఈర్, ఈశ్ మొదలగునవి (ii) చక్ష్; తక్ష్; త్రా; నిన్స్; వస్ (దుస్తులు ధరించు) శిఞ్జ్; శీ (పరుండు); సూ. పై వానిలో తక్ష్; త్రా, లు తప్ప మిగిలిన వన్నియును సాధారణముగా పరస్మైపదముకానే ప్రక్రియను బొందును.

(ఉ) రుద్; (ఏడ్చు); స్వప్ (నిద్రించు): అన్ (ఊపిరిపీల్చు); శ్వస్ (ఊదు) ఈ ధాతువులకు హలాది ప్రత్యయములకుముందు. 'ఇ' యను పొడివచ్చును ఐతే, ద్వితీయ, తృతీయపురుషలలో అపరోక్ష భూతార్థకమున మాత్రము 'ఇ'కు బదులుగా 'అ'గాని 'ఈ'గాని రావచ్చును.

ఉదా॥ స్వ'పిమి; శ్వసిషి; అ'నితి; ... ఆనత్ లేక ఆ'సీత్; ...

(ఊ) బ్రూ (పలుకు) వాఙ్మయములో చాలా విరివిగావచ్చును. ఇది బలీయరూపములలో, హలాది ప్రత్యయములతో 'ఈ' అను పొడితో చేరును.

ఉదా॥ బ్ర'వీమి, బ్ర'వీషి, బ్ర'వీతి, అ'బ్రవీః, అబ్రవీత్, ... ...

కాని బలహీనరూపములలో అజాది ప్రత్యయములకు ముందు ఇది రాదు.

(ఐతే బ్రూమ'ః; బ్రూయా'మ్, అబ్రవమ్, అబ్రువన్, బ్రూయాత్; మొదలగు రూపములును గలవు)

(ఋ) ఉకారాంత ధాతువులుకొన్ని బ్రూవలెననే ప్రక్రియను బొందును ఇట్టివి కు; తు; రు; స్తు :

(ౠ) ఈ వర్గమునకు చెందిన ధాతువులుకొన్ని బలహీనరూపములో సంకోచమును పొందును. ఇట్టివానిలో అస్ (ఉండు) ముఖ్యమైనది. ఇది వాఙ్మయములో చాలా విరివిగా కనుపించును. ఇది బలహీనరూపములో 'అ'ను కోల్పోయి కేవలము 'స్'గా మిగులును (ఉపచయముతో చేరినపుడు తప్ప) సూచకార్థకమున దీనిద్వి. ఏకవచనరూపము అసి (అస్సికిబదులు); ఆజ్ఞార్థకమున 'ఏధి' (అస్థికిబదులు); ద్వి. తృ అపరోక్షభూతార్థకమున 'ఈ' యను పొడిని స్వీకరించును. ఇది పరస్మైపదములోనే ప్రక్రియను బొందును. దీని ప్రక్రియ నీ క్రింద పొందుపరచనైనది.

| | 1. సూచకార్థకము | | | 2. విధ్యర్థకము | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అ'స్మి | స్వ'ః | స్మ'ః | స్యా'మ్ | స్యా'వ | స్యా'మ |
| 2 | అ'సి | స్థ'ః | స్థ | స్యా'ః | స్యా'తమ్ | స్యా'త |
| 3 | అ'స్తి | స్త'ః | స'న్తి | స్యా'త్ | స్యా'తామ్ | స్యు'ః |
| | **3. ఆజ్ఞార్థకము** | | | **4. అపరోక్షభూతార్థకము** | | |
| 1 | అ'సాని | అ'సావ | అ'సామ | ఆ'సమ్ | ఆ'స్వ | ఆ'స్మ |
| 2 | ఏధి' | స్త'మ్ | స్త' | ఆ'సీః | ఆ'స్తమ్ | ఆ'స్త |
| 3 | అ'స్తు | స్తా'మ్ | స'న్తు | ఆ'సీత్ | ఆ'స్తామ్ | ఆ'సన్ |

అసమాపక క్రియ : పుం. స'న్త్; స్త్రీ సతీ'

సూచన :– ఇది, అర్వాచీన వాఙ్మయములో (అనగా కావ్య, నాటక, పురాణాది వాఙ్మయములో) ఆత్మనే పద ప్రత్యయములతోగూడా ప్రయోగింప బడుట కాననగును. కాని దీని నిజరూపము పరస్మై పదియే. ఈ గందర గోళము గౌణ ప్రక్రియయందును కాననగును.

(ఔ) హన్‌యొక్క ప్రక్రియ, అన్ అంతమునగల న
సుబంత ప్రక్రియవలెనే యుండును. బలహీనరూపములలో హలాద
లకుముందు (మ్, వ్‌లు తప్ప) దీనిలోని నకారము లోపించును—
తప్ప. అజాది ప్రత్యయములకు ముందు దీనిలోని అకారములోప
నకారములు గలిసి 'ఘ్న'గా మారును. ఉదా॥

| | సూచకార్థకము. | | | అపరోక్షభూత | |
|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి |
| 1 | హ'న్మి | హన్వ'ః | హన్మ'ః | అ'హనమ్ | అ'హన |
| 2 | హ'న్సి | హథ'ః | హథ' | అ'హన్ | అ'హత |
| 3 | హ'న్తి | హత'ః | ఘ్న'న్తి | అ'హన్ | అ'హత |

అసమాపక క్రియ. పుం. ఘ్నన్త్; స్త్రీ ఘ్నతీ'

సూచన :– ఆజ్ఞార్థకమున 2వ. ఏకవచనమున 'జహి' యగును.
మును చెందిన ధాతువుకువలె) బ్రాహ్మణములలో నీ ధాతువు ఆత్మ
మున బహుళవ్యాప్తి నొందినది.

(ఏ) వశ్ (ఆతృతజెందు. be eager) బలహీనరూపములల
మును బొంది 'ఉశ్'గా మారును (సంప్రసారణముచే).

ఉదా॥ ఉశ్మ'సి; ఉశ'న్తి; ఉశ'న్త్; ఉశా'న.

(ఐ) శాస్ (శాసించు) పునర్ద్విత్వమును బొందిన ధాతువుల
కొన్నిటిని గలిగియున్నది. ఇట్లు, ఇది తృ. బహువచనములన్ని
ప్రత్యయములోనున్న నకారమును కోల్పోవును. దీని ఆత్మనే పదప్ర
బద్ధముగా నుండును.

(ఓ) పునర్ద్విత్వమును బొందిన కొన్ని ధాతువులు, ఈ
చెందినవిగా భావింపబడుచున్నవి. ఇట్టివి జాగృ, దరిద్రా, వేవీ, ద
మొదలగునవి

VI పునర్ద్విత్వవర్గము (3వ లేక జుహోత్యాదివర్గము)

**7.16** ఈ వర్గములోని ధాతువుల వర్తమానకాల ప్రకృతులు పున
నేర్పడును. ఈ వర్గమునకు చెందినవి వాఙ్మయములో మొత్తము స

ధాతువులు మాత్రము కన్పించును. వీనిలో ఇంచుమించు 16 మాత్రమే ఆధునిక వాఙ్మయమున కనుపించును.

పునర్ద్విత్వమునకు సాధారణ సూత్రములు 6,10 (అ) లో నివ్వబడినవి. అవిగాక, ఈ వర్గధాతువులకు ప్రత్యేకముగా వర్తించు సూత్రము లీ క్రింద నీయబడినవి. (వర్తమానకాల ప్రకృతులేర్పడుటకు)

(అ) ధాతువులోనున్న దీర్ఘాచ్చు పునర్ద్విత్వాక్షరమున హ్రస్వమగును. ఉదా॥ దా—> దదా, భీ—> బిభీ, హూ—> జుహూ ఐతే 'ఋ' పునర్ద్విత్వములో నెచ్చటనురాదు. దీనికి బదులు ఇకారము వచ్చును. ఉదా॥ భృ—> బిభృ, పృచ్—> పిపృచ్, ... ఈ వర్గమునకు జెందిన ధాతువులలో ఋకారము మొదటగా గల ధాతువు ఋ (పోవు) ఇది పునర్ద్విత్వమునుబొంది 'ఇయర్' అగును. (ను-వర్గమునకు జెందిన ఒక ధాతువు ఋ ఉన్నది—ద్యామ్ ఋణోతి. ఇది యదియేనా?)

(ఆ) అనకారాంత ప్రకృతుల సామాన్యధర్మముగా, ఈ వర్గధాతు ప్రకృతుల యందును బలీయ, దుర్బల భేదములుండును. బలీయ ప్రకృతులతో ఉదాత్తములేని ప్రత్యయములు చేరును. దుర్బల ప్రకృతులతో ఉదాత్తమున్న ప్రత్యయములు చేరును. బలీయ ప్రకృతులలోని ధాతువుయొక్క అచ్చు గుణీకరణమును బొందును

ఉదా॥ హు—> బలీయప్రకృతి జుహో, దుర్బలప్రకృతి జుహు,
భీ—> ,, బిభే, ... బిభీ,

సూచన:— సాధారణ సూత్రముల ననుసరించి, బలీయ ప్రకృతిలోని ఉదాత్తము, గుణీకరణమును బొందిన ధాతుస్వరముపై నుండవలయునుగదా! ఐతే ఈ ధర్మము బహుకొలది ధాతువులకు మాత్రమే (ఈ వర్గమునకు చెందినవి) ఉన్నది. ఇవి హు, భీ, మద్, చి, భృ.

ఇతర ప్రకృతుల బలీయరూపములపై ఉదాత్తము, పునర్ద్విత్వాక్షరముపై నుండును. దీనికి కారణము తెలియదు.

(ఇ) ఈ వర్గముయొక్క ముఖ్యగుణము, ఉభయపదములలో. తృతీయ పురుష బహువచన ప్రత్యయములలోని నకారము లొపించుట. అపరోక్షభూతార్ధ

కమున 'అన్' కు బదులు 'ఉస్' వచ్చి, దీనికి ముందున్న ధాతువులోని చివరి యచ్చు గుణీకరణమును బొందును.

(ఈ) ఉదా॥ ధాతువు హు దీని బలీయ ప్రకృతి జుహో', దుర్బల ప్రకృది జుహు లేక జు'హు

1. సూచకార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | జుహో'మి | జుహువః | జుహుమ'ః | జుహ్వే' | జుహువ'హే | జుహుమ'హే |
| 2 | జుహో'షి | జుహుథ'ః | జుహుథ' | జుహుషే' | జుహ్వా'థే | జుహుధ్వే' |
| 3 | జుహో'తి | జుహుత'ః | జు'హ్వతి | జుహుతే' | జుహ్వా'తే | జు'హ్వతే |
| | ధాతువు భృ : బలీయప్రకృతి బి'భర్, దుర్బలము బి'భృ | | | | | |
| 1 | బి'భర్మి | బిభృవ'ః | బిభృమ'ః | బి'భ్రే | బిభృవ'హే | బిభృమ'హే |
| 2 | బి'భర్షి | బిభృథ'ః | బిభృథ' | బిభృషే | బి'భ్రాథే | బిభృధ్వే |
| 3 | బి'భర్తి | బిభృతః | బి'భ్రతి | బిభృతే | బి'భ్రాతే | బి'భ్రతే |

సూచన:— పై పదములలోని ఉదాత్తస్థానమును గమనించదగును

2. విధ్యర్థకము

ధాతువు బలహీనరూపమున నుండును. మామూలుగా వచ్చు ప్రత్యయములే చేరును. ఇది చాలా సక్రమపద్ధతిని నడచును గాన రూపావళి నంతయు ఉటంకించ పనిలేదు. ప్రథమపురుష రూపములు.

| పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|
| ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| జుహుయా'మ్ | జుహుయా'వ | జుహుయా'మ | జు'హ్వీయ | జు'హ్వీవహి | జు'హ్వీమహి |

3. ఆజ్ఞార్థకము

పరస్మై. ద్వి ఏవచనమున ప్రకృత్యంతము హల్లైనచో 'ధి', అచ్చైనచో 'హి'. (ఐతే రెండు మార్లు హకారము వచ్చుట నివారించుటకు కాబోలు 'జుహుధి' యను రూపము కాన్పించును.)

| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|---|
| 1 | జుహ'వాని | జుహ'వావ | జుహ'వామ | జుహ'వై | జుహ'వావహై | జుహ'వామహై |
| 2 | జుహుధి' | జుహుత'మ్ | జుహుత' | జుహుస్వ' | జు'హ్వాథామ్ | జుహుధ్వ'మ్ |
| 3 | జుహో'తు | జుహుతా'మ్ | జు'హ్వతు | జుహుతా'మ్ | జు'హ్వాతామ్ | జు'హ్వతామ్ |

4. అపరోక్షభూతార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అ'జుహవమ్ | అ'జుహువ | అజుహుమ | అ'జుహ్వి | అ'జుహువహి | అ'జుహుమహి |
| 2 | అ'జుహోః | అ'జుహుతమ్ | అ'జుహుత | అ'జుహుథాః | అ'జుహ్వాథామ్ | అ'జుహుధ్వమ్ |
| 3 | అ'జుహోత్ | అ'జుహుతామ్ | అ'జుహవుః | అ'జుహుత | అ'జుహ్వాతామ్ | అ'జుహ్వత |

సూచన :- భృ కు పరస్మైపదిలో ద్వి. తృ ఏకవచనములలో అ'బిభర్ అగును (పదమునకు చివర ఒకేహల్లు ఉండవలయునుగాన స్,త్‌లు లోపించును)

ఇట్లే ప్రకృతి బలీయరూపమున హలంతమైనపుడును స్, త్‌లు లోపించును.

అసమాపక క్రియలు. పుం. జు'హ్వత్; బిభ్రత్; ... స్త్రీ, జుహ్వతీ, బిభ్రతీ, ...

(ఉ) పునర్ద్విత్వ వర్గప్రక్రియలో విశేషరూపములు.

(1) ఋకారము అచ్చుగాగల ధాతువులు—ఋ, ఘృ, తృ, పృ, భృ, సృ, హృ, పృచ్—కాక ఈక్రింద నుదహరించిన, అకారముగాని ఆకారముగాని గల ధాతువులు పునర్ద్విత్వాక్షరముగా ('అకు' బదులు) 'ఇ'ను స్వీకరించును.

గా (పోవు), మా (కొలుచు), మా (ఊదు), శా లేక హా (తీసివేయు, remove), వచ్. సచ్, వశ్.

ఇవిగాక స్థా, పా (త్రాగు), ఘ్రా, హన్, హా విషయమున అధిక విశేషములు గలవు (చూ॥ 7.16 (ఉ) (2))

ఇట్లు శా (పదునుచేయు) శిశాతి; శిశీమసి, శిశీహి'

(శిశాధికూడను) శిశాతు, శి'శేతే. శిశీత మొదలగురూపములు లభించును.

మా(కొలుచు, అరచు)—> మిమాతి. మిమీయాత్, మిమీతే అ'మిమీత, మిమీహి, మిమాతు ... ...

హా (తీసివేయు) —> జి'హీతే, జిహీధ్వే; జి'హతే జిహీష్వ, జిహతామ్, అజిహిత ... .... జహీహి అనురూపమును కలదు.

ఇక్షే ఇతరములును.

(2) ఈ వర్గమునకు చెందవలసిన కొన్ని ధాతువులు కాలక్రమమున ఆ-వర్గము (1వ లేక భ్వాదివర్గమున) చేరిపోయినవి. వీనిని పునర్ద్విత్వముజేసి, అకారాంత ప్రకృతులుగా పరిగణించి, భ్వాదులకువలనే ప్రక్రియనడపుదురు ఇట్టివి (1) లో జెప్పబడిన స్థా, పా, ఘ్రా, హన్. వీనివర్తమాన కాల ప్రకృతులు వరుసగా తిష్ఠ, పిబ, జిఘ్రా, జిఘ్న వీని ప్రక్రియ భ్వాదివర్గ ప్రక్రియ వలెనే.

(3) పునర్ద్విత్వమును పొందిన కొన్ని ధాతువులను మూలధాతువులుగా పరిగణించి వైయాకరణులు ధాతువర్గమున (2వ. అదాదివర్గము) చేర్చిరి. ఇట్టివి జాగృ, దరిద్రా, వేవీ, దీధీ, చకాస్.

(4) ఈ వర్గమునకు చెందిన ధాతువులలో అత్యంత వ్యాప్తిగల్గినవి దా ధా. వీనిబలహీనరూప ప్రకృతులు దద్, దధ్. పరస్మై. 2వ ఏకవచనమున వీని వరుసగా దేహి', ధేహి'యగును. దీనిలోని రెండవ ప్రకృతియంతమున నున్న ధ్, ప్రత్యయమునకు మొదటనున్న త్, థ్, స్, ధ్వలతో కలిసినపుడు ([illegible] సంధిసూత్రములచే) దానిలోని ఘోషీకరణము (aspiration) ధాతువుయొక్క మొదటికివచ్చి చేరును. ఇట్లు దీని ప్రక్రియ.

1. సూచకార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | దదామి | దద్వః | దద్మః | దధే' | ద'ధ్వహే | ద'ధ్మహే |
| 2 | దదాసి | ధత్థః | ధత్థ' | ధత్సే' | దధా'థే | దద్ధ్వే |
| 3 | దదాతి | ధత్తః | ధధ'తి | ధత్తే' | దధా'తే | ద'ధతే |

2. విధ్యర్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | దధ్యా'మ్ | దధ్యా'వ | దధ్యామ | దధీయ | ద'ధీవహి | ద'ధీమహి |
| 2 | — | — | — | — | — | — |
| 3 | — | — | — | — | — | — |

3. ఆజ్ఞార్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | దధాని | ద'ధావ | ద'ధామ | ద'ధై | ద'ధావహై | ద'ధామహై |
| 2 | ధేహి | ధత్త'మ్ | ధత్త' | ధత్స్వ | దధాథామ్ | దద్ధ్వమ్ |
| 3 | దధాతు | ధత్తా'మ్ | ద'ధతు | ధత్తామ్ | దధాతామ్ | దధతామ్ |

### 4. అపరోక్ష భూతము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | అ'దధామ్ | అ'దధ్వ | అ'దధ్మ | అ'దధి | అ'దధ్వహి | అ'దధ్మహి |
| 2 | అ'దధాః | అ'ధత్తమ్ | అ'ధత్త | అ'ధత్థాః | అ'దధాథామ్ | అద'ద్ధ్వమ్ |
| 3 | అ'దధాత్ | అ'ధత్తామ్ | అ'దధుః | అ'ధత్త | అ'దధాతామ్ | అ'దధత |

అసమాపక క్రియలు : పరస్మై, ద'ధత్; ఆత్మనే, ద'ధాన

సూచన :— దా యొక్కయు ప్రక్రియపై విధముననే జరుగును.

ధాతువులోని ధకారమునకు బదులు దకారము వచ్చుచుండును.

(5) భస్ (నమలు) యొక్క బలహీన ప్రకృతి రూపము 'బప్స్' :

ఇట్లు బ'ప్సతి; బ'ప్సత్ మొదలగు రూపములు గూడ గలవు.

(6) భీ (భయపడు) యొక్క దుర్బల ప్రకృతిలో ధాతువులోని యచ్చు హ్రస్వమగును. ఇది వైకల్పికము.

## VII అనునాసికావర్గము (7వ వర్గము లేక రుధాదివర్గము)

**7.17** ఈ వర్గమునకు చెందిన ధాతువులన్నియు హలంతములే. ఈ వర్గ చిహ్నముగా, ధాతువుచివరనున్న హల్లునకు పూర్వమున, దానియనురూపమగు అనునాసికము వచ్చును. ఇది బలీయ ప్రకృతులలో 'న'గా మారును. ఇట్లు

రుధ్——> రున్ధ్: బలీయప్రకృతి 'రుణధ్'

యుజ్——> యుఞ్జ్; బలీయప్రకృతి 'యునజ్'

వీనిరూపావళి ఈ క్రింద నీయబడినది.

(సంధిప్రక్రియలో ధకార, జకారములు పొందుమార్పులను గుర్తునందుంచు కొనవలయును.)

### 1. సూచకార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | రుణ'ధ్మి | రున్ధ్వ'ః | రున్ధ్మ'ః | రున్ధే' | రున్ధ్వ'హే | రున్ధ్మ'హే |
| 2 | రుణ'త్సి | రున్ద్ధ'ః | రున్ద్ధ' | రున్త్సే' | రున్ధా'థే | రున్ద్ధ్వే' |
| 3 | రుణ'ద్ధి | రున్ద్ధ'ః | రున్ధ'న్తి | రున్ద్ధే' | రున్ధా'తే | రున్ధ'తే |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | యున'జ్మి | యుఞ్జ్వ'ః | యుఞ్జ్మ'ః | యుఞ్జే' | యుఞ్జ్వ'హే | యుఞ్జ్మ'హే |
| 2 | యున'క్షి | యుఙ్క్థ'ః | యుఙ్క్థ' | యుఙ్క్షే' | యుఞ్జా'థే | యుఙ్గ్ధ్వే' |
| 3 | యున'క్తి | యుఙ్క్త'ః | యుఞ్జ'న్తి | యుఙ్క్తే' | యుఞ్జా'తే | యుఞ్జ'తే |

సూచన:- యుఙ్క్థః; యుఙ్గ్ధ్వే, మొదలగువానికిబదులు (ఆజ్ఞార్థకములో, అపరోక్షభూతములోగూడను) యున్థః, యున్ధ్వే; ... అని వ్రాయుటయు కలదు. [చూ॥ 2.15, I, (3)]

2. విధ్యర్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | రున్ధ్యా'మ్ | రున్ధ్యా'వ | రున్ధ్యా'మ | రున్ధీ'య | రున్ధీవ'హి | రున్ధీమ'హి |
| 2 | రున్ధ్యా'ః | రున్ధ్యా'తమ్ | రున్ధ్యా'త | రున్ధీథా'ః | రున్ధీయా'థామ్ | రున్ధీధ్వ'మ్ |
| 3 | రున్ధ్యా'త్ | రున్ధ్యా'తామ్ | రున్ధ్యు'ః | రున్ధీత' | రున్ధీయా'తామ్ | రున్ధీర'న్ |

ఇట్లే

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | యుఞ్జ్యా'మ్ | యుఞ్జ్యా'వ | యుఞ్జ్యా'మ | యుఞ్జీయ' | యుఞ్జీవ'హి | యుఞ్జీమ'హి |
| 2 | — | — | — | — | — | — |
| 3 | — | — | — | — | — | — |

3. ఆజ్ఞార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | రుణ'ధాని | రుణ'ధావ | రుణ'ధామ | రుణ'ధై | రుణ'ధావహై | రుణ'ధామహై |
| 2 | రున్ద్ధి' | రున్'ద్ధమ్ | రున్ద్ధ' | రున్త్స్వ' | రున్ధా'థామ్ | రున్ద్ధ'ధ్వమ్ |
| 3 | రుణ'ద్ధు | రున్ద్ధా'మ్ | రున్ధ'న్తు | రున్ద్ధా'మ్ | రున్ధా'తామ్ | రున్ధతా'మ్ |

4. అపరోక్షభూతార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అ'రుణధమ్ | అ'రున్ధ్వ | అ'రున్ధ్మ | అ'రున్ధి | అ'రున్ధావహి | అ'రున్ధామహి |
| 2 | అ'రుణత్ | అ రున్ద్ధమ్ | అ'రున్ద్ధ | అ'రున్ద్ధాః | అరున్ధాథామ్ | అ'రున్ద్ధ్వమ్ |
| 3 | అ'రుణత్ | అ'రున్ద్ధామ్ | అ'రున్ధన్ | అ'రున్ద్ధ | అ'రున్ధాతామ్ | అ'రున్ధత |

అసమాపక క్రియలు

పరస్మై పుం. రున్ధ'న్త్ : స్త్రీ. రున్ధతీ' : పుం. యుఞ్ జ'న్త్ : స్త్రీ యుఞ్ జతీ'

ఆత్మనే రున్ధాన యఞ్ జాన.

VIII ను-వర్గము; ఉ-వర్గము (వరుసగా 5వ, 8వ వర్గములు స్వాది, తనాది వర్గములు)

**7 18** ను-వర్గముయొక్క వర్తమానకాల ప్రకృతి, ధాతువునకు 'ను' అను అక్షరమును కలుపుటచే నేర్పడును. బలీయ ప్రకృతులలో దీనిపై ఉదాత్తమువచ్చి 'నో' గా మారును.

ఉ-వర్గమునకు చెందిన ధాతువులు (బహుస్వల్పము) నకారముతో అంత మగును. దానికి 'ఉ' కలుపుటచే 'ను' అగును. అందుచే ఒక విధముగా ను-వర్గమునకు చెందినదే యగును. (దీనికి అపవాదముగా కృ ధాతువు ఈ వర్గమునకు చెందినది. చాలా క్రమరహితమగు ప్రక్రియను బొందును) ఈ రెండు వర్గముల క్రియాప్రక్రియ యు ఒకటే గావున విడివిడిగా వివరింపబనిలేదు.

దీనిలోని ఒక ముఖ్య విషయమేమనగా— ను వర్గములోని ప్రకృత్యంత మున ఉకారము, ప్రత్యయాది యందుగల వ మ లకు ముందు (ప్రథమ పురుష ద్వి, బహువచనములలో) వదలివేయబడును ఈ సంకోచము సర్వసాధారణము. అజాది ప్రత్యయములకు ముందున్న ఉకారము ఒక హల్లుతో కలిసి యుండిన 'వ్' గను, రెండు హల్లులతో కలిసి యుండిన 'ఉవ్' గను మారును అనగా ఉచ్చారణకు వీలులేకుండునట్లు మూడు హల్లులు కలిసిననేతప్ప అది వకారముగా మారును

రూపావళి

సూచకార్థకము

I ను-వర్గమునకు చెందిన ధాతువు సు (బైటికినెట్టు). దీని బలీయ ప్రకృతి సునో'; బలహీనరూపము సును

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | సునో'మి | సునువ'ః<br>సున్వ'ః | సునుమ'ః<br>సున్మ'ః | సునువే' | సునువ'హే<br>సున్వహే | సునుమ'హే<br>సున్మహే |
| 2 | సునో'షి | సునుథ'ః | సునుథ' | సునుషే' | సున్వా'థే | సునుధ్వే' |
| 3 | సునో'తి | సునుత'ః | సున్వన్తి | సునుతే' | సున్వా'తే | సున్వ'తే |

II ఉ వర్గము ధాతువు తన్ (విస్తరించు, లాగు) ప్రకృతియొక్క బలీయ రూపము 'తనో'; బలహీనరూపము 'తను'

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | తనో'మి | తన్వ'ః | తన్మ'ః | తన్వే' | తన్వ'హే | తన్మ'హే |
| 2 | — | — | — | — | — | — |
| 3 | — | — | — | — | — | — |

దీని ప్రక్రియయు పైదానివలెనే యుండును గాన ప్రత్యేకముగా వివరించ బని లేదు.

## 2. విధ్యర్థకము

మామూలుగా విధ్యర్థప్రత్యయములు బలహీన ప్రకృతికి అతికించబడును.

ఇటు

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | సునుయా'మ్ | సునుయా'వ | సునుయా'మ | సున్వీయ' | సున్వీవ'హి | సున్వీమ'హి |
| 2 | — | — | — | — | — | — |
| 3 | — | — | — | — | — | — |

## 3. ఆజ్ఞార్థకము

సాధారణముగా ఈ వర్గముయొక్క ఆజ్ఞార్థక ప్రక్రియ ఇతర ధాతువులకు వలెనే యుండును. పరస్మైపదములో ద్వితీయా, ఏకవచనమున హలంత ప్రకృతులకు 'హి' కలుపుదురు. లేనిచో ప్రత్యయమేమియును లేకయే విడిచి వేయబడును. ఉదా॥

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | సున'వాని | సున'వావ | సున'వామ | సున'వై | సున'వావహై | సున'వామహై |
| 2 | సును' | సునుత'మ్ | సునుత' | సునుష్వ' | సున్వా'థామ్ | సునుధ్వ'మ్ |
| 3 | సునో'తు | సునుతా'మ్ | సున్వ'న్తు | సునుతా'మ్ | సున్వా'తామ్ | సున్వ'తామ్ |

ఆప్ యొక్క 2వ, ఏ, పరస్మైపదము ఆప్నుహి'
అశ్ ,, ,, అశ్నుహి'
ధృష్ ,, ,, ధృష్ణుహి'

ఆప్ నుండి పుట్టిన రూపములు ఆప్నువ'న్తు, ఆప్నువా'థామ్, ఆప్నువా'తామ్; అప్నువ'తామ్ మొదలగురూపములు గూడా కలవు.

4. అపరోక్షభూతార్థకము

దీని ప్రక్రియమామూలే

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అ'సునవమ్ | అ'సునువ<br>అ'సున్వ | అ'సునుమ<br>అ'సున్మ | అ'సున్వి | అ'సునువహి<br>అ'సున్వహి | అ'సునుమహి<br>అ'సున్మహి |
| 2 | అ'సునోః | అ'సునుతమ్ | అ'సునుత | అ'సునుథాః | అ'సున్వాథామ్ | అ'సునుధ్వమ్ |
| 3 | అ'సునోత్ | అ'సునుతామ్ | అ'సున్వన్ | అ'సునుత | అ'సున్వాతామ్ | అ'సున్వత |

అసమాపక క్రియలు

సు——> పరస్మై. పుం. సున్వ'న్త్; స్త్రీ. సున్వతీ' : ఆత్మనే: సున్వాన'
తన్——> ,, తన్వ'న్త్ ; తన్వతీ' ; తన్వాన'
ఆప్——> ,, ఆప్నువ'న్త్ : ఆప్నువన్తీ' : ఆప్నువాన'

ను—ఉ వర్గములలోని విశేషరూపములు.

(అ) శ్రు, ప్రయోగములో సంకోచమునుబొంది శృయగును. దీని బలీయ ప్రకృతి 'శృణో'' ; దుర్బలప్రకృతి 'శృణు'

(ఆ) ధూ (విడిల్చు) ప్రయోగములో సంకోచమును బొంది 'ధు' యగును.

దీని బలీయరూపము 'ధునో'' ; బలహీనరూపము 'ధును'

(ఇ) వాఙ్మయములో చాలా విరివిగా వచ్చు కృ (లేక కర్). అర్వాచీన వాఙ్మయములో, ఉ-వర్గమున చేర్చబడినది (దీని యంతమున నకారము లేకపోయినను) దీని బలీయప్రకృతి 'కరో' ; బలహీనప్రకృతి 'కురు' వ్వకారా 1వద్వివచనమునను బహువచనమునను; విధ్యర్థకములో యకారమునకుముందును. ఋగ్వేదమున విది ను-వర్గమునకు దీని వర్గచిహ్నమగు ఉకారము లోపించును. దీని ప్రక్రియ ఈ క్రింద సూచింపబడినది. చెందినదిగనే ప్రక్రియను బొందును.

1. సూచకార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | కరో'మి | కుర్వ'ః | కుర్మ'ః | కుర్వే' | కుర్వ'హే | కుర్మ'హే |
| 2 | కరో'షి | కురుథ'ః | కురుథ | కురుషే' | కుర్వా'థే | కురుధ్వే' |
| 3 | కరో'తి | కురుత'ః | కుర్వ'న్తి | కురుతే' | కుర్వా'తే | కుర్వ'తే |

2. విధ్యర్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | కుర్యా'మ్ | కుర్యా'వ | కుర్యా'మ | కుర్వీయ' | కుర్వీవ'హి | కుర్వీమ'హి |
| | — | — | — | — | — | — |
| | — | — | — | — | — | — |

3. ఆజ్ఞార్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | కర'వాణి | కర'వావ | కర'వామ | కర'వై | కర'వావహై | కర'వామహై |
| 2 | కురు | కురుత'మ్ | కురుత' | కురుష్వ' | కుర్వా'థామ్ | కురుధ్వ'మ్ |
| 3 | కరో'తు | కురుతా'మ్ | కుర్వ'న్తు | కురుతా'మ్ | కుర్వా'తామ్ | కుర్వ'తామ్ |

4. అపరోక్ష భూతార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అ'కరవమ్ | అ'కుర్వ | అ'కుర్మ | అ'కుర్వి | అ'కుర్వహి | అ'కుర్మహి |
| 2 | అ'కరోః | అ'కురుతమ్ | అ'కురుత | అ'కురుథాః | అ'కుర్వాథామ్ | అ'కురుధ్వమ్ |
| 3 | అ'కరోత్ | అ'కురుతామ్ | అ'కుర్వన్ | అ'కురుత | అ'కుర్వాతామ్ | అ'కుర్వత |

5. అసమాపకక్రియలు

పరస్మై— పుం. కుర్'వన్; స్త్రీ—కుర్వతీ': ఆత్మనే: కుర్వాణ'

(ఈ) ఈ వర్గమునకు చెందిన కొన్ని ధాతువులు వర్గచిహ్నముతో కలిపి అ-వర్గమున (భ్వాదివర్గమున) చేర్చబడినవి. ఇట్టివి. ఋ; హి; పి;... ...

## IX నా-వర్గము (9వ లేక క్రీవర్గము)

**7.19** ఈవర్గమునకు చిహ్నము బలీయప్రకృతులలో ఉదాత్తసహితమగు నా'; బలహీన ప్రకృతులలో 'నీ'. ఐతే అజాది ప్రత్యయములకు ముందు దీనిలోని ఈకారము లోపించి కేవలము 'న్'మాత్రము మిగులును.

ఇట్లు

క్రీ—> బలీయ ప్రకృతి క్రీణా'; బలహీనప్రకృతి క్రీణీ, ఇది అజాది ప్రత్యయములకు ముందు ఈకార లోపముచే 'క్రీణ్' అగును.

దీని ప్రక్రియ

1. సూచకార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | క్రీణా'మి | క్రీణీవ'ః | క్రీణీమ'ః | క్రీణే' | క్రీణీవ'హే | క్రీణీ'మహే |
| 2 | క్రీణా'సి | క్రీణీథ'ః | క్రీణీథ' | క్రీణీషే' | క్రీణా'థే | క్రీణీధ్వే' |
| 3 | క్రీణాతి | క్రీణీత'ః | క్రీణ'న్తి | క్రీణీతే' | క్రీణా'తే | క్రీణ'తే |

2. విధ్యర్థకము

ఇది చాలా క్రమబద్ధముగా నుండునుగాన రూపముల నన్నిటినీయ పని లేదు.

1 క్రీణీయా'మ్ క్రీణీయా'వ క్రీణీయా'మ క్రీణీయ' క్రీణీవ'హి క్రీణీమ'హి ... ... వగైరా.

3. ఆజ్ఞార్థకము

పరస్మైపదిలో 2వ, ఏకవచనమున అజంతధాతువులకు మామూలుగా 'హి' ప్రత్యయము వచ్చును. ఐతే హలంత ప్రకృతులకు మాత్రము 'ధి' నిషేధింపబడినది దీనికి మారుగా 'ఆన'' యను ప్రత్యయము వచ్చును. ఉదా॥ అశాన', బధాన', గృహాణ', స్తభాన', ఇషాణ', ముషాణ',

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | క్రీణా'ని | క్రీణా'వ | క్రీణా'మ | క్రీణై' | క్రీణా'వహై | క్రీణా'మహై |
| 2 | క్రీణీహి' | క్రీణీత'మ్ | క్రీణీత' | క్రీణీష్వ' | క్రీణాథామ్ | క్రీణీధ్వ'మ్ |
| 3 | క్రీణా'తు | క్రీణీతామ్ | క్రీణ'న్తు | క్రీణీతామ్ | క్రీణా'తామ్ | క్రీణ'తామ్ |

4. అపరోక్షభూతార్థకము

దీనిలోని విశేషమేమియు లేదు ప్రక్రియయంతయును సక్రమముగా నడచును.

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అ'క్రీణామ్ | అ'క్రీణీవ | అ'క్రీణీమ | అ'క్రీణి | అ'క్రీణీవహి | అ'క్రీణీమహి |
| 2 | అ'క్రీణాః | అ'క్రీణీతమ్ | అ'క్రీణీత | అ'క్రీణీథాః | అ'క్రీణాథామ్ | అ'క్రీణీధ్వమ్ |
| 3 | అ'క్రీణాత్ | అ'క్రీణీతామ్ | అ'క్రీణన్ | అ'క్రీణీత | అ'క్రీణాతామ్ | అ'క్రీణత |

5. అసమాకక్రియ పరస్మై పుం. క్రీణ'న్త్ : స్త్రీ. క్రీణతీ'

ఆత్మనే : క్రీణాన'.

నా'- వర్గముయొక్క విశేషరూపములు.

(అ) ఈవర్గమునకు చెందిన ఊకారాంత ధాతువులు సంకోచమును బొంది ఉకారాంతములగును. ఉదా॥ పూ (పవిత్రముచేయు) —> పునా'తి, పునీతే' ... ఇట్లే జూ, ధూ, లూ, ...

(ఆ) గ్రభ్, గ్రహ్ లు సంకోచమునుబొంది గృభ్, గృహ్ లగును.

(ఇ) ఈ వర్గమునకుజెందిన జ్ఞాలోని యనునాసికము, వర్గచిహ్నమగు నా' కు ముందు లోపించును. ఇట్లు జ్ఞా—> జానా'తి, జానితే, ...

(ఈ) ఈ వర్గధాతువులు కొన్ని వర్గ చిహ్నముతో సహా అ'-వర్గములో చేర్పబడి వానివలెనే ప్రక్రియను బొందును. ఇట్టివి వేదమున గూడను.

మి—> మినతి, మినత్, అమినన్త

పృ—> పృణ', మృ—> మృణ', ...



# 8. పరోక్ష భూతకాలము (Perfect Tense)

**8.1** పరోక్షభూతకాలమునకు సంబంధించి, అర్వాచీన వాఙ్మయమున కేవలము, సూచకార్థకము, అసమాపకక్రియయు లభించుచున్నవి. ఇవి ఉభయ పదముల కును జెందినవి. ఐతే ప్రాచీన వాఙ్మయమున దీనికి సంబంధించిన భావార్థకములు, అపరోక్ష భూతార్థకమును ఉండి, వర్తమానకాల క్రియాప్రక్రియవలెనే, ఇది చాలా విపులముగా నుండును. ఈ గ్రంథమున అర్వాచీన వాఙ్మయమునకు సంబంధిం చిన క్రియాప్రక్రియమాత్రము చర్చించబడును.

పరోక్షభూతకాలము అన్ని ధాతువులకును ఒకేవిధముగా నేర్పడును. వానిలోని వర్గభేదములచే నీ ప్రక్రియ భేదించదు.

దీని ముఖ్యధర్మములు.

I ధాతువుయొక్క పునర్ద్విత్వముచే ప్రకృతి ఏర్పడును.

II ప్రకృతిలో బలీయ, దుర్బల భేదములు. బలీయ ప్రకృతులు పరస్మైపద ఏకవచనమునను (అన్ని పురుషలలోను) దుర్బల ప్రకృతులు ఇతరత్ర వాడబడును.

III దీని ప్రత్యయములు వర్తమానకాల ప్రత్యయములు గాక ప్రత్యే కముగా నున్నవి.

IV ప్రకృతికి హలాది ప్రత్యయముల నతుకుటకు (ముఖ్యముగా అర్వాచీన వాఙ్మయమున) 'ఇ' అను పొడి వాడబడుచున్నది. వీని నొక్కొక దానిని ప్రత్యేకముగా వివరించుదుము.

**8.2** I పునర్ద్విత్వము

(1) హలాది ధాతువుల పునర్ద్విత్వము, వర్తమానకాల క్రియాప్రక్రి యలో 3వ వర్గమునకు (జుహోత్యాదివర్గమునకు) చెందిన ధాతువులకు వలెనే ఏర్పడును. ఐతే ఒక భేదము మాత్రము ఉన్నది. ఏమనగా ధాతువులో నుండు అచ్చు అ ఆ, ఋ (లేక అర్) ఐన పునర్ద్విత్వాక్షరములోని యచ్చు 'అ' యగు నుగాని, వర్తమానకాల క్రియాప్రక్రియలోవలె 'ఇ' గాదు.

ఉదా॥ మా—> మ మా ('మిమా' గాదు)
పృ—> పపృ (పిపృ గాదు)

ఇక అజాదిధాతువుల విషయమున

(2) 'అ' అను అచ్చుతో మొదలగు ఏక హలంత ధాతువుల పునర్ద్విత్వాక్షరమును 'అ' యే. ఇవి ధాతువులోని 'అ' తో కలిసి 'ఆ' యగును.

ఉదా॥ అద్—> ఆద్; అజ్—> ఆజ్; అన్—> ఆన్; అస్—> ఆస్; అహ్—> ఆహ్; ...

ఋ—> ఆర్ (ధాతురూపము అర్ అయినట్లు)

(3) ఇకార ఉకారములతో మొదలగు ఏకహలంత ధాతువుల పునర్ద్విత్వాక్షరములును వరుసగా 'ఇ,ఉ' లే ఐతే, ప్రకృతియొక్క బలీయరూపమున, ఇవియు, ధాతువులోని యచ్చులును సంయోజనము పొందుటలో వీని రెంటికిని మధ్య వాని యనురూపములగు యంతస్థములు వచ్చి ధాతువులోని యచ్చునకు గుణాదేశమగును. బలహీన ప్రకృతి మామూలే.

ఉదా॥ ఇష్—> బలీయప్రకృతి ఇయే'ష్, బలహీనము ఈష్
ఉచ్—> ,, ఉవో'చ్ .. ఊచ్
ఇ—> ,, ఇయే' ... ఈ

(4) దీర్ఘములగు అచ్చులతో మొదలగు ధాతువులకు (గురుత్వమును బొందిన యచ్చులకును) ఈ ప్రక్రియ సాధారణముగా వర్తించదు. వాని పరోక్ష భూతకాలప్రకృతులు సహాయక క్రియలచే (auxilliary verbs) నేర్పడును. దీనిని సమాసపద పరోక్షభూతార్థకము (Periphrastic perfect) అందురు. ద్వితీయావిభక్తిలోనున్న క్రియావిశేషణమునకు ఒక సహాయకక్రియయొక్క పరోక్షభూతకాలపదమును చేర్చుటచే నిది ఏర్పడును

**విశేషములు**

(అ) కొన్ని ధాతువులకు పునర్ద్విత్వమురాదు. అట్టివానిలో ముఖ్యమైనది విద్ (తెలియు). ఇది ప్రాచీనార్వాచీన వాఙ్మయములలో పునర్ద్విత్వరహితముగనే వాడబడుచున్నది. ఉదా॥ వే'ద; వేద్థ; ... ... ... ...
కాని ఆదేధాతువు 'కనుగొను' అను అర్థములో వాడబడినప్పుడు పునర్ద్విత్వమును

పొంది వివే'ద యగును ఇట్టి పునర్ద్విత్వములేని ధాతువుల ప్రయోగములు వేదములో— తక్షతుః, తక్షుః, యమతుః, స్కంభథుః, స్కంభుః, దిషే, దిరే, విద్రే మొదలగునవి. ఇట్లే అర్వాచీన వాఙ్మయమునను ఈ క్రింది ప్రయోగములు కాన్పించుచున్నవి. కర్షతుః, చేష్ట, చేష్టతుః, భ్రాజతుః, సర్ప, శంసుః, శ.సిరే, ధ్వంసిరే, స్రంసిరే, జల్పిరే, ఏధిరే మొదలగునవి

(ఆ) ఆప్ నకు పరోక్షభూతకాలప్రకృతి ఆప్ (బహుశః ధాతురూపము పూర్వమున అప్ గావచ్చును )

(ఇ కొలది ధాతువులు, అకారముతో గాని, ఋకారముతో గాని మొదలగునవి, పరోక్షభూతకాల ప్రకృతిలోని పునర్ద్విత్వమున 'అన్' అగును. ఇట్టివి ముఖ్యముగా వేదవాఙ్మయముననే కన్పించును.

ఉదా॥ అజ్ లేక అంజ్ —— > ఆనజ్

అశ్ —— > ఆనశ్మ, ఆనశే, ...

ఋధ్ —— > ఆనృధుః;

అర్హ్ —— > ఆనృహుః

(ఈ) చాలా విరివిగా వచ్చు భూధాతువు పునర్ద్విత్వమున విచిత్రముగా 'బభూ' యగును (బు భూ గాదు)

(ఉ) వకారముతో మొదలై ఒకే హల్లుతో అంతమగు ధాతువుల కొన్నిటిలోని (ఇతర క్రియాప్రక్రియలలోవలె) వకారము బలహీనరూపములలో సంకుచితమై (సంప్రసారణముచే) ఉకారముగామారి, అట్టి ధాతువులుగనే (అనగా ఉకారముతో మొదలగు ధాతువులుగనే) ప్రక్రియను బొందును. ఐతే బలీయ ప్రకృతి రూపములలో మాత్రము ఇవి సంపూర్ణరూపములనుండును.

ఉదా॥ వచ్ (మాట్లాడు)—— > బలీయ. ఉవచ్; బలహీన, ఊచ్.

వస్ (నివశించు)—— > ,, ఉవస్; ,, ఊష్

ఇట్టి ధాతువులు వచ్, వప్, వద్, వశ్, వస్, వహ్

దీనికి అచ్చటచ్చట అపవాదములును కన్పించును.

ఇట్లే 'య' తో మొదలగు యజ్ —— > ఇయజ్, ఈజ్ మొదలగునవి.

(ఈ) హలాది ధాతువులలో హల్లునకు వెంటనే 'య' వచ్చినచో నట్టి ధాతువులు పునర్ద్విత్వమున 'అ' కు బదులు 'ఇ' స్వీకరించును. (దీనికి కారణము వేదమున పలుతావులలో య, వ ల యొక్క యుచ్చారణము ఇ, ఉ లు గా నుండుట కావచ్చును) ఇట్లు

వ్యచ్ —> వివ్యచ్; ప్యా —> పిప్యా;
ఈ ధర్మము గల ధాతువులు
వ్యచ్, వ్యథ్, వ్యధ్; వ్యా, జ్యా, ప్యా, స్యన్ద్; ...
ఇట్లే స్వప్ —> సుస్వప్

(ఋ) వేదములో చాలా ధాతువులకు పునర్ద్విత్వమున ఆకారము వచ్చును. ఇట్టివి కన్, క్లప్, గృధ్, తృప్, తృష్, దృహ్, ధృ, ధృష్, నమ్, మహ్, మృజ్, రన్, రద్, రభ్, వఞ్చ్; వన్; వశ్; వస్ (బట్టలు కట్టుకొను), వాశ్, వృజ్; వృధ్, వృష్, శద్, సహ్, స్కమ్భ్ మొదలగునవి. (వీనికి కొన్ని అప వాదములును కలవు)

(ౠ) తాలవ్యములతోగాని, హకారముతోగాని మొదలగు కొన్ని ధాతువులు పునర్ద్విత్వమును బొందినపుడు, ధాతువులోని తాలవ్యము కంఠ్యముగను, హకా రము తన పూర్వరూపముగను మారుటకద్దు.

ఇట్టివి
చి —> చికి; చిత్ —> చికిత్; జి —> జిగి;
హి —> జఘి; హన్ —> జఘన్; ...

## 8.3 II ప్రకృతుల బలీకరణము, దుర్బలీకరణము

పరస్మై పదిలోని ఏకవచన ప్రకృతులు (మూడు పురుషల యందును) బలీకరణమును పొంది, ఇతర ప్రకృతులు బలహీన రూపముననుండును. ఈ భేదము ఒకప్పుడు పైజెప్పబడిన ప్రకృతుల బలీకరణము చేతను, ఒకప్పుడు ఇతర ప్రకృతుల దుర్బలీకరణముచేతను, ఒకప్పుడు రెంటిచేతను ఏర్పడును.

(అ) (1) బలీకరణమున, పరస్మై పది ఏకవచనమున ప్రథమపురుషలో ధాతువులోని యచ్చునకు గుణముగాని, వృద్ధిగాని రావచ్చును ద్వితీయపురుషలో గుణముమాత్రము వచ్చును. తృతీయ పురుషలో వృద్ధిమాత్రము వచ్చును. ఇట్లు:

భీ—> ప్రథమపురుషలో బిభే' గాని బిభై గాని వచ్చును.

ద్వితీయలో బిభే

తృతీయలో బిభై వచ్చును.

కృ—> ప్రథమలో చక'ర్ గాని చకార్‌గాని

ద్వితీయలో చకర్

తృతీయలో చకార్

సూచన : భూకు ఈ మార్పురాదు. దీని విషయము ముందు ముందు చర్చింప బడును.

(2) ఏకహలంత ధాతువుల మధ్య గతమగు అకారము, ధాత్వంతమున నున్న అచ్చువలెనే తృతీయ పురుషలో దీర్ఘీకరణమును (వృద్ధి) పొందును. [illegible] ప్రథమ పురుషలోను రావచ్చును.

తప్—> ప్ర॥ తత'ప్ లేక తతా'ప్

ద్వి॥ తత'ప్

తృ॥ తతా'ప్

(3) మధ్యగతమగు ఇతర అచ్చు హ్రస్వమైనచో మూడు పురుషలలో [illegible] గుణమేవచ్చును.

ఉదా॥ ద్రుహ్—> దు'ద్రోహ్

విశ్—> వివే'శ్

కృత్—> చక'ర్త్

(4) ఒకే హ్రస్వాచ్చుతో మొదలై ఒకే హల్లుతో అంతమగు [illegible] బలీకరణము పైవిధముననే యుండును. ఇట్లు [చూ॥ 8.2 (8)]

ఇష్—> ఇయేష్; ఉచ్—> ఉవో'చ్; ఉ[illegible]—> [illegible]

(5) మృజ్ కు గుణమునకుబదులు ఎల్లప్పుడును వృద్ధియే వచ్చును (వర్తమానకాల ప్రకృతిలోవలె). ఇట్లే గుహ్‌నకు గుణముగాని వృద్ధి గాని రాక, వానికిబదులు దీర్ఘీకరణము (ఊకారము-వర్తమానకాల ప్రకృతిలో వలె) వచ్చును.

(ఆ) దుర్బలీకరణము.

(1) ఇకార ఉకారములతో మొదలగుధాతువులు, బలహీనరూపములలో, పునర్ద్విత్వముచే ఇకార ఉకారములు కని, ఈ ఊలుగా మారును. ఇట్లే పునర్ద్విత్వములో య, వ,లు సంప్రసారణముచే ఇ,ఉలుగా మారినప్పుడు, ప్రకృతి యొక్క దుర్బలరూపమునకూడ నివి ఈ,ఊలుగా మారును. (చూ॥ 8 2 (3); మరియు 8.2, (ఉ). (ఊ)

(2) కొన్ని ధాతువులకు ప్రథమమున హల్లువచ్చి; వెనువెంటనే 'య'గాని వ గాని వచ్చినచో నట్టి వాని దుర్బలప్రకృతుల రూపములలో, సంప్రసారణముచే, 'ఇ', 'ఉ'లు వచ్చును.

(అనగా వానిలోని 'య, వ,' లు, 'ఇ, ఉ'లు గనే పరిగణింపబడును)

ఉదా॥ వ్యచ్ —> వివిచ్; వ్యధ్ —> వివిధ్; స్వప్ —> సుషుప్;

ఇట్లే ఆకారాంత ధాతువులగు జ్యా, ప్యా, వ్యా, శ్వా, హ్వా, మొదలగు వాని దుర్బల ప్రకృతి రూపములు వరుసగా

జీ, పీ, వీ, శూ, హూ ... ... మొదలగువానినుండి ఏర్పడినట్లు క్రమముగా జిజీ; పిపీ, వివీ, శుశూ, హుహూలగును (చివరదాని బలీయ ప్రకృతియు నిదియే)

(3) గ్రభ్ లేక గ్రహ్ సంకోచమును బొంది గృహ్‌గామారును.

(4) కొన్ని కొన్ని ప్రకృతుల బలీయరూపములలో, అనునాసికమ ండిన, దుర్బలరూపములలో నది లోపించును.

క్రన్ద్ —> చక్రదే'; తన్స్ —> తత్రసే; బన్ధ్ —> బేధే'; బేధు'ః; స్కంభ్ —> చస్కభాన; స్తంభ్ —> తస్తభాన'; ......

(5) ఏకహలాది, ఏకహలంతములగు ధాతువుమధ్య గతమగు ఆకారము, కొన్ని కొన్ని ప్రకృతుల దుర్బలరూపములయందు లోపించును.

ఉదా॥ గమ్; ఖన్; హన్ మొదలగునవి పీని దుర్బల ప్రకృతులు వరుసగా జగ్మ్; చఖ్న్; జఘ్న్; జఘ్న్, జక్ష్; మొదలగునవి.

(6) సాధారణముగా ఏకహలంతములగు ధాతువు ఏకహలాదియై, ఈ మొదటనున్న హల్లుపునర్ద్విత్వమున మార్పుజెందక—అనగా ధాతువునకు మొదట

వచ్చిన హల్లు కంఠ్యముగాని, హకారముగాని, ఘోషముగాని గాక—అట్టి ధాతువు మధ్యగతముగ అకారమువచ్చిన, దాని పునర్ద్విత్వాక్షరమును, ధాతువు యొక్క ప్రథమాక్షరమును సంలీనమై ఏ కారముగల ఒకే యక్షరముగ మారును. ఇది దీని బలహీన రూప ప్రకృతి.

ఉదా॥ సద్ —> బలహీన ప్రకృతి సేద్.
పచ్ —> ,, పేచ్
యమ్—> ,, యేమ్

(7) అకారాంత ధాతువుల యంతమున నున్న అకారము, అజాది ప్రత్యయములతో జేరినపుడు, లోపించును. (పొడియగు 'ఇ'తో కలిసినను)

## 8.4 III ప్రత్యయములు

పరోక్ష భూతకాలమును తెలియజేయు ప్రత్యయములు.

| పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|
| ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| అ | వ' | మ' | ఏ' | వ'హే | మ'హే |
| థ | అ'థుస్ | అ' | సే' | ఆ'థే | [illegible] |
| అ | అ'తుస్ | ఉ'స్ | ఏ' | ఆ'తే | [illegible] |

సూచన :— ఆకారాంత ప్రకృతులు, పరస్మై పదిలో, ప్రథమా తృతీయా ఏకవచనములలో 'ఔ'తో అంతమగును.

## 8.5 IV హలాది ప్రత్యయములను - అనగా పరస్మైపదిలో [illegible]

లును, ఆత్మనే పదిలో వహే, మహే, రే లును - [illegible] సాధారణముగా, ప్రకృతితో కలుపుటకు 'ఇ' అను పొడి [illegible]

(అ) ఈ పొడి-ఇకారము - పరోక్షభూతకాలమునందే [illegible] ప్రక్రియల యందును, క్రియావిశేష్యములలోను, క్రియా [illegible] కనుపించును. ఐతే ఇది ముఖ్యముగా ఈ పరోక్షభూతకాల [illegible] దృఢముగా పాతుకొనిపోయినది.

(ఆ) ఆత్మనే పదిలోని తృతీయా బహువచన ప్రత్యయము [illegible] ముందు ఇది ఎల్లప్పుడును వచ్చును.

(ఇ) పరస్మై. ద్వి. ఏకవచన ప్రత్యయమగు థ తో తప్ప, ఇతర హలాది ప్రత్యయములతో. ఇంచుమించు, అన్నిధాతువుల యందును ఇది చేరును.

(ఈ) ఐతే ఈ క్రింద నుదాహరించిన ఎనిమిది ధాతువులు ఎట్టి పరిస్థితులలోను ఈ పొడిని స్వీకరించవు.

కృ, భృ, వృ, సృ స్తు, ద్రు, శ్రు, స్రు

(ఉ) పరస్మైపది. ద్వి. ఏ. లో (ఈ) లో చెప్పబడిన ఎనిమిది ధాతువులును గాక మరికొన్ని ఇతర ధాతువులును 'ఇ'ను స్వీకరించవు. అట్టివానికి కొన్నిటికి, ఇతర ప్రక్రియల యందు నిత్యముగను, మరికొన్నిటికి వైకల్పికముగను ఈ పొడి చేరును. కొన్నిటికి ఏ ప్రక్రియ యందునురాదు. ఇట్టి ధాతువులను గూర్చి సాధారణసూత్రముల నేర్పరించుట యసంభవము. వీనిని ప్రత్యేకముగ గమనించవలసినదే.

(ఊ) ధాత్వంతముననున్న ఇకారముతోగాని ఈకారముతోగాని ఈ పొడి కలియదు, అట్టి యెడనిది 'య్'గనో 'ఇయ్'గనో మారును

(ఋ) భూ లోని 'ఊ' అజాది ప్రత్యయములకు ముందు 'ఊవ్'గా మారును.

(ౠ) ఈ పొడిని స్వీకరించుధాతువులను సేట్కములనియు. ఇతరములను అనిట్కములనియు అందురు.

రూపావళి

**8.6** (అ) హలంతధాతువుల మామూలు ప్రక్రియకు ఉదాహరణముగా

బుధ్ —> బలీయప్రకృతి బుబో'ధ్; దుర్బల ప్రకృతి బుబుధ్.

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | బుబో'ధ | బుబుధి'వ | బుబుధిమ' | బుబుధే' | బుబుధివ'హే | బుబుధిమ'హే |
| 2 | బుబో'ధిథ | బుబుధథు'ః | బుబుధ' | బుబుధిషే' | బుబు'ధాథే | బుబుధిధ్వే' |
| 3 | బుబో'ధ | బుబు'ధతుః | బుబుధు'ః | బుబుధే' | బుబు'ధాతే | బుబుధిరే' |

(ఆ) ఆకారాంత ధాతువుల ప్రక్రియకు నమూనాగా

దా —> బలీయ ప్రకృతి దదా', బలహీన ప్రకృతి దద్ లేక దది

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | దదే' | దదివ | దదిమ | దదే' | దదివ'హే | దదిమ'హే |
| 2 | దదా'థ దది'థ | దద'థు: | దద' | దదిషే' | దదా'థే | దదిధ్వే' |
| 3 | దదౌ' | దద'తు: | దదు': | దదే' | దదా'తే | దదిరే' |

(ఇ) ఇకారాంత, ఉకారాంత ధాతువుల ప్రక్రియకు సమానాగా

( ) నీ—> బలీయ ప్రకృతి నిన'య్, నినా'య్; దుర్బల ప్రకృతి నినీ

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | నిన'య నినా'య | నిన్యివ' | నిన్యిమ | నిన్యే' | నిన్యివ'హే | నిన్యిమ'హే |
| 2 | నినే'థ నిన'యిథ | నిన్య'థు: | నిన్య' | నిన్యిషే' | నిన్యా'థే | నిన్యిధ్వే' |
| 3 | నినా'య | నిన్య'తు: | నిన్యు: | నిన్యే' | నిన్యా'తే | నిన్యి'రే |

(2) భూధాతువునకు పరస్మై పదిలోనే ప్రక్రియ ఆత్మనే పదిలో దీని ప్రక్రియ ఎచ్చటను గానరాదు.

| | పరస్మై | | |
|---|---|---|---|
| | ఏ | ద్వి | బ |
| 1 | బభూ'వ | బభూవి'వ | బభూవి'మ |
| 2 | బభూ'థ, బభూ'విథ | బభూవ'థు: | బభూవ' |
| 3 | బభూ'వ | బభూవ'తు: | బభూవు': |

సూచన :— ఉకారాంత, ఊకారాంత ధాత్వంతమూలమున్న ఉకార ఊకారములు, అజాది ప్రత్యయములకు ముందు ఉవ్'గా మారును

(ఈ) ధాతువులోని మధ్యగతమగు అకారము, ధాతు ప్రత్యయముల సంలయముచే బలహీన ప్రకృతిలో 'ఏ'గా మారిన దానికి ఉదాహరణముగా తన్ యొక్క ప్రక్రియను గమనింపదగును [చూ. 8.8: (అ) (ఆ)]

తన్—> బలీయరూపములు తత'న్, తతా'న్; దుర్బలరూపము తేన్.

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | తత'న<br>తతా'న | తేనివ' | తేనిమ' | తేనే' | తేనివ'హే | తేనిమ'హే |
| 2 | తత'స్థ<br>తేని'థ | తేన'థుః | తేన' | తేని'షే | తేనా'థే | తేనిధ్వే |
| 3 | తతా'న | తేన'తుః | తేను'ః | తేనే' | తేనా'తే | తేనిరే' |

(ఉ) వతో మొదలగు ధాతువుల పునర్ద్విత్వమున 'ఉ' వచ్చి, ప్రకృతి బలహీనరూపములో నిది ఊ గామారిన ధాతువుల ప్రక్రియకు నమూనాగా వచ్ గైకొనవచ్చును.

వచ్ —> బలీయప్రకృతులు ఉవ'చ్; ఉవా'చ్
బలహీన ప్రకృతి ఊచ్

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | ఉవ'చ;<br>ఉవా'చ | ఊచివ' | ఊచిమ' | ఊచే' | ఊచివ'హే | ఊచిమ'హే |
| 2 | ఉవ'క్థ;<br>ఉవచి'థ | ఊచ'థుః | ఊచ | ఊచిషే' | ఊచా'థే | ఊచిధ్వే |
| 3 | ఉవా'చ | ఊచ'తుః | ఊచు'ః | ఊచే' | ఊచా'తే | ఊచి'రే |

సూచన :_ ఇట్లే యజ్ —> ఇయ'జ లేక ఇయా'జ; ఇయ'ష్ఠ లేక ఇయజిథ; ఈజే; ఈజిషే'; ... ... వగైరా.

(ఊ) 8.5 (ఈ)లో ఉదహరించబడిన ఋకారాంత ధాతువుల ప్రక్రియ ఈ క్రింది విధముగానుండును.

కృ —> బలీయక్రకృతులు చక'ర్; చకా'ర్
బలహీన ప్రకృతి చకృ

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | చక'ర;<br>చకా'ర | చకృవ' | చకృమ' | చక్రే' | చకృవ'హే | చకృమ'హే |
| 2 | చక'ర్థ | చక్ర'థుః | చక్ర' | చకృషే' | చక్రా'థే | చకృధ్వే' |
| 3 | చకా'ర | చక్ర'తుః | చక్రు'ః | చక్రే' | చక్రా'తే | చక్రిరే' |

(ఋ) 8.5 (ఈ) లో చెప్పబడిన ఋకారాంత ధాతువులుగాక, ఇతర ఋకారాంత ధాతువుల ప్రక్రియ మామూలుగనే జరుగును. ఇట్లు.

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | దధ'ర, దధా'ర | దధ్రివ' | దధ్రిమ' | దధ్రే' | దధ్రివ'హే | దధ్రిమ'హే |
| | — | — | — | — | — | — |
| | — | — | — | — | — | — |

(ౠ) అస్ (ఉండు)కు ఆత్మనే పదిగా ప్రక్రియలేదు. పరస్మై పదిలో దీని ప్రక్రియ ఈ క్రింది విధమున నుండును.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| 1 | ఆ'స | ఆసివ' | ఆసిమ' |
| 2 | ఆ'సిథ | ఆస'థుః | ఆస' |
| 3 | ఆ'స | ఆస'తుః | ఆసు'ః |

సూచన :- కృ; అస్ ఈ రెండు ధాతువులను సహాయక క్రియలుగా విస్తారము వాడబడుచున్నవి. కావున వీని ప్రక్రియలు అత్యంత ముఖ్యములు.

## 8.7 పరోక్షభూతకాలపు అసమాపకక్రియలు

(అ) (1) పరోక్షభూతకాలపు అసమాపక క్రియ [illegible] వా'న్స్ (ఇది సుబంతప్రక్రియలో [illegible] 'ఉత్', [illegible] మున 'ఉ'ష్' అగును) ఈ పరోక్షభూతకాలపు అసమాపక క్రియా [illegible] ప్రకృతియొక్క బలహీనరూపమునకు అతికింపబడును ఇట్లు

బుబుధ్వా'ంస్; నినీవా'ంస్; చకృవాంస్; ... ...

( ) పరోక్షభూతకాల ప్రకృతి ఏకాచ్ [illegible] ప్రకృతికి 'ఇ' చేసతుకుదురు. ఈ పొడి సుబంతప్రక్రియలో [illegible] రూపమున లోపించును. ఉదా॥ తేనివా'ంస్; [illegible] యొక్క దుర్బలతర రూపములు (సుబంత ప్రక్రియలో) [illegible] ...

(3) ఐతే పునర్ద్విత్వమురాని ఏకాచ్ ప్రకృతులకు [illegible]

ఉదా॥ విద్వా'ంస్; దాశ్వా'ంస్; [illegible]

(ఆ) ఆత్మనే పది యొక్క ప్రత్యయము [illegible] బలహీనరూపమునకు అతుకబడును. ఉదా॥ [illegible]



# 9. భవిష్యత్కాలము

**9.1** సంస్కృతభాషలోని క్రియలకు భవిష్యత్కాల ప్రకృతులు రెండువిధములుగా నేర్పడును. మొదటిరకపు ప్రకృతికి గుర్తు స్య యను అనుసర్గ ఇది ధాతువునకు సరాసరిగాని, 'ఇ' యను పొడితోగాని చేర్చ యతుకుదురు. 'ఇ'తో కలిసిన యనుసర్గ 'ఇష్య' యగును ధాతువు గుణీకరణముచే బలీయమగును. ఇట్లు.

దా —> దాస్య; ఇ —> ఏష్య; దుహ్ —> ధోక్ష్య; భూ —> భవిష్య; ఋధ్ —> అర్ధిష్య; ... ...

రెండవరకపు ప్రకృతులు సహాయక్రియలచే నేర్పడునవి మొదటి రకపువి పురాతన వాఙ్మయమునుండి సంక్రమించినది. రెండవది ఆధునికము మొదటిదానిని స-భవిష్యత్తు అనియు, రెండవదానిని సమానపదభవిష్యత్తు అనియు అందురు

**9.2** స-భవిష్యత్తు

పైజెప్పిన విధముగా నేర్పడు భవిష్యత్కాల క్రియాప్రకృతుల ప్రక్రియ, అకారాంత ప్రకృతుల వర్తమానకాల సూచకార్థక క్రియాప్రక్రియవలెనే యుండును. ఇవియును అకారాంత ప్రకృతులే గావున, దానిపైనున్న ఉదాత్తస్థానము ప్రక్రియచేమారదు. ఉదాత్తము ఎల్లప్పుడును అనుసర్గపైననే యుండును. ఇట్లు వీని ప్రక్రియకు నమూనాగా దా; కృ; లను స్వీకరించి వాని రూపముల నీ క్రింద పొందుపరచుచున్నాము.

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | దాస్యామి | దాస్యావః | దాస్యామః | దాస్యే | దాస్యావహే | దాస్యామహే |
| 2 | దాస్యసి | దాస్యథః | దాస్యథ | దాస్యసే | దాస్యేథే | దాస్యధ్వే |
| 3 | దాస్యతి | దాస్యతః | దాస్యన్తి | దాస్యతే | దాస్యేతే | దాస్యన్తే |
| | | | ఇట్లే | | | |
| 1 | కరిష్యామి | కరిష్యావః | కరిష్యామః | కరిష్యే | కరిష్యావహే | కరిష్యామహే |
| 2 | — | — | — | — | — | — |
| 3 | — | — | — | — | — | — |

**9.3** ఇడాగమ విషయమున సర్వసాధారణ సూత్రముల నేర్పరించుట యసంభవము. ఏధాతువున కాధాతువు ప్రత్యేకముగ నేర్చుకొనవలసినదే. ఐనను కొన్ని రూపము లీ క్రింద నీయబడినవి.

(అ) అజంతధాతువులలో (ఋకారాంత ధాతువులకు తప్ప) చాలావాటికి ఇడాగమమురాదు.

(1) ఆకారాంత ధాతువులకు ఇడాగమమురాదు.

(2) ఇకారాంతధాతువులలో క్షి (కలిగియుండు), చి (ప్రోగుచేయు), చి (తెలియు) మి, సి (లేక సా), హి లకు ఇడాగమమురాదు. కాని క్షి (నశింప జేయు) జి (గెలుచు) కు వైకల్పికముగా వచ్చును.

ఐతే శ్రి సేట్కము.

(3) ఈకారాంతములలో క్రీ, భీ, మీ, ప్లీ లకు రాదు.

కాని శీ (పరుండు), నీ (తీసికొనిపోవు) లకు రెండు రూపములు గలవు.

ఐతే డీ (ఎగురు fly) సేట్కము.

(4) ఉకారాంతములలో చ్యు, ద్రు, ప్లు, స్రు, హులకు ఇడాగమమురాదు.

కాని సు, స్తు లకు రెండు రూపములున్నవి.

ఐతే క్షు, క్ష్ణు, ను, యు, దు, రు, స్ను లకు ఇడాగమము వచ్చును.

(5) ఊకారాంతములలో, ధూ, భూ రెండును సేట్కములు.

కాని సూ కు రెండు రూపములు కలవు.

(6) ఋకారాంతధాతువు లన్నియును 'ఇ' స్వీకరించును

(ఆ) స్పర్శములతో నంతములగు ధాతువులలో ఇంచుమించు సగము ఇడాగమమును ఒప్పవు.

(1) కంఠ్యములతో నంతమగు వానిలో శక్ ఇడాగమము స్వీకరించును

(2) తాలవ్యములతో నంతములగు వానిలో, పచ్, ముచ్, రిచ్, వచ్, విచ్, వ్రచ్, సిచ్, ప్రచ్; భంజ్, మృజ్, యజ్, భుజ్, యుజ్, వృజ్, సృజ్, మరియు భ్రాజ్, రంజ్, సంజ్, స్వంజ్, నిజ్, రుజ్, ఇడాగమము స్వీకరించవు. కాని త్యజ్, భజ్, మజ్జ్ లకు ఉభయరూపములను గలవు

ఐతే విజ్, వజ్ : ఈ రెండును 'ఇ' ను స్వీకరించును.

(3) దంత్యములతో నంతములగువానిలో

కృత్, వృత్—ఈ రెండును ఉభయరూపముల పొందును.

అద్, పద్, శద్, స్కన్ద్, ఛిద్, భిద్, విద్, నుద్, మరియు హద్, క్లిద్, స్విద్, క్షుద్, తుద్,—వీనిలో 'ఇ'రాదు.

కాని సద్, విద్, ఛృత్, తృద్,—వీనికి రెండు రూపములు గలవు.

ఐతే వద్, ఇడాగమము స్వీకరించును.

వ్యధ్, రాధ్, సిధ్, బుధ్, యుధ్, రుధ్, వృధ్, మరియు

సాధ్, క్రుధ్, క్షుధ్, శుధ్—ఇవి 'ఇ'ను స్వీకరించును.

కాని బంధ్, సిధ్ లకు ఉభయరూపములు గలవు.

తన్‌కు ఇడాగమము రాదు.

కాని మన్, హన్‌లకు ఉభయ రూపములున్నవి.

(4) ఓష్ఠ్యాంతములలో

ఆప్, క్షిప్, గుప్, తృప్, సృప్ మరియు శప్, లిప్, లుప్—ఇవి పొడిని స్వీకరించవు.

కాని తప్, వప్, స్వప్, దృప్, క్లప్—వీనికి ఉభయరూపములు గలవు. యభ్, రభ్, లభ్—వీనికిని ఉభయరూపములున్నవి.

రమ్—ఇది ఇడాగమము స్వీకరించదు.

కాని క్రమ్, క్షమ్, నమ్, యమ్, వీనికి ఉభయరూపములు కలవు.

(ఇ) అంతస్థములతో నంతమగు ధాతువులన్నియును ఇడాగమమునంగీకరించును.

(ఈ) ఊష్మములతో నంతమగుధాతువులలో రమారమి మూడవ వంతు మాత్రము ఇడాగమమును ఒప్పుకొనవు. ఇట్టివి.

దిశ్, విశ్, దృశ్, మరియు దంశ్, రిశ్, లిశ్, క్రుశ్, మృశ్ — ఇవి స్వీకరించవు.

కాని నశ్‌కు ఉభయరూపములున్నవి.

పిష్, విష్, శిష్, మరియు త్విష్, ద్విష్, శ్లిష్, తుష్, దుష్, పుష్, శుష్,— వీనికి ఇడాగమము రాదు.

కృష్‌కు ఉభయరూపములు ఉన్నవి.

వస్ (ప్రకాశించు) వస్ (దుస్తులు ధరించు) మరియు ఘస్—వీనికి ఇడా-
గమము రాదు.

వస్ (నివసించు)కు ఉభయరూపములు ఉన్నవి.

మిహ్, దుహ్, ద్రుహ్, మరియు నహ్, ఉహ్, లిహ్, — వీనిలో 'ఇ' రాదు.

కాని మిహ్, దహ్, దుహ్, వహ్, సహ్, రుహ్—వీనికి ఉభయరూపములు
గలవు.

(ఉ) దీనిలోని ప్రకృతి బలీయముగాన, ధాతువులో బలీయ మర్భల
భేదములున్నపుడు బలీయమునే స్వీకరించవలయును.

ఉదా॥ బన్ధ్; బన్‌లో మొదటి దానిని స్వీకరించగా బంధిష్య, భంత్స్య
మొదలగు రూపములేర్పడును.

(ఊ) ఆధునిక వాఙ్మయములో కొన్ని ప్రకృతులకు బలీకరణము రాదు.
అట్టివి— లిఖిష్య; మిలిష్య; విజిష్య; (వేజిష్యకూడదు కలదు) సిష్య;
సూష్య; స్ఫూటిష్య ... మొదలగునవి.

(ఋ) ఋకారము మధ్యగతమగు ధాతువులుకొన్ని బలీకరణములో గుణ-
మునకు బదులు 'ర'ను స్వీకరించుటకలదు. ఇట్టివి

క్రక్ష్య; త్రప్స్య; ద్రప్స్య; ద్రక్ష్య; మ్రక్ష్య; స్ప్రక్ష్య; స్రక్ష్య; స్రప్స్య;
మ్రదిష్య;

ఇట్లే క్లృప్ —> క్లప్స్య (క్లపిష్యగూడను)

(ౠ) గ్రహ్ (గ్లహ్ గూడను) ఈ కారమును స్వీకరించును. ఈ
ధాతువు ఇతరత్రగూడ. 'ఇ' బదులు 'ఈ' స్వీకరించును.

## 9.4 స-భవిష్యత్తు యొక్క
## అపరోక్షభూతార్థకము

(దీనిని క్రియాతిపత్తి యందురు).

(ఇది వాఙ్మయములో చాలా అరుదుగా వచ్చును)

వర్తమానకాలములోని అకారాంత ప్రకృతుల యపరోక్ష భూతార్థకము
వలెనే స-భవిషత్తు యొక్క ప్రకృతులతోడను అపరోక్షభూతార్థకము నేర్పరిం-
తురు. ఇది ప్రకృతికి 'అ' అను ఉపచయమును చేర్చి గౌణప్రత్యయములను
చేర్చుటచే నేర్పడును. ఉదా॥

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అ'దాస్యమ్ | అ'దాస్యావ | అ'దాస్యామ | అ'దాస్యే | అ'దాస్యావహి | అ'దాస్యామహి |
| 2 | అ'దాస్యః | అ'దాస్యతమ్ | అ'దాస్యత | అ'దాస్యథాః | అ'దాస్యాథామ్ | అ'దాస్యధ్వమ్ |
| 3 | అ'దాస్యత్ | అ'దాస్యతామ్ | అ'దాస్యన్ | అ'దాస్యత | అ'దాస్యేతామ్ | అ'దాస్యన్త |
| | | | ఇట్లే | | | |
| 1 | అ'కరిష్యమ్ | అ'కరిష్యావ | అ'కరిష్యామ | అ'కరిష్యే | అ'కరిష్యావహి | అ'కరిష్యామహి |
| | — | — | — | — | — | — |
| | — | — | — | — | — | — |

## 9.5 స-భవిష్యత్తు యొక్క అసమాపకక్రియ.

ఇవి వర్తమానకాల అకారాంత ప్రకృతులకువలెనే ఏర్పడును—పరస్మై పదిలో 'న్త్'చేర్చుటచేతను, ఆత్మనేపదిలో 'మాన'చేర్చుటచేతను. ఇట్లు దాస్య'న్త్; దాస్య'మాన :

ఇట్లే కరిష్య'న్త్; కరిష్య'మాణ; . .

వీని స్త్రీలింగరూపములు మామూలేగాని చాలాచాలా యరుదు.

## 9.6 సమాసపద భవిష్యత్తు (Periphrastic future)

దీనిలో పరస్మైపదియొక్క సూచకార్థకము మాత్రము ఉన్నది. వీని ఆత్మనేపద రూపములను ఏర్పరించవచ్చును గాని, అట్టివి వాఙ్మయమున నెచ్చటను గానరావు (ఆధునిక వాఙ్మయములో నైషధమున ఒకే ఒక ప్రయోగము తప్ప) దీనికి భావార్థకములు గాని, అపరోక్షభూతార్థకముగాని, యసమాపకక్రియ గాని, లేవు. ధాతువునకు 'తృ' జేర్చి దాని నుండి క్రియాజన్య నామవాచకమును తయారుజేయుదురు ఈ చేర్చుటలో కొన్నికొన్ని చోట్ల ఇడాగమము రావచ్చును. ధాతువు గుణీకరణముచే బలీయమొనరింపబడును. ఐతే ఉదాత్తము మాత్రము అనుసర్గపైననే యుండును. ఇట్టి నామవాచకములు.

దా—> దాత'ృ; కృ—> కర్త'ృ; భూ—> భవిత'ృ;

ఇట్టి నామవాచకమునకు సహాయకక్రియ అస్ యొక్క రూపములను జేర్చి భవిష్యత్తును సూచించు పదములను తయారు జేయుదురు. ఐతే తృతీయ పురు

షలో మాత్రము ఋకారాంత పుంలింగ ప్రథమావిభక్తి పదములే మూడు వచనముల యందును వాడబడును. వీనికి సహాయక క్రియరాదు.

ఇట్లు దా యొక్క ప్రక్రియ

పరస్మై

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| 1 | దాతా'స్మి | దాతా'స్వః | దాతా'స్మః |
| 2 | దాతా'సి | దాతా'స్థః | దాతాస్థ |
| 3 | దాతా' | దాతా'రౌ | దాతా'రః |

(అ) ఇడాగమ విషయమున స-భవిష్యత్తులోని ధాతువుల ప్రవర్తనయే సహాసపద భవిష్యత్తున గూడా సాధారణముగా నుండునని వ్యాకర్తల నిర్ణయము దీనికి ముఖ్యమైన యపవాదము ఋకారాంతధాతువులు. వీనికి దీనిలో ఇడాగమము రాదు. ఉదా॥ కర్తృ (కరిష్యకు విరుద్ధముగా) ఇట్లే హన్, గమ్ లలో గూడ నిదే భేదము కన్పించును. ఇక, వృత్, వృధ్, స్యన్ద్— వీనికి ఇచ్చట ఇడాగమము వచ్చినను స-భవిష్యత్తులో రాదు.

(ఇ) పురాణములలోను, ఇతర ఆధునిక వాఙ్మయములోను, పై జెప్పబడిన ప్రక్రియకు విరుద్ధముగా అనేక ప్రయోగములు కన్పించుచున్నవి. వీని నన్నిటిని పేర్కొనుట యనవసరము.

# 10. అద్యతన భూతకాలము (Aorist Tense)

**10.1** అద్యతన భూతకాలము గడచిపోయిన కాలమున జరిగిన పనిని సూచించును గాన వీని ప్రకృతుల కన్నిటికిని 'అ' యను ఉపచయము చేరి యుండును. (ఉపచయము లేకయే చేయబడిన ప్రయోగములు, అనేకములు, వేదబ్రాహ్మణములలో కనుపించును) ఐతే పరోక్షభూతార్థకములో వలె, ఎప్పుడో జరిగిన పనిగాక, వర్తమానకాలమునకు అతిసన్నిహితముగా నుండిన భూతకాలములో జరిగి యుండవలయును. దీనికి ఇంగ్లీషున (Present Perfect) అందురు. ఈ అద్యతన భూతకాల ప్రక్రియ వేద బ్రాహ్మణములలో అతివిస్తారముగా నుండును. సుమారు 450 క్రియలు, వివిధరూపములలో పలుచోట్ల విరివిగా అద్యతన భూతకాల సూచకార్థకములలోనో, దానిని సంబంధించిన భావార్థకములలోనో ప్రయోగింపబడియుండును. పురాతన వాఙ్మయమున నింత విస్తారముగా కనుపించు ఈ క్రియాప్రక్రియ, కావ్యనాటక పురాణాది ఆధునిక వాఙ్మయములో చాలావరకు ఉత్సన్నమై, నామమాత్రముగా మిగిలియున్నది. ఇది నలచరిత్రలో (నైషధము) 21 మారులు, హితోపదేశమున 8 మారులు, మనుస్మృతిలో 7 మారులు, భగవద్గీతలో 6 మారులు, శాకుంతల నాటకమున 6 మారులు, రామాయణములోని బాలకాండలో (సుమారు 2600 పంక్తులు) 68 మారులును ప్రయోగింపబడియున్నది. దీనికి ఆధునిక వాఙ్మయమున, అసమాపక క్రియగాని, భావార్థకములు గాని ('మా' యను నిషేధార్థకపదముతో చేర్చబడిన యుపచయ రహిత ప్రకృతులు, ఆశీరర్థకమును తప్ప) లేవు. కావున దీని యధ్యయనము ముఖ్యముగా వేదవాఙ్మయమునకు సంబంధించినదే ఐతే లౌకిక వాఙ్మయమున నచ్చటచ్చట వచ్చు ప్రయోగములు క్వాచిత్కముగా సూచింపబడును.

అద్యతన భూతకాల ప్రకృతులు ముఖ్యముగా మూడు రకములుగా నేర్పడును. మొదటిది సోష్మాద్యతన భూతము (Sibilant Aorist) దీనిలో ధాతువునకు ఊష్మవ్యంజనము చేర్చి ప్రకృతిని తయారుజేయుదురు. దీనిలో నాలుగు రకములైన యంతర్భాగములున్నవి. (1) సరాసరి ధాతువునకు 'స్'

చేరినవి (౨) ధాతువునకు 'స' చేరినవి (౩) ధాతువునకు 'ఇష్' చేరినవి (4) ధాతువునకు సిష్ చేరినవి. పై జెప్పబడిన నాలుగు రకములైన యను సర్గలచే నాలుగు రకములగు ప్రకృతులేర్పడును. ఇది గ్రీకు భాషలోని First Aorist క్రియా ప్రక్రియకు అనురూపమగు సంస్కృత క్రియాప్రక్రియ. రెండవది (5) పునర్ద్విత్వితాద్యతన భూతార్థకము. (Reduplicated Aorist) దీని ప్రక్రియ ప్రేరణార్థక ప్రకృతుల (ఇవి ధాతువులకు 'అయ' యను యనుసర్గను చేర్చుటచే నేర్పడును. రాబోవు ప్రకరణములలో వివరింపబడును) ప్రక్రియతో నెట్టి సంబంధమును కలిగి యుండకపోయినను; అర్థములో ప్రేరణార్థకమని యూహింపబడుచున్నది— దానికి సంబంధించిన ధాతువునకు 'అయ' ను చేర్చినచో ప్రేరణార్థకమేర్పడునెడ. దీనిలో, ధాతువులోని యొక యక్షరము పునర్ద్విత్వమును పొందును. (వర్తమానకాలములో జుహోత్యాది వర్గమునకు చెందిన ప్రకృతులకు వలె, లేక పరోక్షభూతార్థక ప్రకృతికి వలె). ఇక మూడవది సాధారణ అద్యతన భూతము. (Simple Aorist) ఇది గ్రీకు భాషలోని Second Aorist ప్రక్రియకు అనురూపము. దీనిలో మరల రెండు విధములు (6) ధాత్వద్యతన భూతము (Root Aorist) (7) అ-అద్యతన భూతము. ఇట్లు ఏడురకములగు ప్రకృతులతోడను, వానివాని ప్రత్యేకభావార్థకములతోడను, అసమాపక క్రియలతోడను, ఈ క్రియాప్రక్రియ పురాతన వాఙ్మయమున ఎంతయో వైశిష్ట్యమును ప్రదర్శించును. ఇది వర్తమానకాల క్రియాప్రక్రియ యంతటి విస్తారము. ఇదిగాక 'ఆశీర్లిఙ్' అని చెప్పబడు ఆశీరర్థక క్రియాప్రక్రియయు, అద్యతన భూతకాల క్రియాప్రకృతులచేతనే యేర్పడును. కావున ఇదియు అద్యతన భూతకాల క్రియాప్రక్రియయొక్క యంతర్భాగమనియే గ్రహించవలయును.

(అ) ఒకధాతువు ఒకేరకమగు ప్రక్రియను బొందవలయుననుట నియమము లేదు. బుధ్ నకు ఐదురకములగు ప్రక్రియలున్నవి. ఇట్లే

6, 2 నకు చెందినవి ధా—> అధామ్; ధాసుః;

6, 3 నకు చెందినవి గ్రభ్—> అగ్రభమ్, అగ్రభీష్మ

మృష్—> మృష్ఠాః; మరి ష్ఠాః

6, 7 ,, ఋ—> అరత్; ఆర్త

7, 1 కి జెందినవి విద్ (కనుగొను)—> అవిదమ్; అవిత్సి;

,, నిజ్—> అనిజమ్; అనైక్షీత;

7, 2 ,, రుహ్ ——> అరుహమ్; అరుక్షత్;
7, 3 ,, సన్ ——> సనే'మ; అసానిషమ్

— — — — —

## 10.2 అద్యతన భూతకాలప్రత్యయములు గౌణప్రత్యయములు

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అమ్ | వ' | మ' | ఇ', అ' | వ'హి | మ'హి |
| 2 | స్ | త'మ్ | త' | థా'ః | ఆ'థామ్ | ధ్వమ్ |
| 3 | త్ | తా'మ్ | అ'న్, ఉ'స్ | త' | ఆ'తామ్ | అ'న్త, అ'త, ర'న్ |

### 10 3 1) స్-అద్యతనభూతము

(అ) దీనికి సంబంధించిన ప్రకృతులు ఉపచయ సహితమగు ధాతువునకు 'స్' చేర్చుటచే నేర్పడును. ధాతువులోని అచ్చు సాధారణముగా బలీకరణ మొనరింపబడును

ధాతువులలోని యచ్చులు బలీకరణమును పొందు విధములు.

(1) ధాత్వంతమున నున్న యచ్చు (ఋ కూడా) పరస్మైపదిలో వృద్ధిని పొందును. ఆత్మనేపదిలో (ఋ తప్ప) గుణమును పొందును.

ఉదా॥ నీ (తీసికొనిపోవు)——> పరస్మై. అనైష్; ఆత్మనే. అనేష్
శ్రు (విను)——> ,, అశ్రౌష్; ,, అశ్రోష్
కృ (చేయు)——> ,, అకార్ష్; ,, అకృష్

(2) ధాతు మధ్యగతమగు అచ్చు పరస్మైపదిలో వృద్ధిని పొందును; ఆత్మనే పదిలో ఎట్టి మార్పును బొందదు.

ఉదా॥ ఛన్ద్ (కనుపించు, seem)——> పరస్మై. అచ్ఛాన్త్స్; ఆత్మనే. అచన్త్స్
రిచ్ (వదలివేయు)——> ,, అరైక్ష్; ,, అరిక్ష్
రుధ్ (అడ్డుపెట్టు)——> ,, అరౌత్స్; ,, అరుత్స్
సృజ్ (పారబోయు)——> ,, అస్రాక్ష్; ,, అసృక్ష్

(అ) ప్రత్యయములు మామూలుగా గౌణప్రత్యయములే (10 2)కాని, తృతీయా బహువచనములలో ఉ'స్; మరియు అ'త వచ్చును.

(అ'న్. అ'న్త కాదు)

ఐతే పరస్మైపదిలో 2వ, 3వ, ఏకవచనములలో స్, త్, లకు ముందు ఈ కారము నిక్షేపింపబడి ప్రత్యయములు వరుసగా ఈస్; ఈత్ లగును. (ఇది లౌకికవాఙ్మయముననేగాని పురాతనవాఙ్మయమునగానరాదు.)

(ఇ) వ్యాకర్తల మతముననుసరించి, కొన్ని కొన్ని ధాతువులకు, ఈ ప్రక్రియకు సూచకమగు సకారము లోపించును. ఐతే అట్టివాని నన్నిటిని ముందు చర్చింపబోవు (అ) ధాతు—అద్యతనభూతకాల క్రియాప్రక్రియలో జేర్చ వచ్చును.

(ఈ) ఈ క్రియాప్రక్రియకు ఉదాహరణముగా నీ (తీసికొనిపోవు) ఛిద్ (కోసివేయు)లను తీసికొందము.

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అ'నైషమ్ | అ'నైష్వ | అ'నైష్మ | అ'నేషి | అ'నేష్వహి | అ'నేష్మహి |
| 2 | అ'నైషీః | అ'నైష్టమ్ | అ'నైష్ట | అ'నేష్ఠాః | అ'నేషాథామ్ | అ'నేఢ్వమ్• |
| 3 | అ'నైషీత్ | అ'నైష్టామ్ | అ'నైష్టుః | అ'నేష్ట | అ'నేషాతామ్ | అ'నేషత |
| 1 | అ'చ్ఛైత్సమ్ | అ'చ్ఛైత్స్వ | అ'చ్ఛైత్స్మ | అచ్ఛిత్సి | అచ్ఛిత్స్వహి | అ'ఛిత్స్మహి |
| 2 | అ'చ్ఛైత్సీః | అ'చ్ఛైత్తమ్ | అ'చ్ఛైత్త | అ'చ్ఛిత్థాః | అ'చ్ఛిత్సాథామ్ | అ'చ్ఛిద్ధ్వమ్ |
| 3 | అచ్ఛైత్సీత్ | అ'చ్ఛైత్తామ్ | అ'చ్ఛైత్సుః | అచ్ఛిత్త | అ'చ్ఛిత్సాతామ్ | అ'చ్ఛిత్సత |

• త్, థ్, ధ్లతో మొదలగు ప్రత్యయములకు ముందున్నకాల సూచకమగు సకారము ధాతువుహలంతమైనచో (ర్ న్,మ్ లకు తప్ప) లోపించును.

(ఉ) విశేషములు.

(i) ఆకారాంతములగు కొన్ని ధాతువులు ఆత్మనే పదిలో తమధాత్వంతమగు ఆకారమును బలహీనపరచి ఇకారమును స్వీకరించును.

(ఇది ధాతు–అద్యతనభూతమునను కలదు) ఇట్టివి స్థా; దా; ధా; గా

(ii) ధాతువులోని అచ్చును బలీకరణమొనరించుటలో పలురకములగు విశేషరూపములు గన్పించును ఒక్కొక్కప్పుడు బలీకరణములేకనుపోవచ్చును. ఇట్టివి వేదమున అయోక్షీత్; ఛేత్సిః; యోత్సిః; రోత్సిః; అమత్సుః; అయాంసి; అరౌత్సి; ఆసాక్షి; ... ...

(iii) ఆత్మనేపదిలో హూ; ధూ; నూ యొక్క ఊకారము గుణముగా మారుటకు బదులు అట్లే నిలచియుండును. ఇట్లు

అ'హూషత; అ'ధూషత; అ'నూషి; అ'నూషతామ్, అ'నూషత, ... మొదలగు రూపములు కన్పించును.

(ఊ) భావార్థకములు

(1) ఉభయరహితములగు సూచకార్థకములను పలుతావుల నిర్బంధార్థకమున ప్రయోగించుటకద్దు—ముఖ్యముగా, నిషేధార్థసూచకమగు 'మా' అను పదము (prefix) తో చేర్చి

(2) ఈ ప్రక్రియకు సంబంధించి విధ్యర్థకములు ఆత్మనేపదిలోనే కలవు. వీని 2వ, 3వ ఏకవచనములలో ప్రత్యయములకు ముందు (ఆశీరర్థకము లోవలె) సకారము వచ్చి చేరును ఈ క్రిందిరూపములు వేదమున కన్పించును దిషీయ; ధిషీయ; భక్షీయ; మసీయ; (మస్సీయకుబదులుగా) ముక్షీయ; రాసీయ; లోప్సీయ, సాక్షీయ; స్తృషీయ; మన్సీష్ఠాః; దర్శిష్ఠ, భక్షిష్ఠ, మన్సిష్ఠ; మృక్షిష్ఠ; ... ...

(3) అర్వాచీన వాఙ్మయమునకు చెందిన ఆశీరర్థకములలో, ఈ వర్గము యొక్క విధ్యర్థకములును కలవు.

(4) ఈ ప్రక్రియకు సంబంధించిన ఆజ్ఞార్థకములు చాలా అరుదు. సామాన్యముగా నిర్బంధార్థకములను, విధ్యర్థకములను వీనికిబదులు వాడుట కలదు.

(ఋ) స్–అద్యతన భూతముయొక్క అసమాపక క్రియలు.

(i) ఆత్మనేపదిలో ఋంజసేయను పదము స్–అద్యతనభూతకాలరూపముగా స్వీకరించినచో దాని యసమాపక క్రియ ఋంజసాన'యగును. ఇట్టివి అర్శసాన'; ఓహసాన'; జ్రయసాన'; ధియసాన'; మందసాన'; యమసాన',

రభసాన'; వృద్ధసాన'; సహసాన'; శవసాన' ... ... మొదలగునవి కన్పించుచున్నవి.

(ii) ఆత్మనే పదిలో ద'క్షత్; ధక్షత్; సక్షత్ అనురూపములు గలవు.

## 10.4 ఇష్—అద్యతన భూతము

ఈ ప్రక్రియలో కాలసూచకమగు 'ఇష్', బలీకరించబడిన ధాతువున కనుసర్గగా చేర్చబడును. మామూలుగా దీనికి ఉపనయముగూడా వచ్చును. భవిష్యత్కాల ప్రక్రియలో ఇడాగమము స్వీకరించు ధాతువు లన్నిటికిని ఈ ప్రక్రియ వర్తించును. ఇడాగమము స్వీకరించని ధాతువులకు 1వ రకపు ప్రక్రియ, అనగా స్-అద్యతన భూతప్రక్రియ వర్తించును. కొన్నిటికి రెండు ప్రక్రియల యందును రూపములుగలవు. ఇట్లు వేద, బ్రాహ్మణములలో వచు ధాతువులలో సుమారు 500 పైగా, ఈ రెండు ప్రక్రియలలో దేనినో యొకదాని స్వీకరించును. ఐతే కొన్నింటికి పరస్మైపదిలో మాత్రమును మరి కొన్నింటికి ఆత్మనేపదిలో మాత్రమును రూపములు గోచరించును. ఉభయ పదములందును ప్రక్రియనుబొందు ధాతువులు బహూస్వల్పములు.

(అ) బలీకరణ పద్ధతులు

(1) ధాత్వంతమగు అచ్చు పరస్మైపదిలో వృద్ధిని; ఆత్మనేపదిలో గుణమును పొందును. ఇట్లు :

పూ (శుభ్రము చేయు)—> పరస్మై. అ'పావిష్; ఆత్మనే అ'పవిష్
తౄ (గడచు, తరించు) —> ,, అ'తారీష్; ,, అ'తరీష్
శీ (పరుండు) —> ,, —— ,, అ'శయిష్

(2) ధాతుమధ్యగతమగు అచ్చునకు ఉభయపదములందును గుణాదేశమగును. ఇట్లు

లిశ్ (చించు) —> ఉభయపదములలోను అ'లేశిష్
రుచ్ (ప్రకాశించు) —> ,, అ'రోచిష్
వృష్ (వర్షించు) —> ,, అ'వర్షిష్
కాని జీవ్ (బతుకు)—> ,, అ'జీవిష్ అగును.

(సూచన :- ఈ ప్రక్రియకును మొదటిదానికిని ఉండు భేదమును గమనించదగును)

(ఎ) ధాతుమధ్యగతమగు అకారము ఒక్కొక్కసారి దీర్ఘీకరింపబడినను సాధారణముగా నదియట్లే నిలచియుండును

దీర్ఘీకరణమును బొందుధాతువులు ప్రాచీనవాఙ్మయములో కన్, తన్, రన్, స్తన్, హన్, వ్రజ్, సద్, మద్, చర్, స్తర్, స్వర్, జ్వల్, దన్, త్రస్. కాని, రన్, సన్, క్రమ్, వద్, రక్ష్, సహ్, వీనికి ఉభయరూపములు గలవు.

(ఆ) ప్రత్యయములు స్-అద్యతనము లోనివే. కాని 2వ, 3వ ఏకవచన రూపములలో వచ్చు ఇష్ + స్ మరియు ఇష్ + త్ సంకోచమును బొంది ఈస్, ఈత్‌గా మారును. (ఉది ప్రాచీన వాఙ్మయమునను ఇట్లే స్— అద్యతనమున కును దీనికినిగల భేదమిది)

(ఇ) ఈ ప్రక్రియకు ఉదాహరణముగా పా; బుధ్ ను స్వీకరించుదము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| | అ'పావిషమ్ | అ'పావిష్వ | అ'పావిష్మ | అ'పవిషి | అ'పవిష్వహి | అ'పవిష్మహి |
| 2 | అ'పావీః | అ'పావిష్టమ్ | అ'పావిష్ట | అ'పవిష్ఠాః | అ'పవిషాథామ్ | అ'పవిఢ్వమ్ |
| 3 | అ'పావీత్ | అ'పావిష్టామ్ | అ'పావిషుః | అ'పవిష్ట | అ'పవిషాతామ్ | అ'పవిషత |
| | ఇట్లే | | | | | |
| 1 | అ'బోధిషమ్ | అ'బోధిష్వ | అ'బోధిష్మ | అ'బోధిషి | అ'బోధిష్వహి | అ'బోధిష్మహి |
| 2 | — | — | — | — | — | — |
| 3 | — | — | — | — | — | — |

(ఈ) భావార్థకములు

( ) మామూలుగా సూచకార్థకములోని ఉపచయమును తీసివేసి నిర్బంధార్థకముగా వాడుట పరిపాటి. ఇట్టివి పరస్మైపదిలో శ'న్సిషమ్; మ'ధీః; వ'ధీమ్; వ'ధీః; యా'వీః; సా'వీః; అ'విత్; జూ'ర్వీత్; మ'ధీత్; వ'ధీత్; వేచీత్; మర్ధిష్టామ్; దోషిష్టామ్; హింసిష్టామ్; అవిష్టామ్; జ'నిష్టామ్; బాధిష్టామ్; శ్రమిష్మ; వాదిష్మ; వధిష్ట; వధిష్టాన; మథిష్టాన; హింసిష్ట; హ్వారిషుః; గ్రహీషుః; ......

ఆత్మనేపదిలో రాధిషి. జనిష్టాః, మర్షిష్టాః, వ్యథిష్టాః క్రమిష్ట, జ'నిష్ట, పవిష్ట, ప్ర'థిష్ట, మందిష్ట, ... ...

(2) విధ్యర్థకముయొక్క పరస్మైపద రూపములు కానరావు. ఆత్మనే పదిలోని విధ్యర్థకరూపములు అర్వాచీన వాఙ్మయములోని ఆశీరర్థకము యొక్క ఒకభాగమే.

(3) ఆజ్ఞార్థకములో అవ్‌నుండి ఉత్పన్నమైనవి.

అవిడ్ఢి', అవిష్టు, అవిష్ట'మ్, అవిష్ట', అవిష్టన', పెక్కుచోట్ల నిర్బంధార్థక ములనే ఆజ్ఞార్థకములుగా వాడుట కలదు.

(4) దీని యసమాపకక్రియ ఎచ్చటకు గానరాదు.

## 10.5 3. సిష్-అద్యతనభూతము

దీనిని ఇష్ - అద్యతనము యొక్క అంతర్భాగముగనే పరిగణించ వచ్చును. దీని కాలసూచకము సిష్. దీని ప్రయోగములు పరస్మైపదిలోనేగాని, ఆత్మనేపదిలో గానరావు. దీని ఆత్మనే పదరూపములు స్-అద్యతన భూతము నకు చెందినవి. ఇది ఆకారాంత ధాతువులకును; (మి (అమర్చు); మి (చెదగొట్టు); లీ (వ్రేలాడు) - వీనికిని. (ఇవి ఆకారాంతములుగా మార్చివేయబడును); నమ్ (నమస్కరించు), యమ్ (అందుకొను) రమ్ (తృప్తినొందు) కును వర్తించును.

(అ) దీని ప్రక్రియకు ఉదాహరణముగా యా; నమ్ గైకొందము.

| | పరస్మై | | | పరస్మై | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అ'యాసిషమ్ | అ'యాసిష్వ | అ'యాసిష్మ | అ'నంసిషమ్ | అ'నంసిష్వ | అ'నంసిష్మ |
| 2 | — | — | — | — | — | — |
| 3 | — | — | — | — | — | — |

దీని ప్రక్రియ ఇష్-అద్యతన భూతమునకు వలెనే. గావున అన్ని రూప ముల నీయ పనిలేదు.

(ఆ) దీని భావార్థకములు వేదములోనే చాలాచాలా అరుదుగా వచ్చును.

## 10.6 4. స- అద్యతనభూతము

ఈ వర్గమునకు చెందిన ధాతువుల యంతమున జ్, శ్, ష్, హ్ లు మాత్రము ఉండును. అందుచే నివి కాలసూచకమగు. స తో గలిసి 'క్ష' యగును.

దీనిని ధాతువునకు సరాసరి కలిపి (బలీకరణము లేక) అకారాంత ప్రకృతిగా తయారుజేయుదురు దీని ప్రక్రియయు అకారాంత ప్రకృతుల వర్తమానకాలమున అపరోక్ష భూతార్థక క్రియాప్రక్రియవలెనే యుండును. ఐతే, ఆత్మనే పదిలో 1వ ఏకవచనమున ప్రత్యయము 'ఇ' (ఏ గాదు), 2 వ, 3వ ద్వివచనములకు వరుసగా ఆథామ్, ఆతామ్ ప్రత్యయములు. దీనికి ఉభయపదు లందును ప్రక్రియగలదు. ఈధాతువులలోని అచ్చులు ఇ, ఉ, ఋ లు మాత్రమే అకారము అచ్చుగాగల ధాతువులు ఈ ప్రక్రియలోనికిరావు

(అ) ఈ ప్రక్రియను స్వీకరించు ధాతువులు— మృజ్, వృజ్, దిశ్, రిశ్, లిశ్, విశ్, క్లిశ్, క్రుశ్, రుశ్, మృశ్, స్పృశ్; — త్విష్, ద్విష్, శ్లిష్, విష్, కృష్— దిహ్, మిహ్, లిహ్, గుహ్, రుహ్, తృహ్, వృహ్, స్తృహ్

(ఆ) ఈ ప్రక్రియకు ఉదాహరణముగా దిశ్ (చూపు) ను స్వీకరించవచ్చును.

| | పరస్మై | | | ఆత్మనే | |
|---|---|---|---|---|---|
| ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1. అ'దిక్షమ్ | అ'దిక్షావ | అ'దిక్షామ | అ'దిక్షి | అ'దిక్షావహి | అ'దిక్షామహి |
| 2. అ'దిక్షః | అ'దిక్షతమ్ | అ'దిక్షత | అ'దిక్షథాః | అ'దిక్షాథామ్ | అ'దిక్షధ్వమ్ |
| 3. అ'దిక్షత్ | అ'దిక్షతామ్ | అ'దిక్షన్ | అ'దిక్షత | అ'దిక్షాతామ్ | అ'దిక్షన్త |

(ఇ) దీనికి విధ్యర్థకములు లేవు. ఆజ్ఞార్థకములో పరస్మైపది మృక్షతమ్; ఆత్మనేపదిలో ధుక్షస్వ మాత్రము గన్పించుచున్నవి. దీనికి ఆసమాపక క్రియ లేదు.

ఆశీరర్థకము

**10.7** ఆశీరర్థకమును, సోష్మ అద్యతన భూతకాల ప్రకృతులచేత నేర్పడును. కావున దాని నిచ్చట సూచించుట యుచితము.

(అ) పరస్మైపదిలో దాతువునకు సరాసరిగా ఆశీరర్థక ప్రత్యయములు తగిలింతురు (చూ॥ 6.7 (ఇ) )

(ఆ) అత్మనేపదిలో, ధాతువులకు 'స్'గాని, 'ఇష్' గాని చేర్చి 6.7 (ఇ) లో సూచింపబడిన ఆత్మనేపద ప్రత్యయములు తగిలింతురు. అనగా వీని

ప్రత్యయములు ఉపచయ రహితముగా నుండి, స్-అద్యతనమునకుగాని, ఇష్-అద్యతనమునకు గాని చెందియుండును.

(ఇ) స్, ఇష్-అద్యతన భూతకాలముల ఆత్మనేపద ప్రత్యయముల వలెనే, ఆశీరర్థక, ఆత్మనేపద ప్రకృతులును బలీకరణమును బొందును. అనగా ధాత్వంతమగు అచ్చు ఉభయ రూపములలోను గుణీకరణము బొందును. మధ్యగతమగు అచ్చు 'ఇష్' రూపమున మాత్రము గుణీకరణమును బొంది, స్-రూపములో యథాతథముగా నుండును.

(ఈ) ఈ ప్రక్రియకు ఉదాహరణముగా భూ స్వీకరించుదము. ఇది ఆత్మనేపదిలో 'ఇష్' రూపమును బొందును ఇట్లు

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | భూయా'సమ్ | భూయా'స్వ | భూయా'స్మ | భవిషీ'య | భవిషీవ'హి | భవిషీమ'హి |
| 2 | భూయా'ః | భూయా'స్తమ్ | భూయా'స్త | భవిషీష్ఠా'ః | భవిషీయా'స్థామ్ | భవిషీధ్వ'మ్ |
| 3 | భూయా'త్ | భూయా'స్తామ్ | భూయాసుః | భవిషీ'ష్ట | భవిషీయా'స్తామ్ | భవిషీర'న్ |

ఆశీరర్థకమున ఆత్మనేపదరూపములు అర్వాచీన వాఙ్మయమున కానరావు. పరస్మైపదరూపములును చాలా అరుదుగా కాన్పించును.

## 108 (5) పునర్ద్విత్వ - అద్యతన భూతకాలము

ఈ ప్రక్రియలో ధాతువు పునర్ద్విత్వమును బొంది, ఉపచయ సహితముగా 'అ'యను పొడితోచేరి గౌణప్రత్యయములను బొందును. అందుచేనిది, ఒకవిధముగా, వర్తమానకాలములోని 3వ వర్గము, అనగా జుహోత్యాది వర్గమునకు చెందిన అపరోక్షభూతార్థక ప్రక్రియవలెనుండును. మరియొక్క విధమున జూచిన పరోక్ష భూతకాలము యొక్క అపరోక్షభూతార్థక ప్రక్రియవలెను (Pluperfect) ఉండును. ఐతే, దీనిలోని పునర్ద్విత్వీకరణము, పై రెండికిని భిన్నము.

(అ) పునర్ద్విత్వ ప్రక్రియ.

(1) పునర్ద్విత్వమును బొందు హల్లుల విషయమున, నిబంధనలు మామూలే.

(2) అచ్చులవిషయమున, అ, ఋ లు, సాధారణముగా పునర్ద్విత్వమున 'ఇ' కారముగా మారును (వర్తమానకాల ప్రకృతులలో గూడను సాధారణముగ నిది యింతే)

(3) ఐతే ఒక ముఖ్యభేదమేమియనగా, అసలు అచ్చు, పునర్ద్విత్వపు అచ్చును, ఒకటి లఘువైన మరియొకటి గురువగును. ముఖ్యముగా పునర్ద్విత్వపు అచ్చు గురువుగను, ధాతువులో నిలిచిపోయిన యచ్చు లఘువుగను ఉంచుట పరిపాటి. (దీనికి వ్యతిరేకముగా నుండు పరిస్థితులును గలవు)

(4) ధాతువులోని యచ్చు లఘువైనచో పునర్ద్విత్వాక్షరము గురువుగా నుండును.

ఇట్లు :—

అ'రీరిషమ్; అ'దూదుషమ్; అ'జీజనమ్; అవీవృధమ్; అ'చీక్లపమ్; ...

ఈ పునర్ద్విత్వ-అద్యతనభూతకాల ప్రక్రియలోని రూపములు చాలావరకు ఇటువంటివే.

(5) ధాతువు సంయుక్త హల్లుతో మొదలైనచో పునర్ద్విత్వమును బొందిన అచ్చు సహజముగనే గురువగును

ఇట్లు :- అ'చిక్షిపమ్; అ'చుక్రుధమ్; అ'తిత్రసమ్;

(6) ధాతువులోని యచ్చు గురువైనచో పునర్ద్విత్వాక్షరము యొక్క అచ్చుహ్రస్వమగును. ఈ సందర్భమున అ, ఆ, ఋలు పునర్ద్విత్వములో 'అ' యగును.

ఉదా :- అ'దధ్వావమ్; అ'బుభూషమ్; ... ... కాని అ'దదంక్షమ్; అ'దధ్వావమ్; అ'తతన్సమ్;.

(7) పునర్ద్విత్వమున ఈ భేదమును గొనివచ్చుటకు ఒక్కొకసారి ధాతువులోని యచ్చు గురువైనచో అది లఘువు చేయబడును.

ఉదా :- రాధ్ —> అ'రీరధమ్; సాద్ —> అ'సీషదమ్:

వాశ్ —> అ'వీవశమ్; జీవ్ —> అ'జీజివమ్ ;

దీవ్ —> అ'దీదిపమ్; భీష్ —> అ'బీభిషమ్;

సూచ్ —> అ'సూసుచమ్ ; క్రన్ద్ —> అ'చీక్రదమ్ ;
స్యన్ద్ —> అ'సిష్యదమ్
(చివరి రెండు ధాతువులలోని నకారము లోపించినది)

(8) ఈ ప్రక్రియలో అజాది ధాతువులు చాలా అరుదు.

(9) వీనిలోని విశేషరూపములు——

ద్యుత్ —> దిద్యుత; గుప్ —> జుగూప :

(ఆ) దీని ప్రక్రియ వర్తమానకాలములో అకారాంత ప్రకృతుల యపరోక్ష భూతార్థక ప్రక్రియవలె నుండును.

ఇట్లు జన్ —> ప్రకృతి జీజన

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అ'జీజనమ్ | అ'జీజనావ | అ'జీజనామ | అ'జీజనే | అ'జీజనావహి | అ'జీజనామహి |
| 2 | అ'జీజనః | అ'జీజనతమ్ | అ'జీజనత | అ'జీజనథాః | అ'జీజనేథామ్ | అ'జీజనధ్వమ్ |
| 3 | అ'జీజనత్ | అ'జీజనతామ్ | అ'జీజనన్ | అ'జీజనత | అజీజనేతామ్ | అజీజనన్త |

(1) ధాత్వంతమున ఋకారము సాధారణముగా సంప్రసారణముచే బలీయమగును. ఇట్లు ; అ'చీకరత్, అ'పీపరమ్, అ'తీతరన్, అ'వీవరన్, అ'దీధరత్,

(2) కొన్ని కొన్ని రూపములలో ప్రకృతిని ప్రత్యయమును కలుపు పొడి 'అ' లోపించియుండును. ఇది హలంత ధాతువులలోనే సంభవము. ఉదా॥ స్వప్—> సిస్వప్; శ్నథ్—> అ'శిశ్నత్;

(ఈ) పునర్ద్విత్వ - అద్యతనభూతము యొక్క భావార్థకములు

(1) మామూలుగా ఉపచయ రహితములగు సూచకార్థకములను, నిర్బంధార్థకములుగనో, ఆజ్ఞార్థకములుగనో, యుపయోగించుట పరిపాటి. అసలు నిర్బంధార్థకముల కన్న నివియే ఎక్కుడు సంఖ్యలో గనుపించును. ఇవి సాధారణముగా పునర్ద్విత్వాక్షరముపై ఉదాత్తము వహించియుండును.

(2) విధ్యర్థకములు చాలా అరుదు.

(ఇ) ఆజ్ఞార్థకములును అరుదే ఇట్టివి; పూపురస్తు; శిశ్రథన్తు, జిగృతా'మ్, జిగృత', దిధృత'మ్, దిధృత', ... మొదలగునవి.

(ఉ) పునర్ద్విత్వ-అద్యతనభూతమున అసమాపక క్రియలు గానరావు.

## సాధారణ - అద్యతనభూతము

**10.9** 6. ధాతు - అద్యతనభూతము.

ఈ ప్రక్రియ లౌకిక వాఙ్మయమున కేవలము కొన్ని ఆకారాంత ధాతువులకును, భూధాతువునకును మాత్రము పరిమితము దీనిలో ఆత్మనేపద ప్రక్రియలేదు. ఆత్మనేపద ప్రక్రియకై స్-అద్యతనమును గాని, ఇష్-అద్యతనమును గాని వాడుదురు. ఆకారాంత ధాతువులు పరస్మైపద 3 వ బహువచనమున 'ఉస్' అను ప్రత్యయమును బొందును. (దీనికి ముందుండు ఆకారము లోపించును). భూధాతువులోని యచ్చు మారక అట్లే నిలచియుండును. (పరోక్ష భూతకాల ప్రక్రియలో వలె). 1 వ ఏక, 3 వ బహువచనములలో వరుసగా అమ్, అన్ ప్రత్యయములకు ముందు వకారము నిక్షేపింపబడును.

ఇట్లు

| | పరస్మై | | | పరస్మై | | |
|---|---|---|---|---|---|---|
| 1. | అ'దామ్ | అ'దావ | అ'దామ | అ'భూవమ్ | అ'భూవ | అ'భూమ |
| 2. | అ'దాః | అ'దాతమ్ | అ'దాత | అ'భూః | అ'భూతమ్ | అ'భూత |
| 3. | అ'దాత్ | అ'దాతామ్ | అ'దుః | అ'భూత్ | అ'భూతామ్ | అ'భువన్ |

అర్వాచీన వాఙ్మయమునకు సంబంధించినంతవరకు ఈ కథ ఇంతటితో సరి. ఐతే

(అ) వేదములో ఇవియే ధాతువులు, ఈ ప్రక్రియలో చాలా విరివిగా వచ్చును. ఇట్టివి గా, దా, ధా, పా, స్థా. ఇవిగాక క్వాచిత్కముగా జ్ఞా, ప్రా, సా, హా ధాతువులును కన్పించును. భూధాతువు చాలా విరివిగా వచ్చును.

(ఆ) ఇవిగాక ఇకార, ఉకారములతోను (హ్రస్వములు, దీర్ఘములు) ఋకారముతోను ఉండు ధాతువులు అనేకములు ఈ ప్రక్రియలో ప్రయోగింపబడి కానుపించుచున్నవి. ఇవి, వర్తమానకాల ప్రకృతులకు వలె ఏకవచనమున మూడు పురుషల యందును గుణీకరణము బొందును. ఇట్టివి

శ్రు—> అ'శ్రవమ్, అశ్రోత్,
శ్రి—> అ'శ్రేత్, అ'శ్రేః
కృ—> అ'కరమ్, అ'కర్, అ'కర్మ, అ'కర్త, కర్మ;
వృ—> అ'వర్, వర్తమ్

(ఇ) కొన్ని కొన్ని ధాతువుల మధ్య గతమగు అచ్చు గుణీకరణమును బొందును (పిలగుచో)

ఉదా॥ భిద్—> అ'భేదమ్, ముచ్—> అ'మోక్, యజ్—> యోజమ్;
రుజ్—> రోక్, రుధ్—> అరోధమ్, అరుధ్మ;
వృత్—> అవర్త్, వృజ్—> వ'ర్క్, దృశ్—> అ'దర్శమ్;

(ఈ) అకారము మధ్యగతమగు ధాతువులలో గమ్ చాలా ముఖ్యమైనది. ఇది చాలా విరివిగా వాడబడి యనేక రూపములలో కన్పించును.

అ'గమన్, అగన్, అ'గన్మ, అగన్త, అ'గ్మన్:......
ఇట్లే క్రమ్—> అ'క్రన్, తన్—> అ'తన్, భ్రాజ్—> అభ్రాట్
స్కన్ద్—> అస్కన్, దఘ్—> ధక్, ధఘ్మ;
నశ్—> అ'నట్; అనష్టామ్;
ఘస్—> అ'ఘస్, అఘత్, అఘస్తామ్; అఘస్త; అక్షన్;

(ఉ) ఇంతవరకు పరస్మై పదిలోని రూపముల విచారించితిమి.

దీనియాత్మనే పదప్రక్రియ స్-అద్యతన భూతకాలమునకు చెందుననియు, ఐతే దానిలోని సకారము లోపించుననియు వ్యాకర్తల నిర్ధారణము. ఐతే, అవి యన్నియు ధాతు-అద్యతన భూతకాలమునకు చెందిన ఆత్మనే పదప్రక్రియా రూపములుగా పరిగణించిన వచ్చు విప్రతిపత్తి ఏదియులేదు. ఇట్టివి అధీథాః; అధిత; అధీమహి; అదిథాః; అదిత; అదిమహి (అదిమహికూడను.

దా (ఛేదించు) నుండి;) అసీత; సీమహి; అ'స్థిథాః; అ'స్థిత; అక్రి; అ'కృథాః; అ'కృత; అ'క్రాతామ్; అక్రత మొదలగునవి.

ఇట్లే హలంత ధాతువులనుండి యుత్పన్నమైన ఆత్మనేపదరూపములు అయుజి; అయుక్థాః; అయుజ్మహి; అయుగ్ధ్వమ్; అ'యుజ్రన్; అ'ష్ట; న'స్మి; అపద్మహి; అత్నత; అ'జని; అగథాః, అగత; అతథాః; అతత మొదలగునవి.

(ఈ) ధాతు-అద్యతనముయొక్క భావార్థకములు.

(1) ఉపనయరహితములగు సూచకార్థకములే నిర్బంధార్థకమున చాలా విరివిగా ప్రయోగింపబడినవి. ఐతే అసలైన నిర్బంధార్థక ప్రత్యయములతో గూడిన ప్రయోగములును కొన్ని గలవు. వానినన్నిటిని ఏకరువుపెట్టుట యనవసరము. ఈ నిర్బంధార్థకము ముఖ్య ప్రత్యయములతోడను, గౌణ ప్రత్యయములతోడను ఏర్పడుటకద్దు.

( ) విధ్యర్థకము

ఈ ప్రక్రియయొక్క పరస్మైపదిలో విధ్యర్థకసూచకమగు పొడి 'యా' కును పురుషప్రత్యయమునకును మధ్య సకారము జొనిపినచో ఆశీరర్థక పరస్మైపదరూపములు సిద్ధించును. ఐతే ఈ రెంటికినిగల సంబంధము వైయాకరణులు గుర్తించినట్లులేదు. వేదమున శుద్ధమైన విధ్యర్థకములు (స్‌తో చేరనివి) ఈ ప్రక్రియచే కొన్ని యేర్పడుచున్నవి. ఇట్టివి దేయమ్, ధేయుః, స్థేయామ, భూయా'మ, క్రియామ, అస్యా'మ్, అస్యా'మ, అస్యుః ... మొదలగునవి.

(3) ఆశీరర్థక పరస్మైపదరూపములు వాఙ్మయముయొక్క తొలిదశ నుండియు కన్పించును. ఇట్టిధాతువులన్నిటికిని, ఇతర ప్రక్రియల యందు రూపములు గన్పించును.

(4) ధాతు - అద్యతనము యొక్క ఆజ్ఞార్థకములు పరస్మైపదిలో ప్రాచీనకాలమునుండియు కనుపించును. ఐతే ఆత్మనేపదిలో 2వ, ఏకవచన రూపములు మాత్రమేకాననగును. ఇట్టివి కృష'్వ, ధిష్వ, యుక్ష'్వ, మ'త్స్వ, య'క్ష్వ, వన్స'్వ, రాస'్వ, ... ...

(5) అసమాపక క్రియలు.

ఇవి పరస్మైపదిలో కొన్ని రూపములు మాత్రము కన్పించును. ఇవి క్ర'న్త్, చిత'న్త్, గ్మ'న్త్, స్థాన్త్, బిధ'న్త్, వృధన్త్, ద్యన్త్,

ఆత్మనేపదిలో ఇంతకన్నా చాలారూపములు గన్పించును.

వీనిలో ఉదాత్తము సాధారణముగా ప్రకృత్యంతమున నుండును. ఇట్టివి అరాణ', ఇధాన', క్రాణ',

వీనిలో ఉదాత్తములేని రూపములును గలవు.

## 10.10 7. అ-అద్యతన భూతకాలము

అర్వాచీన వాఙ్మయములో ఈ ప్రక్రియ చాలాధాతువులకు వర్తించును. ఐతే, దీనిలో ఆత్మనేపదరూపములు చాలా అరుదు. వీని ఆత్మనే పదప్రక్రియ స్-వర్గమునకు కాని ఇష్-వర్గమునకుగాని చెందిన అద్యతన భూతార్థక్రియా ప్రక్రియకు చెందును.

ఈ ప్రక్రియ అ'-వర్గమునకు చెందిన ధాతువులయొక్క వర్తమానకాల అపరోక్షభూతార్థక ప్రక్రియను ఎల్లవిధముల పోలియుండును. ధాతువు, బలహీన రూపమున నుండును. (ఋకారధాతువులకు తప్ప. వీనికి గుణాదేశముండును. ఇట్టివి మూడు, నాలుగు ధాతువులు మాత్రమే యున్నవి.)

(అ) ఈ ప్రక్రియకు ఉదాహరణముగా సిచ్ స్వీకరించుదము.

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | అ'సిచమ్ | అ'సిచావ | అ'సిచామ | అ'సిచే | అ'సిచావహి | అ'సిచామహి |
| 2 | అ'సిచః | అ'సిచతమ్ | అ'సిచత | అ'సిచథాః | అ'సిచేథామ్ | అ'సిచధ్వమ్ |
| 3 | అ'సిచత్ | అ'సిచతామ్ | అ'సిచన్ | అ'సిచత | అ'సిచేతామ్ | అ'సిచన్త |

(ఆ) ధాతు-అద్యతనమునకు చెందిన ధాతువు లనేకములు ఈ వర్గమునకు బదిలీ చేయబడినవి ముఖ్య ఉదాహరణము - అకరత్. అగమత్,...

ఈ ప్రక్రియ ఋగ్వేదములో స్వల్పముగా కన్పించినను. రాను రాను అధర్వవేదమునను, బ్రాహ్మణముల యందును ఎక్కువ వ్యాప్తిని బొందినది. వీనిలో చాలా ధాతువుల వర్తమానకాల ప్రకృతులు అ'-వర్గమునకు చెందినవి.

ఇట్టివి

ఛిద్, భిద్, నిజ్, రిచ్, రిష్, లిప్, విచ్, శిష్, శ్రిష్, శ్లిష్, సిచ్, స్రిధ్, క్రుధ్, క్షుధ్, గుహ్, దుష్,ద్యుత్, ద్రుహ్, పుష్, బుధ్, భుజ్, ముచ్,మ్రుచ్ యుజ్, రుచ్, రుద్, రుధ్, ముహ్, రుహ్, శుచ్, ఋధ్, కృత్, గృహ్, తృప్, తృష్, తృహ్, దృప్, దృశ్, నృత్, మృధ్, మృష్, పృత్, వృధ్, వృష్, సృప్, హృష్; ... ...

ఆకారాంత ధాతువులు కొన్ని - ధాత్వద్యతనమునకు చెందవలసినవి- అకారాంతములుగా మార్చివేయబడి, ఈ వర్గమున చేర్చబడినవి. ఇట్టివి ఖ్యా, హ్వా, వ్యా, శ్యా, దా, ధా; ...

ఉపదాస్థానములో నకారముగల కొన్ని - ధాతువులు ఈ ప్రక్రియలో తమ నకారమును కోల్పోవును. ఇట్టివి. భ్రన్శ్, తన్స్, ధ్వన్స్, స్రన్స్, క్రన్ద్, రన్ధ్; ...

ఇవిగాక ఏ సూత్రమునకునురాని ధాతువులు కొన్ని అశ్, క్రమ్, గమ్, ఘస్, తమ్, శమ్, శ్రమ్, తన్, సన్, సధ్, ఆప్, హస్, యాస్, శక్, దఘ్ మొదలగునవి ఈ ప్రక్రియలోనికి వచ్చును.

(ఇ) భావార్ధకములు.

ఉపచయ రహితములగు సూచకార్ధకములు, నిర్బంధకార్ధకముగనో, ఆజ్ఞార్ధకముగనో ప్రయోగింపబడినవి పెక్కులు గలవు.

విధ్యర్థకములు ఋగ్వేదమున చాలా కొలదిగా కన్పించినను, రాను రాను, బ్రాహ్మణములలోనివి విరివిగా వ్యాపించినవి.

ఉదా॥ భిదేయమ్, విదేయమ్, సనేయమ్, విదేః, గమేః; ...

ఆజ్ఞార్ధకములలో ముఖ్యమైనది సద్ నుండి. ఇతర ధాతువులనుండి వచ్చినవి చాలా స్వల్పములు. ఇవి

స'న, స'ర, రుహ, విద'; రుహతమ్; విద'తమ్; ఖ్య'త; ... ...

(ఈ) అసమాపక క్రియ.

ప్రసస్మైపదిలో తృప'న్త్; రి'షన్త్; వృధన్త్; శిశన్త్; శుచన్త్; ఆత్మనేపదిలో గుహమాన, గుహ'మాన; ధృష'మాణ; ... ...



# 11. క్రియాజన్య విశేషణ విశేష్యములు

## అసమాపకక్రియలు, క్రియాజన్యవిశేష్యవిభక్తులు, సమాపకక్రియలు

(Participles, Infinitives and gerunds)

**11.1** కాలసూచక క్రియాప్రకృతులచే నేర్పడు అసమాపక క్రియలు ఇది వరలో సూచింపబడినవి. ఇతరవిధములగు నసమాపకక్రియలు ఇందుచర్చింప బడును. ప్రస్తుతప్రకరణమున చర్చించబడు అసమాపకక్రియలు, క్రియా జన్య విశ్యేష్యవిభక్తులు; సమాపకక్రియలును, కాలసూచక క్రియా ప్రకృతులచే గాక సరాసరి ధాతువులనుండియే యుత్పన్నములగును.

I త 'లేకన'తో అంతములగు కర్మణ్య సమాపకక్రియలు.

**11.2** ఉదాత్త సహితమగు త' (లేక ఇత')తోను, కొన్నిమారులు ఉదాత్త సహితమగు న'తోను అంతమగు క్రియాజన్యవిశేషణములు, ఆక్రియ సకర్మక క్రియయైన, దానికి కర్మగానుండిన నామవాచకము యొక్క గుణసూచకముగా నుండును. ఇట్లు : దత్త' = ఇవ్వబడిన ; ఉక్త' = చెప్పబడిన:...అందుచే వీనిని కర్మణ్య సమాపక క్రియలందురు. వర్తమానకాల కర్మణి ప్రకృతులచే నేర్పడు అసమాపకక్రియల (క్రియమాణ'—వంటివి) కును, వీనికిని ఉండుభేద మును సూచించుటకు వీనిని భూతార్థకకర్మణ్యసమాపకక్రియలు (Past passive participles) అందురు. అట్లుగాక నివి యకర్మక క్రియలచే నేర్పడినచో కేవలము భూతార్థమును మాత్రమును సూచించును. గత'=పోయిన; భూత'= అయిన: పతిత'=పడిన:

**11 3** (అ) సాధారణముగా నీయసమాపక క్రియలు, ధాతువునకు సరాసరి 'త'చేర్చినచో నేర్పడును. కొన్నియెడల దీనిని అతుకుటకు 'ఇ'యను పొడి యును చేర్చబడును. కొన్నిధాతువులకు ఉదాత్తసహితమగు 'న' చేర్చుటచే గూడ విని యేర్పడును. ఐతే వీనిలో పొడిరాదు.

'త''కు ముందున్న ధాతువు బలహీనరూపముననుండును-కారణము ఉదాత్తము ప్రత్యయముపై నుండుట ఇట్లు

(1) ఉపధాస్థానముననున్న యనునాసికము బహుళముగా లోపించును.

అఞ్జ్—> అక్త'; బన్ధ్—> బద్ధ'; స్రంభ్—> స్రబ్ధ; దంశ్—> దష్ట'.

(2) పరోక్షభూతకాల ప్రకృతుల బలహీనరూపమున సంకోచమును బొందు ధాతువులు, ఇందును సంకోచమును బొందును. (సంప్రసారణము మొదలగునవి)

ఉదా॥ వచ్ —> ఉక్త' : వస్ (ప్రకాశించు) —> ఉష్ట''; వప్—> ఉప్త';

వహ్—> ఊఢ', స్వప్—> సుప్త', యజ్—> ఇష్ట', వ్యధ్—> విద్ధ', ప్రఛ్—> పృష్ట';

(3) ధాత్వంతముననున్న 'ఆ' బలహీనమై 'ఈ'గా మారును.

గా—> గీత', ధా—> ధీత', పా—> పీత'.

జ్యా; వ్యా, శ్యాలనుండి వరుసగా జీత', వీత', శీత' ఉత్పన్నములగును.

కొన్నిసార్లు ఇది మరీదుర్బలమై ఇకారముగా మారును.

ఉదా॥ ఛా—> ఛిత', దా—> దిత', మా (కొలుచు)—> మిత',

ఇట్లే శిత', సిత', స్థిత' మొదలగునవి.

(4) కొన్ని యెడల ధాత్వంతముననున్న 'అమ్'లోని మకారములోపించును. ఇట్లు గమ్—> గత', నమ్—> నత', రమ్—> రత',

ఇట్లే 'అన్'అంతమునగల ధాతువుల యొక్కయు నకారము లోపించును. వీనిచే క్షత', తత', మత', హత' మొదలగు రూపములేర్పడును.

(అ) విశేషరూపములు.

(1) పై జెప్పబడినదానికి విరుద్ధముగా కొన్నిధాతువులలోని మకారము లోపింపకపోగా అకారము దీర్ఘీకరింపబడును. ఇట్లు

కాంత', క్రాంత', క్లాంత', క్షాంత', చాంత', తాంత', దాంత', భ్రాంత', వాంత', శాంత', శ్రాంత', మొదలగునవి ఇట్లే

ధ్వన్ —> ధ్వాంత';

( ) రెండురూపములు గలవి ముగ్ధ'; మూఢ'
సాఢ'; సోఢ'
ధూర్త'; ధ్రుత'
హ్వృత'; హ్రుత':

(3) దా —> దత్త'

(ఆ) ఇకారపూర్వకమగు అనుసర్గ 'ఇత' కొన్ని ధాతువులచే, ముఖ్యము ఉచ్చారణ కాఠిన్యమేర్పడుచోట్లను, గౌణప్రక్రియలోని క్రియలచేతను, స్వీకరి బడును. ఇట్లు

ఉచ్చారణ కాఠిన్యమేర్పడుచోట్లు

( i ) సంయుక్త హలంత ధాతువులు.

శంక్, వల్గ్, వాంఛ్, లజ్జ్, ఉబ్జ్, చేష్ట్, నింద్, జల్ప్, చుంబ్, ఉ ఖల్ల్, పిన్వ్, శంస్, రక్ష్, వింస్, గర్హ్;...

( ) మూర్ధన్యములతో నంతమగుధాతువులు.

అట్, త్రుట్, పఠ్, లుఠ్, ఈడ్, వృడ్, భణ్, కష్, భాష్, ...

(3) ఘోష పరుషములతో నంతమగు ధాతువులు

లిఖ్, గ్రథ్, నాథ్, కుథ్, రిఫ్, గుఫ్,

(4) 'ల్'తో అంతమగు ధాతువులు

చల్, గిల్, మీల్, లుల్, ఖేల్,

(5) కొన్ని యంతస్థములతో నంతములగు ఇతరధాతువులు

చర్వ్. జీవ్, ధావ్, సేవ్, దయ్, వ్యయ్,

(6) ఉఖ్

(ఇ) ఇతరములు.

హల్లులతో నంతమగునవి—చక్ (రెండురూపములుగలవు)

ఢౌక్, శ్లాఘ్, అచ్, ఉచ్, కుచ్, ఖచ్, యాచ్, రుచ్, కూజ్, వ్రజ్, అట్, పట్, స్ఫుట్, క్రథ్, ఖాద్, గద్, చుద్, నద్, ముద్, మృద్, రక్ష్, రుద్, వద్. విథ్, (తెలియు) (దకారముతో అంతమగుధాతువులలో విస్తారము న' ప్రత్యయమును స్వీకరించును) ఏధ్, క్షుధ్, గధ్, దుధ్, నాథ్, బాధ్, అన్, ఇన్, క్వన్, ధ్వన్, పన్, రన్, (మ్రోగించు), వన్, స్తన్, స్వన్, ధ్వన్, (ధ్వాంత' యనురూపమును గలదు) చుప్, యుప్, రుప్, జప్ (దీనికి ఉభయరూపములు గలవు), గ్రభ్, శుభ్, స్కభ్, తిమ్, థమ్ శమ్ (కష్టించు), స్తిమ్, క్షమ్, అశ్, ఈశ్, కాశ్, కృశ్, వాశ్, శాశ్, ఈష్, కుష్, తృష్, త్విష్, ప్రుష్, మిష్, రూష్, హేష్, ఆస్, భాస్, రస్, లస్, వస్,

(ఈ) సాధారణముగా 'ఇత'' యను అనుసర్గకు ముందున్న ధాతువు సంపూర్ణరూపముననుండును. ఐతే దీనికి కొన్ని యపవాదములును కలవు.

(ఉ) కొన్నిధాతువులు 'త''కు బదులుగా 'న'' యను అనుసర్గను స్వీకరించును. వీనిలో ఇడాగమము రాదు. ఇట్టివి

( i ) 'ఆ'తో అంతమగు కొన్నిధాతువులు

జ్ఞా, గ్లా, ద్రా (పరుగెత్తు), ద్రా (నిద్రించు), మ్లా; వా (వాత'గూడను), శ్యా, స్త్యా, హా (వదలివేయు)—హీన', హాత' యనురూపములును గలవు)

(ii) ఈ, ఊ లతో అంతమగు కొన్నిధాతువులు

క్షి (నశింపజేయు—క్షీణ', క్షిత'యను రెండురూపములుగలవు)

దీ, పీ, లీ, ల్డీ, శీ, దూ (తగులబెట్టు), లూ, శూ,

(iii) ఋకారముతో అంతమగుధాతువులు_వానిలోని ఋకారము 'ఈర్' గనో 'ఊర్'గనో మారునవి.

కౄ (చల్లు)—> కీర్ణ, గౄ (మ్రింగు) —> గీర్ణ', జౄ—> జీర్ణ', దౄ (గుచ్చు)—> దీర్ణ', పౄ—> పూర్ణ' (పూర్త, పృత అనురూపములును గలవు)

మౄ (నలుగగొట్ట—> మూర్ణ', శౄ గలుగగొట్టు—> శీర్ణ',

స్తౄ (పరచు)—> స్తీర్ణ';

(iv) కొన్నిధాతువులు జకారముతో అంతమగునవి—వీనిలోని జకారము అంతస్సంధి నియమములకు విరుద్ధముగా గకారముగా మారును.

భంజ్ —> భగ్న; భుజ్ (వంచు)—> భుగ'్న, మజ్ —> మగ్న;

రుజ్ —> రుగ్ణ'

ఇట్లే చకారముతో అంతమగుధాతువులు.

అచ్ —> అక'్న; వృశ్చ్—> వృక్ణ',

గకారముతో అంతమగు లగ్ —> లగ'్న; ... ...

(v) దకారముతో అంతమగు పలుధాతువులు 'న'' స్వీకరించును.

ఇట్టివి :— ఉన్న, అర్ణ్ణ, క్లిన్న, క్షుణ్ణ, క్ష్వేణ్ణ, ఖిన్న, ఛన్న, ఛిన'్న, ఛృణ్ణ, తున్న, తృణ్ణ'; నున'్న (దీనికి ఉభయరూపములుగలవు) ... పన'్న, భిన'్న, శన్న [శథ్ (పతు)నుండి];

సన్న; స్కన్న (స్కన్ద్‌నుండి), స్యన్న (స్యన్ద్‌నుండి), స్విన'్న, హన్న,

ఇట్లే అద్‌నుండి అ'న్న (ఆహారము) వచ్చినట్లు గోచరించును.

—దీనిలోని యుదాత్తస్థానము మారియున్నను.

## 11.4 తవన్త్ (లేక నవన్త్)తో అంతమగు భూతార్థక కర్త్ర్యసమాపక క్రియలు.

(Past Active Participles)

పైజెప్పబడిన భూతార్థక కర్మణ్యసమాపకక్రియకు 'వన్త్' అను స్వత్వార్థక అనుసర్గను చేర్చుటచే భూతార్థక కర్తరి అసమాపకక్రియ ఏర్పడును.

ఉదా॥ త'త్ కృత'వాన్ (దానిని చేసి)

తమ్ నిగీర్ణవాన్ (వానిని మ్రింగి) దీని సుబంత ప్రక్రియ మామూలే వీని స్త్రీ లింగరూపములు 'వతీ' చేత నంతమగును. ఉదాత్త మెల్లప్పుడును అసమాపక క్రియపైననే యుండును.

## 11 5 భవిష్యత్కర్మణ్య సమాపకక్రియలు; సమాపకక్రియారూపములు.

(Future Passive Participles; Gerundives)

కొన్ని క్రియాజన్య విశేషణములు, భవిష్యత్కాలములో జరుగు క్రియకు కర్మగానుండిన విశేష్యముల గుణములను సూచించును. వీనిని భవిష్యత్కర్మణ్య సమాపకక్రియలందురు. ఇవి లాటినుభాషలోని 'ndus'తోఅంతమగు అసమాపక క్రియలకు అనురూపములు.

పై జెప్పబడిన యసమాపకక్రియలు మూడువిధములగు అనుసర్గలచే నేర్పడును. అవి-య; తవ్య; అనీయ యనునవి 'య' అను అనుస్గచే నేర్పడు అసమాపకక్రియలు ప్రాచీనార్వాచీన వాఙ్మయములతో బహుళములు. మిగిలినవి యరుదు.

(ప్రాచీన వాఙ్మయమున లేవనియే చెప్పవలయును).

వీనిలో

(అ) 'య' అను అనుసర్గవేదమున 'ఇ-అ' యని యుచ్చరింప బడ వలసియుండును. అందుచేతనే దీనికిముందున్న ఏ, ఓలు వరుసగా 'అయ్', 'అవ్'గా మారును. ఇట్లు

(1) ధాత్వంతమున నున్న ఆకారము 'ఏ'గా మారును. దే'య; ధ్యే'య; ఖే'య; మే'య; ... ...

(2) ఇతర స్వరములు మారక యట్లే యుండును. లేదా గుణీకరణ మును గాని వృద్ధీకరణమునుగాని పొందును. ఇట్లు—క్షయ్య; జ'య్య; భ'య్య; న'వ్య; ...

కొన్ని కొన్ని మారులు ధాత్వంతమున హ్రస్వ స్వరముండినచో దానికి తకారము చేర్చబడును. ఇట్లు ఇత్య, మిత్య; శ్రు'త్య; స్తు'త్య; కృత్య; . . .

(3) మధ్యగతమగు అకారము అట్లే నిలిచియుండును - లేదా దీర్ఘీక రింపబడును. ఇట్లు—ద'భ్య; వ'స్వ్య; స'ద్య; మా'ద్య; వా'చ్య

(4) మధ్యగతములగు ఇ. ఉ, ఋ లు అట్లే నిలచియుండును—లేదా గుణీకరణముల బొందును ఇట్లు:- ఈ'డ్య, గు'హ్య, ధృష్య, ద్వేష్య; యోధ్య; మ'ర్జ్య; ... ...

(ఆ) 'తవ్య' అనునది గౌణప్రత్యయము. అనగా నిది సరాసరి ధాతువు నకు గాక, దానినుండి జన్యములగు నామవాచకములకు—తు, అంతమునగలవి- య' (ఇఅ) అనుస్గను చేర్చుటచే నేర్పడును. దీని ముందున్న ఉకారము.

మామూలుగా, గుణీకరణమును బొంది 'అవ్'గా మారును. కావున ధాతు రూపములకును, ఇడాగమవిషయమునను, ముందు చెప్పబోవు క్రియాజన్య విశేష్య విభక్తుల నియమములే (చూ॥ 11.6) ఇచ్చటను వర్తించును.

(ఇ) 'అనీయ' యను ప్రత్యయమును గౌణప్రత్యయమే. ఇది 'అన' యను అనుసర్గ'ను చేర్చుటచే నేర్పడు క్రియాజన్య నామవాచకమునకు 'ఈయ' యను అనుసర్గను చేర్చుటచే నేర్పడు విశేషణము.

ఇట్లు :- ర'క్ష్ + అన + ఈయ = ర'క్షణీయ.
క'ృ + అన + ఈయ = కరణీయ
తప్ + అన + ఈయ = తపనీయ.

ఈ పై జెప్పబడిన సమాపకక్రియా రూపములు (gerundives) గాక, వేదమున పలువిధములగు సమాపకక్రియారూపములు గన్పించుచున్నవి. వీనిలో కొన్ని (i) 'తుఅ' లేకత్వ' యను ప్రత్యయముచే నంతమగునవి — జేతుఅ; న'మ్తుఅ; గంత్వ; హోత్వ; మొదలగునవి. (ii) 'ఏనిఅ' లేక 'ఏన్యతో' అంతమగునవి—ఈక్షేణ్య, ఈడే'నిఅ; వ'రేణిఅ; ... ...

(iii) అ'య్యతో అంతమగునవి : పనా'య్య (మెచ్చుకోదగిన) స్పృహయాయ్య (కోరుకోదగిన) ...

(iv) 'తవ్యే'తో అంతమగునవి— జనితవ్యే; హింసితవ్యే; ...

## 11 6 క్రియాజన్య విశేష్య విభక్తులు

(Infinitives)

అర్వాచీన వాఙ్మయమున ఒకే ఒక క్రియాజన్యవిశేష్యవిభక్తి కలదు. అది, ధాతువునకు 'తు' లేక 'ఇతు' చేర్చుటచే నేర్పడునామవాచకముయొక్క ద్వితీయా విభక్తిరూపము. కావున దీనిని సూచించు ప్రత్యయము 'తుమ్' లేక 'ఇతుమ్' అగును. దీనిలోని ధాతువు గుణీకరణమును బొంది యుదాత్తమును వహించును. ఇట్లు ;—

ఇ—> ఏ'తుమ్ (పోవుటను) కృ—> క'ర్తుమ్ (చేయుటను)

చర్—> చ'రితుమ్ (కదలుటను), భూ—> భ'వితుమ్ (అగుటను)

ఇడాగమ విషయమున నిది కర్మణ్యసమాపక క్రియవలెనే ప్రవర్తించును. ఐతే అసమాపక క్రియలలోవలె గాక దీనిలోనిధాతువుబలీయరూపమున నుండును.

పైజెప్పబడిన 'తుమున్' ప్రత్యయాంతము అర్వాచీన వాఙ్మయమునవచ్చు ఒకే ఒక క్రియాజన్య విశేష్య విభక్తియైనను, ఇది ఋగ్వేదమున ఐదుచోట్లనే కన్పించును. వేదమున కన్పించురూపములు.

(అ) ద్వితీయా విభక్తికి సంబంధించినవి—

పైజెప్పబడిన తుమున్ ప్రత్యయాంతములుగాక 'అమ్' అను ప్రత్యయము జేరినవి. ఇది ధాతువుయొక్క బలహీనరూపమునకు చేర్చబడియుండును. ఈ ధాతువులు సాధారణముగా హలంతములై యుండును. (ధా, మీ, తౄ—తప్ప) సాధారణముగా నివి యెల్లను ఉపసర్గలచే చేరియుండును. ఉదా॥ సమ్-ఇ'ద్-అమ్ (వెలిగించుటను): సమ్-పృ'ఛ్-అమ్ (అడుగుటను); ఆ-రు'హ్-అమ్ (ఎక్కుటను): ప్రతి-ధా' - అమ్ (పైనుంచుటను): ప్ర-మీ'య్-అమ్ (అశ్రద్ధ చేయుటను): ప్ర-తి'ర్-అమ్ (పొడిగించుటను)

(ఆ) చతుర్థీ విభక్తికి సంబంధించినవి—

ఋగ్వేదమున నివియేబహుళము ఇవి సాధారణముగా 'ఏ'తో అంత మగును. ఇది ధాత్వంతముననున్న 'ఆ'తో కలిసి ఐ యగును. ఇందును ధాతువులు ఉపసర్గతో కలిసివచ్చుట పరిపాటి. ఇట్లు

(1) అజంత ధాతువులలో దా—> పరా—దై' (వదలివేయుటకొరకు)

హి—> ప్ర-హ్యై (పంపుటకొరకు): మీ—> మి'యే

(క్షీణించుటకొరకు): భూ—> భువే' (ఉండుటకొరకు)

తౄ—> తిరే' (తరించుటకొరకు). హలంతధాతువులలో కొన్ని; దృశే' (చూచుటకొరకు): వా'చే (మాట్లాడుటకొరకు):

గ్ర'భే (పట్టుకొనుటకొరకు): ఇ'ధే (వెలిగించుటకొరకు)

(2) అస్—అంతమునగల జన్యప్రకృతులచే నేర్పడునవి.—

అయ్—అస్-ఏ (పోవుటకొరకు): చక్ష్-అస్-ఏ (చూచుటకొరకు) చర్-అస్-ఏ (నడచుటకొరకు): వృక్ష్య-అస్-ఏ (వృద్ధి పొందుటకొరకు)

(3) 'ఇ'తో అంతమగు జన్య ప్రకృతులచే నేర్పడునవి.

తుజ్_అ'య్_ఏ (పొందుకొరకు) : దృశ్-అ'య్_ఏ (చూచుట కొరకు): యుధ్-అ'య్-ఏ (యుద్ధముచేయుటకొరకు)

సన్_అ'య్-ఏ (జయించుటకొరకు): గృహ్-అ'య్-ఏ (పట్టుటకొరకు) చిత్_అ'య్_ఏ (తెలియుటకొరకు)

(4) 'తి'తో అంతమగు జన్యప్రకృతులతో నేర్పడునవి—

ఇష్-ట'య్_ఏ (to refresh) : పీ-త'య్ - ఏ (త్రాగుటకొరకు): సా_త'య్-ఏ (జయించుటకొరకు)

(5) తు తో అంతమగు జన్యప్రకృతులచే నేర్పడునవి

(ఒక్కొక్కసారు దీనితో ఇడాగమము వచ్చును)

అద్_తవ్-ఏ (తినుటకొరకు): ఏ_తవ్_ఏ (పోవుటకొరకు): పా'-తవ్-ఏ (త్రాగుటకొరకు)

ఇట్లే క'ర్తవే: గ'ంతవే: భ'ర్తవే: య'ష్టవే: వ'క్తవే: వ'స్తవే: చ'రితవే: స'వితవే: స్ర'వితవే: హ'లితవే: ... ...

(6) 'తవా'' అంతమునగల జన్యప్రకృతులచే నేర్పడునవి.

(ఈ పదములలో రెండుచోట్ల ఉదాత్తముండుట గమనింపదగినది) ఒకటి ధాతువుపైనను, రెండవది యనుసర్గపైనను)

ఏ'తవై': గ'న్తవై': పా'తవై': మ'న్తవై': య'మితవై': స్ర'వితవై:'

(7) 'అధ్యా' అంతమునగల జన్యప్రకృతులచే నేర్పడునవి. (ఇవి ఋగ్వేదముననే కన్పించును): ఇ'యధ్యై: (పోవుటకొరకు) గ'మధ్యై: చ'రధ్యై: స్తు'వధ్యై: హువధ్యై: వర్తయధ్యై: ... ...

(8) 'మన్' అంతమునగల జన్యప్రకృతులచే నేర్పడునవి

త్రామణే (రక్షించుటకొరకు): భ'ర్మణే (భరించుటకొరకు) విద్'మనే (తెలియుటకొరకు)

(9) 'వన్' అంతమునగల జన్యప్రకృతులచే నేర్పడునవి

దావనే (ఇచ్చుటకొరకు): ధూ'ర్వణే (హానికలిగించుట కొరకు) ...

(ఇ) పంచమీ-షష్ఠీ విభక్తులకు సంబంధించినవి

ఇవియు రెండువిధములగు ప్రకృతులచే నేర్పడును-అస్ అంతమునగలవి మరియు తోస్ అంతమున గలవి. వీనిలో

(1) అస్ అంతమునగల జన్య ప్రకృతులచే నేర్పడునవి పంచమీ విభక్తికి మాత్రమే పరిమితములు. ఇవి ఆ-తృద్-అః; అవ-పద్-అః: సం-పృచ్-అః: మొదలగునవి.

(2) 'తోస్'తో అంతమగునవి రెండువిభక్తులను సూచించును. ఇవి ఏతోః (పోవుటనుండి; పోవుటయొక్క): జ'నితోః: ని'ధాతోః: హన్తోః: శరితోః: క'ర్తోః: దా'తోః: ... ...

(ఈ) స'ప్తమీ విభక్తికి స'ంబంధించినవి. వీనిలో

(1) ఇతో అంతమగునవి—స'ంచక్షి (చూచుటయందు): దృశి': బుధి: మొదలగునవి.

(2) 'తర్'తో అంతమగు జన్యప్రకృతులచే నేర్పడునవి—

ధర్తరి: ... ... మొదలగునవి

(3) 'సన్'తో అంతమగు జన్యప్రకృతులచే నేర్పడునవి.

నేషణి (తీసికొనిపోవుటయందు): గృణీషణి (పాడుటయందు) వి'చర్షణి (కదిలించుటయందు): ...

## 11.7 సమాపకక్రియలు

(Gerunds)

సమాపక క్రియయును, క్రియాజన్యవిశేష్యమునకుసంబంధించిన తృతీయా విభక్తిరూపమే. ఇది ప్రధానక్రియకు ముందుగా జరిగిన క్రియను సూచించి కర్తకు అనుబంధముగా నుండును. ఈ సమాపకక్రియలు, అర్వాచీన వాఙ్మయమున త్వా', య, అను రెండు అనుసర్గలచే నేర్పడును. వీనిలో మొదటిది శుద్ధ ధాతువులకును రెండవది ఉపసర్గపూర్వక ధాతువులకును చేర్చబడియుండును. ఐతే రెండవదాని విషయమున వేదములో నీ నియమములేదు.

(అ) 'తా'్వ' యను అనుసర్గతో నేర్పడు సమాపకక్రియలు ధాతువునకు సరాసరి అతికించబడును. (ఒక్కొకసారి 'ఇ' యను పొడితో గూడను). అనుసర్గపై ఉదాత్తముండును. గావున దీనితో కలియు ధాతువు బలహీన రూపముననుండును. త'తో అంతమగు భూతార్థక కర్మణ్యసమాపక క్రియలలో వలె

ఇట్లు :—

ధా——> ధతా'్వః దా——> దతా'్వః భా——> భాయితా'్వః

వద్——> ఉదితా'్వఃవచ్——> ఉక్త్వా'ః బంద్——> బధా'్వః . . .

(ఆ) 'య' అను అనుస'ర్గము సరాసరిధాతువునకే యతికించబడును. ఐతే ఈ ధాతువు బలహీనరూపమునసుండి ఉదాత్తమును వహించును.

సూచన :- రెండురూపములలో ధాతువు బలహీనరూపమున యుండుట గమనించదగినది. ఐతే మొదటిదానిపై యుదాత్తముండదు. రెండవది ఉదాత్తమును వహించును.

(హ్రస్వస్వరములతో అంతమగు ధాతువుల విషయమున నీ యనుసర్గ 'త్య' యగును. ఇట్లు-జి'త్యః స్తు'త్యః కృ'త్య . . . మొదలగునవి.



# 12. క్రియల గౌణ ప్రక్రియ

గౌణ ప్రక్రియలో నీ క్రింద నుదహరించిన ప్రక్రియలు చేరును.

I కర్మణ్యర్థకములు II ప్రేరణార్థకములు III నామధాతుకరణము IV ఇచ్ఛార్థకములు V క్రియాసమభిహారార్థకములు

## 12.1 (అ) కర్మణ్యర్థకములు

(1) వర్తమానకాల కర్మణిప్రయోగమునకు, వర్తమానకాల ప్రకృతులకు ఉదాత్తసహితమగు య (య') చేర్చి, ఆత్మనేపదప్రత్యయముల నతుకుదురు ఇట్లు వీని ప్రకృతులు: అప్'య; గృహ్'య; హన్'య; ఉదాత్తసహితమగు య' చేర్చుటచే ధాతురూపము బలహీనముగా నుండును. కావున ఉపధాస్థానమున నున్న యనునాసికము లోపించుటయో, సంప్రసారణమోజరుగును ఇట్లు:-

బన్ధ్ —> బధ్'య: వచ్ —> ఉచ్'య ;

(2) ధాత్వంతముననున్న ఇ, ఉలు దీర్ఘీకరింపబడును.

ఉదా॥ మి—> మీయ'; సు—> సూయ'; ...

(3) ధాత్వంతముననున్న అకారము సాధారణముగా ఈకారముగా మారును.

ఉదా॥ దా—> దీ'య; ...

(4) ధాత్వంతముననున్న ఋకారము 'రి'గా మారును. ఇట్లు

కృ— > క్రియ'; ...

వర్తమానకాలమున దీనిప్రక్రియ ఈ క్రింది విధముగానుండును.

సూచకార్థకము

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| 1 | క్రియే' | క్రియా'వహే | క్రియా'మహే |
| 2 | — | — | — |
| 3 | — | — | — |

విధ్యర్థకము

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| 1 | క్రియే'య | క్రియే'వహి | క్రియే'మహి |
| 2 | — | — | — |
| 3 | — | — | — |
| | ఆజ్ఞార్థకము | | |
| 2 | క్రియ'స్వ | క్రియే'థామ్ | క్రియ'ధ్వమ్ |
| | అపరోక్షభూతార్థకము | | |
| 1 | అ'క్రియే | ఆ'క్రియావహి | ఆ'క్రియామహి |
| | — | — | — |

సూచనలు :

(1) మ్రియ'తే; ధ్రియ'తే అనునవి స్వరూపమున కర్మణి ప్రక్రియకు చెందినను అర్థమున కర్తరిప్రయోగములే.

(2) తన్; ఖన్ ల కర్మణిరూపములు వరుసగా తాయ'తే, ఖాయ'తే ఇట్లే జన్ —> జాయ'తే. ధమ్ —> ధ్మాయతే లేక ధమ్యతే.

(ఆ) అద్యతన భూతకాల ప్రకృతులకు చెందిన, తృతీయపురుష ఏకవచనమున నొక కర్మణిరూపమునుగలవు. వీనితో ఉపచయముచేరి, ఇకారముతో నంతమగును ధాతువు సాధారణముగా బలీయరూపమున నుండి గుణ వృద్ధులు గల్గియుండును ఇట్లు: అ'బోధి, అ'కారి, ఆ'వేది, ఆ'గామి, ఆ'పాది, అ'మాని. ...... (మామూలుగా ఉపచయరహితములగు రూపములు కర్మణి ప్రయోగమున వేదములో నిర్బంధార్థకమున వాడబడియుండును. వీనిలోని ఉదాత్తము ధాతువులోని స్వరముపై నుండును).

(ఇ) . ఇతరకాలములలో ఆత్మనేపదరూపములు కర్మణ్యర్థకములుగను ప్రయోగింపబడును ఇది ముఖ్యముగా పరోక్షభూతమున గమనింపవగును ఇట్లు: చక్రే' (చేసెను, చేయబడెను)

(ఈ) ఇతర భాషలలోవలె సంస్కృతమునను కొన్ని అకర్మకక్రియల చేతను కర్మణి ప్రక్రియ జేయబడును. ఇట్టివి: ఆగమ్యే'తామ్, స్తీయ'తామ్, ఉడ్డీయ'తామ్; ... ... మొదలగునవి.

## 12.2 II ప్రేరణార్థకములు

కర్మణిప్రక్రియకు చాలాదగ్గరగానుండునది ప్రేరణార్థక ప్రక్రియ. ఇది వర్తమానకాలమున చురాదివర్గప్రక్రియనలె నడచును. అదియును ప్రేరణార్థక ప్రక్రియలోని యంతర్భాగమే.

ధాతువును బలీకరణ మొనరించి అ'య యను అనుసర్గను చేర్చుటచే ప్రేరణార్థక క్రియాప్రకృతి ఏర్పడును.

(అ) ధాతువుయొక్క బలీకరణ మీ క్రింది విధములుగా చేయబడును.

(1) ధాతువుల బలీయ రూపములలో నుగాగమముండిన నది ప్రేరణార్థక ప్రకృతియందును నిలచియుండును.

ఉదా॥ ధంభయ; దంశయ; ఇంధయ; —

(2) ధాతువునకు మొదటగాని మధ్యగాని యున్న ఇ, ఉ, ఋ, ఌలకు గుణాదేశమగును. ఇట్లు

విద్ —> వేదయ; చుద్ —> చోదయ; తృప్ —> తర్పయ; క్లృప్—> కల్పయ.

సూచనలు:—

(i) దీనికి అపవాదముల ప్రాచీనవాఙ్మయములో ఈ క్రిందిధాతువులు; చిత్; ఇష్; ఇల్; రిష్; లిప్; తుజ్; తుద్; తుష్; తుర్; రిష్; రుచ్; శుచ్; కృప్; మృద్; స్పృహ్; గ్రభ్ ; ...

అర్వాచీన వాఙ్మగములో గిర్; తుర్; తుల్; చుర్; ముష్; స్ఫుర్:... మొదలగునవి.

(ii) దుష్: గుహ్‌లోని యచ్చులు దీర్ఘీకరింపబడును.

(iii) కొన్నిధాతువులు బలీకరణములేకయే ప్రకృతులుగా చేయబడును. ఇట్టివి అర్వాచీన వాఙ్మయముననేగాని ప్రాచీనవాఙ్మయమున లేవు.

(ఆ) ధాత్వంతముననున్న యచ్చు వృద్ధినిబొందును. ఇట్టివి-చాయయ, శాయయ, చ్యావయ, భావయ, ధారయ, సారయ, మొదలగునవి. కొన్ని ధాతువులలో అంతముననున్న యచ్చు గుణమును పొందుటయుగలదు. ఇట్టివి:- చ్యు, ద్రు, ప్లు, యు (విడిచేయు). శ్రు, స్తు, జ్వృ, దృ, స్మృ, స్మృ, హృ, వృ, మొదలగునవి.

(ఇ) అకారాంతములగు పలుధాతువులును, ఋకారాంతధాతుపులును, వర్గ చిహ్నముగా 'పయ' స్వీకరించును. ఇట్టివి:- దాపయ, ధాపయ, స్థాపయ, అర్పయ, ...

విశేషరూపములు

(i) ఆకారాంతధాతువులలో పకారమును స్వీకరించనివి

గా (పాడు)—> గాయయ, ఛా—> ఛాయయ, ప్యా—> ప్యాయయ,

(ii) ఇకారాంత, ఈకారాంత ధాతువులలోగూడనుకొన్ని పకారమును స్వీకరించును వీనిని విశేషరూపములుగా స్వీకరించవచ్చును.

ఇట్టివి:- క్షి (కలిగియుండు)—> క్షేపయ, లీ—> లాపయ, మొదలగునవి.

(iii) వీనిలోని యత్యంత విశేషరూపములు :

పా (రక్షించు)—> పాలయ; ప్రీ—> ప్రీణయ; లీ—> లీనయ;

హన్—> ఘాతయ, స్ఫా—> స్ఫావయ;

ధూ—> ధూనయ (ఇది యర్థమున ప్రేరణార్థకముగాదు)

## 12.3 ప్రేరణార్థకప్రక్రియ

(అ) వర్తమానకాలమున దీని ప్రక్రియ అకారాంత ప్రక్రియవలెనే నడచును. కావున ప్రక్రియను సంపూర్ణముగానీయ జాలేము.

(i) సూచకార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
| 1 | ధార'యామి | ధార'యావః | ధార'యామః | ధార'యే | ధారయావహే | ధారయామహే |

(ii) విధ్యర్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | ధార'యేయమ్ | ధా'రయేవ | ధార'యేమ | ధార'యేయ | ధార'యేవహి | ధార'యేమహి |

(iii) ఆజ్ఞార్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 2 | ధారయ | ధార'యతమ్ | ధార'యత | ధార'యస్వ | ధార'యేథామ్ | ధార'యధ్వమ్ |

(iv) అపరోక్షభూతార్థకము

| ఏ | ద్వి | బ | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|---|
| 1అ'ధారయమ్ | అ'ధారయావ | అ'ధారయామ | అ'ధారయే | అ'ధారయావహి | అ'ధారయామహి |

అసమాపకక్రియలు

ధార'యన్ (స్త్రీ ధార'యన్తీ); ధార'యమాణ

(అ) పరోక్షభూతమున ప్రేరణార్థకము సమాసపద ప్రక్రియచే నేర్పడును. ప్రేరణార్థక ప్రకృతికి ఆ చేర్చుటచే నేర్పడు నామవాచక ప్రకృతి యొక్క ద్వితీయావిభక్తి రూపమేర్పడుటకు 'అమ్' చేర్చి, దానికి సహాయకక్రియ యొక్క పరోక్షభూతార్థకరూపమును చేర్చుటచే నిది ఏర్పడును.

ఉదా॥ ధృ—> ధారయా'మ్ చకార, ధారయా'మ్ చక్రే;

(ఇ) భవిష్యత్కాలము: దీనిలో రెండు రకములగు భవిష్యత్కాల ప్రకృతులును, దాని యపరోక్షభూతార్థకమగు క్రియాతిపత్తియు, ప్రేరణార్థక ప్రకృత్యంతమగు అకారమునకు బదులు ఇకారమును నిక్షేపించినచో సిద్ధించును. ఇట్లు:

(i) స్-భవిష్యత్తు

ధారయిష్యా'మి ; ధారయిష్యే'
ధారయిష్యన్ ; ధారయిష్య'మాణ

(ii) సమాసపదభవిష్యత్తు

ధారయితా'స్మి :

(iii) క్రియాతిపత్తి

అ'ధారయిష్యమ్ ; అ'ధారయిష్యే

(ఈ) అద్యతనభూతము. దీని యద్యతన భూతకాల ప్రకృతి పునర్ద్విత్వమునకు సంబంధించినది. దీనిలో వర్గచిహ్నమగు 'అ'య' చేరక సరాసరి ధాతువునుండియే ఏర్పడును. ఇది యర్థమున ప్రేరణార్థక మెట్లగునో విచారణీయము. దీనిప్రక్రియ.

అ'దీధరమ్ అ'దీధరావ అ'దీధరామ అ'దీధరే అ'దీధరావహి అ'దీధరామహి

— — — — — —

## 12 4 III నామధాతుకరణము

వైయాకరణుల మతము ననుసరించి, ఏనామవాచక ప్రకృతికైనను 'అ' యను అనుసర్గను చేర్చి వర్తమానకాల క్రియాప్రకృతిగా మార్చవచ్చును. ఇట్టివి వర్తమానకాలమున అకారాంత ప్రకృతులవలె ప్రక్రియను బొందును దీనిలో 'అ' యనునది పొడిగా పనిజేయును. ఐతే ఇట్టివి వాడుకలో బహుస్వల్పము. సాధారణముగా నామవాచకప్రకృతికి ఉదాత్తసహితమగు య' జేర్చినచో నామ ధాతు ప్రకృతి యేర్పడును. (దీనికిని కర్మణ్యర్థక ప్రకృతిని—వర్తమానకాలమున గల సంబంధము విచారణీయము) నామధాతుకరణము వాఙ్మయముయొక్క అన్ని దశలయందును కన్పించును. వివిధములగు నామవాచక ప్రకృతుల నామధాతుప్రకృతులీ క్రింద నీయబడినవి.

(అ) అకారాంత ప్రకృతులు.

(i) చివరనున్న, అకారము సాధారణముగా నట్లే నిలచి యుండును. ఉదా॥ అమిత్రయ'తి, దేవయ'తి, ... ...

(ii) కొన్నికొన్నిచోట్ల నీ అకారము దీర్ఘీకరింపబడుటయు కలదు. అఘాయ'తి, ప్రియాయ'తే, అశ్వాయ'తి, అశ్నాయ'తి; ... ...

(iii) కొన్నిచోట్ల నీ అకారము ఈకారముగా మారును. ఇట్టివి: అధ్వరీయ'తి, తవిషీయ'తి, పుత్రీయ'తి, మాంసీయ'తి, సజ్జీయ'తే; ...

(ఆ) ఆకారాంత ప్రకృతులు.

చివరనున్న అకారము సాధారణముగా నట్లే నిలచి యుండును.

ఉదా॥ గోపాయ'తి, పృతనాయ'తి, ...

(ఇ) ఇ, ఈ, ఉ, ఊ లు అంతమునగల ప్రకృతులు: వీనిలో య'కు ముందున్న స్వరము దీర్ఘీకరింపబడును. ఇట్లు:
అరాతీయ'తి, జనీయ'తి, సఖీయ'తి, నారీయ'తే, శత్రూయ'తి, వసూయ'తి,...

(ఈ) హలంత ప్రకృతులు :

(i) అంతముననున్న హల్లు సాధారణముగ నట్లే నిలచియుండును.

ఉదా॥ భిషజ్య'తి, ఉక్షణ్య'తి, అపస్య'తి (చురుకుదనము వహించు) నమస్య'తి, సుమనస్య'తే;

ఐతే కొన్ని కొన్ని మారులు చివరనున్న నకారములోపించును. ఇట్టివి రాజన్ —> రాజాయ'తే లేక రాజీయ'తి.

కర్మన్ —> కర్మయ'తి, స్వామిన్ —> స్వామీయతి: ...

(ii) హలంత ప్రకృతులలో నామధాతుకరణమును బొందునవి చాలా వరకు సకారాంతములు. కావున వీని నామధాతుకరణమునకు వర్గచిహ్నము స్య (లేక అస్య) ఇట్టివానిని ఇచ్ఛార్థకములగు నామధాతువులందురు. ఇట్టివి: సుముఖస్య'తే, జీవనస్య'తి, వృషస్య'తి, మధుష్య'తి, క్షీరయస్య'తి, ...

(ఉ) వర్తమానకాలములో వీని ప్రక్రియ మామూలు అకారాంత ప్రకృతుల ప్రక్రియవలెనే యుండును. ఇతరకాలములలో వీనిరూపములు చాలా చాలా యరుదు.

## 12.5 IV ఇచ్ఛార్థకము

(అ) ఇచ్ఛార్థకములు, ధాతువుచే సూచితమగు క్రియయందు, కర్తకు గల కోరికను తెలుపును. ఇట్లు:-

పి'బామి=త్రాగుదును : పి'పాసామి: త్రాగగోరుదును:

జీ'వామి=బ్రతుకుదును. జి'జీవిషామి=బ్రతుకగోరుదును.

ఇచ్ఛార్థకములు రెండువిధములగు లక్షణములచే తెలియనగును.

1. పునర్ద్విత్వము. ఎల్లప్పుడును ఈ పునర్ద్విత్వాక్షరముపైననే యుదాత్తముండును. 2. దీనికి అనుసర్గగా చేర్చబడిన 'స' (లేక ఇష) యను వర్గచిహ్నము.

(ఆ) ధాతువులో సాధారణముగా మార్పురాదు. ఐతే ఈ క్రిందివి అపవాదములు.

(i) ధాత్వంతముననున్న ఇ, ఉలు వర్గచిహ్నమగు సకారమునకు ముందు దీర్ఘీకరింపబడును. ఇట్లు: చికీష; జిగీష; శుశ్రూష; జుహూష; ...

(ii) ధాత్వంతముననున్న ఋకారము ఈర్ గనో ఊర్ గనో మారును. ఉదా॥

చికీర్ష; తితీర్ష; దిధీర్ష; శిశీర్ష; తిస్తీర్ష; బుభూర్ష; ...

(iii) అనుసర్గయను 'ఇష'కు ముందున్న ఇ, ఉ, ఋ లుగాని ఉపధాస్థాన మునకున్న ఇ, ఉ, ఋ లుగాని (వైకల్పికముగా) గుణాదేశమును బొందును. ఉట్లు:- శిశాయిష; శిశారిష; చికర్తిష; నినర్తిష; మిమర్దిష; వివర్షిష; ...

ఇతర విశేషరూపములు వదలివేయబడినవి.

(ఇ) పునర్ద్విత్వ విషయమున: పునర్ద్విత్వమును బొందిన వ్యంజనము నకు సాధారణ నియమములే వర్తించును.

ధాతువులోని యచ్చు అ, ఇ, ఋ లైనచో పునర్ద్విత్వ స్వరము ఇకారము. అట్లుగాక ధాతువులోని యచ్చు ఉకారమైనచో పునర్ద్విత్వమునుబొందిన యచ్చును ఉకారమే.

(ఈ) కొన్ని ధాతువుల ప్రకృతులు (వీనిలో చాలా విరివిగా వచ్చునవియు చేరియున్నవి), ధాతువుయొక్కయు, పునర్ద్విత్వము యొక్కయు సంలయముచే సంకుచిత ప్రకృతులుగా నేర్పడును: ఇట్టివి.

ఆప్ --> ఈప్స; దా --> దిత్స; ...

## 12.6 ఇచ్ఛార్థక ప్రక్రియ

(i) వర్తమానకాలమున దీని ప్రక్రియ అకారాంత ప్రకృతుల ప్రక్రియ వలెనే జరుగును. కావున విపులముగా నీయబనిలేదు.

సూచకార్థకము

| | పరస్మై | | | ఆత్మనే | | |
|---|---|---|---|---|---|---|
| 1 | ఈ'ప్సామి | ఈ'ప్సావః | ఈ'ప్సామః | తి'తిక్షే | తి'తిక్షావహే | తి'తిక్షామహే |

విధ్యర్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | ఈ'ప్సేయమ్ | ఈ'ప్సేవ | ఈ'ప్సేమ | తి'తిక్షేయ | తి'తిక్షేవహి | తి'తిక్షేమహి |

ఆజ్ఞార్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | ఈ'ప్సాని | ఈ'ప్సావ | ఈ'ప్సామ | తి'తిక్షై | తి'తిక్షావహై | తి'తిక్షామహై |

అపరోక్షభూతార్థకము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | ఐ'ప్సమ్ | ఐ'ప్సావ | ఐ'ప్సామ | అ'తితిక్షే | అ'తితిక్షావహి | అ'తితిక్షామహి |

అసమాపక క్రియలు

ఈ'ప్సన్ [స్త్రీ. ఈ'ప్సన్తీ] తి'తిక్షమాణ.

(ii) పరోక్షభూతకాలమున నిది సమాసపదప్రక్రియను బొందును ఇట్లు: ఈప్సామ్ చకార ; తితిక్షామ్ చక్రే;

(iii) భవిష్యత్కాలమున ప్రకృత్యంతమున అకారమునకు బదులు ఇకారము వచ్చును. ఇట్లు :

ఈప్సిష్యామి, ఈప్సితాస్మి, తితిక్షిష్యే. తితిక్షితాహే; ... ...

(iv) కర్మణిప్రయోగమున ప్రకృత్యంతముననున్న అకారము లోపించును ఇట్లు : ఈప్స్యతే; ...

(v) ప్రేరణార్థకమున మామూలుగా అ'య యను అనుసర్గచేరును. ఇట్లు : ఈప్'సయామి; ...

## 12.7 V సమభిహారార్థకము

ఈ ప్రక్రియ, ధాతువుచే సూచితమగు క్రియ, మాటిమాటికి జరుగుట గాని; తీవ్రముగా జరుగుటగాని సూచించును. ఐతే ఈ ప్రక్రియ ముఖ్యముగా ప్రాచీనవాఙ్మయముననే గాననగును. అందును వాఙ్మయములోని మొత్తము ప్రయోగములలో, నూడింట ఆరువంతులు ఋగ్వేదముననే కన్పించును. ఇవి రానురాను పల్చబడిపోయి అదునాతన వాఙ్మయమున నామమాత్రముగా నిలచి యున్నవి. బహ్వచ్క ధాతువులకును, అజాదిధాతువులకును తప్ప మిగిలినవాని కన్నిటికిని ఈ ప్రక్రియ వర్తించునని వైయాకరణుల నిర్ణయము.

(అ) ఈ ప్రకృతులు బలీయమగు పునర్ద్విత్వముచే నేర్పడును.

ఇదియు మూడు విధములుగా నేర్పడును.

(i) పునర్ద్విత్వమును బొందిన వ్యంజనవిషయమున సాధారణ నియమములే వర్తించును. ఐనను అచ్చుల విషయమున : అ, ఋ (లేక అర్) లు 'ఆ' గా మారును. ఇకారము ఏకారముగను ఉకారము ఓకారముగను మారును (అనగా ఋకారము తప్ప మిగిలినవానికి గుణాదేశమగును. ఋకారము మాత్రము 'ఆ'గా మారును) ఇట్లు :

వావద్, బాబధ్, రారన్ధ్, దాదృ, చేకిత్, తేతిజ్, నేనీ, జోహూ;

(ii) ఒక్కొకమారు పునర్ద్విత్వమును బొందిన యక్షరముతో ధాత్వంతమునను న్న వ్యంజనము చేరును. ఈ వ్యంజనము సాధారణముగా రకారముగాని లేక యనునాసికముగాని యై యుండును ఇట్లు :

చర్చర్, చల్చల్, మర్మృజ్, దన్దశ్ (దన్శ్ నుండి) నన్నమ్ (నమ్నుండి)

(iii) పునర్ద్విత్వమును బొందినవి రెండక్షరములగునో వాని చివర ఇకారముగాని ఈకారముగాని వచ్చును : ఇట్లు:-

గనీగమ్ (గమ్నుండి); పరీవృత్; సనిష్వన్;

**12.8** దీనిప్రక్రియకు ఉదాహరణముగా విద్ (తెలియు) యొక్క సమభిహార్థక ప్రకృతియగు 'వేవిద్'ను తీసికొందము. దీని బలీయరూపము వేవే'ద్

## (అ) వర్తమానకాలము

వైయాకరణలలో పలువురు వీనిప్రక్రియను ఆత్మనేపదిలో సమ్మతించరు అట్టిరూపములు వేదముననను బహుస్వల్పములే. అందుచే దీనిప్రక్రియను పరస్మైపదిలో నొసగిన చాలును.

సూచకార్థకము

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| 1 | వే'వేద్మి; వే'విదీమి | వేవిద్వ'ః | వేవిద్మ'ః |
| 2 | వే'వేత్సి; వే'విదీషి | వేవిత్థ'ః | వేవిత్థ' |
| 3 | వే'వేత్తి; వే'విదీతి | వేవిత్తః | వే'విదతి |

ఇట్లే హూధాతువునుండి జో'హవీమి, జోహవీషి; జో'హవీతి యను రూపములేర్పడును.

విధ్యర్థకము

| | | | |
|---|---|---|---|
| 1 | వేవిద్యా'మ్ | వేవిద్యా'వ | వేవిద్యామ |
| 2 | — | — | — |
| 3 | — | — | — |

ఆజ్ఞార్థకము

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| 1 | వే'విదాని | వే'విదావ | వే'విదామ |
| 2 | వేవిద్ధి | వేవిత్త'మ్ | వేవిత్త' |
| 3 | వే'వేత్తు; వే'విదీయ | వేవిత్తా'మ్ | వేవిదతు. |
| | | అపరోక్షభూతార్థకము | |
| 1 | అ'వేవిదమ్ | అ'వేవిద్వ | అ'వేవిద్మ |
| 2 | అ'వేవేత్; అ'వేవిదీః | అ'వేవిత్తమ్ | అ'వేవిత్త |
| 3 | అవేవేత్; అ'వేవిదీత్ | అ'వేవిత్తామ్ | అ'వేవిదుః |

అసమాపక క్రియలు

వే'విదత్ (స్త్రీ. వేవిదతీ); వే'విదాన

(ఆ) ఆత్మనేపదియందు జన్యప్రక్రియ.

సమభిహారార్థక ప్రకృతులనుండి జన్యప్రక్రియగా ఉదాత్తసహితమగు 'య'ను చేర్చి ఆత్మనేపద ప్రత్యయముల జేర్చుటచే మరియొకవిధమగు ప్రక్రియ ఏర్పడును. ఇది వర్తమానకాల కర్మణి ప్రక్రియవలెనే యుండునుగాని యర్థమున మాత్రము కర్మణిప్రయోగముగాదు. ఇట్టివి :—

మృజ్— > మర్మృజ్— > మర్మృజ్యే', మర్మృజ్య'సే, మర్మృజ్య'తే, ......మర్మృజ్యే'య, మర్మృజ్యే'థాః, మర్మృజ్యే'త, మర్మృజ్య'స్వ; మర్మృజ్యతామ్; ... ... అ'మర్మృజ్యే, అ'మర్మృజ్యథాః, అ'మర్మృజ్యత, మర్మృజ్య'మాన, మొదలగు రూపములేర్పడును.

**సూచన :—**

ఇట్టి ప్రయోగములు కొన్ని కర్మణ్యర్థకముననను కలవు.

ఉదా॥ జన్ ఘన్యమాన, దాధ్మాయమాన. పేపీయమాన, ... ...మొదలగునవి.

పై జెప్పబడిన ప్రక్రియ ప్రాచీన వాఙ్మయమునకన్న అర్వాచీన వాఙ్మయముననే మెండు.

(ఇ) ఇతరకాలములలో సమభిహారార్థకప్రక్రియ చాలా చాలా యరుదు. కావున వదలివేయనైనది

—:o:—

# అనుబంధము I

ఈ క్రింది పట్టికలో వాఙ్మయమున కంతటికిని మూలకములని చెప్పదగిన కొన్ని ముఖ్య ధాతువులొసగబడినవి. ప. పరస్మైపది; ఆ ఆత్మనేపది యని తెలియనలెను. ఎట్టి సూచనయు లేనిది ఉభయపది యని యెరుగవలయును. దీనిలోని అంకెలు ధాతుగణములను సూచించును.

1. భ్వాదివర్గము, 2. అదాదివర్గము, 3. జుహోత్యాదివర్గము, 4. దివాది వర్గము, 5. స్వాదివర్గము, 6. తుదాదివర్గము, 7. రుధాదివర్గము 8. తనాది వర్గము, 9. క్ర్యాదివర్గము, 10. చురాదివర్గము.

ఎట్టి అంకెయు లేనివానికి వేదమున వర్తమాన కాలప్రక్రియలేదని తెలియ నగును.

అ

అక్ష్=చేరు, ప్రోగుచేయు 5
అచ్=వంచు (bend) 1 ప
అజ్=తోలు 1
అఞ్జ్=పూయు 7
అద్=తిను 2 ప
అన్=ఊపిరిపీల్చు 2 ప
అమ్=క్షతికలిగించు 2
అర్చ్=పొగడు 1 ప
అర్హ్=పూజించు, యోగ్యతగలుగు 1
అవ్=రక్షించు, మంచిచేయు 1 ప
అశ్=అందుకొను పొందు 5
అశ్=తిను 9
అస్=ఉండు 2 ప
అస్=విసరివేయు 4
అహ్=చెప్పు ప

ఆ

ఆప్=పొందు 5
ఆస్=కూర్చుండు 2 ఆ

ఇ

ఇ=వెడలు, పోవు 2 ప
ఇ=పంపు (send) 2 ప
ఇధ్=వెలిగించు 7 ఆ
ఇన్వ్=పోవు 1 ప
ఇళ్=స్తుతించు 2 ఆ
ఇష్=(ఇఛ్) కోరు 6
ఇష్=పంపు, కదిలించు 4

ఈ

ఈక్ష్=చూచు 1 ఆ
ఈడ్=భజించు, స్తుతించు 2 ఆ
ఈర్=కదిలించు, విసరు, పోవు 2
ఈశ్=కలిగియుండు, ఆజ్ఞాపించు 2ఆ
ఈష్=కదలు 1

ఉ

ఉఝ్=వదలివేయు (avoid) 6

ఉఞ్ఛ్=ప్రోగుచేయు (glean) 6
ఉద్=తడిచేయు 7 ప
ఉబ్జ్=నిర్బంధించు (force) 6 ప
ఉభ్=బంధించు (confine) 6,7,9 ప
ఉష్=(ఉచ్ఛ్) ప్రకాశించు 6 ప

ఊ

ఊర్ణు=మూతవేయు, దాచు 2
ఊహ్=తీసివేయు 1
ఊహ్=ఆలోచించు 1 ఆ

ఋ

ఋ=ప్రవేశించు, పోవు, పొందు 3; 6
ఋచ్=పొగడు, మెఱయు
ఋజ్=ఆదేశించు (direct) 6; 7; 4
ఋద్=కలియబెట్టు (stir) 6 ప
ఋధ్=పెంపొందు 4,5,7 ప
ఋష్=సమీపించు, గాయముజేయు 1 (rush)

ఏ

ఏద్=పెంపొందు 1 ఆ

క

కన్ (లేక కా)=మెఱయు, దీపించు వినోదించు 4
కథ్=చెప్పు 10 ప
కమ్=కోరు, ప్రేపించు, 4
కా (చూ. కన్): వినోదించు 4
కాశ్=మెఱయు: ప్రకాశించు, కనుపించు 1
కాస్=దగ్గు: (eliminate) తుడిచిపెట్టు 1
కు=మ్రోగు (sound) (కూ) 2

కుచ్=ముడుచుకొను 6 ప
కుప్=కోపించు 4
కృ=చేయు 5,8,2
కౄ= (లేక కిర్): వెదజల్లు 4
కౄ=(జ్ఞాపనముచేయు) (commemorate)
కృత్=కోయు: చుట్టుచుట్టు ప 6
కృప్=దుఃఖించు 1 ఆ
కృశ్=కృశించు 4 ప
కృష్=లాగు, దున్ను 1
క్లప్=సామర్థ్యముగల్గియుండు 1
క్రన్ద్=ఏడ్చు, పిలుచు 1 ప
క్రమ్=అడుగువేయు (stride) 1 ప
క్రీ=కొను: ఖరీదుచేయు 9
క్రీడ్=ఆటలాడు: సంతోషించు 6
క్రుధ్=కోపించు 4 ప
క్రుశ్=పిలుచు. ఏడ్చు: అరచు 1
క్లమ్=అలిసిపోవు 4
క్లిద్=తడియు 4
క్లిశ్=బాధపడు 4
క్షమ్=సహించు 1 ఆ
క్షర్=ప్రవహించు 1 ప
క్షల్=కడుగు 10 ప
క్షి=నశింపజేయు, క్షయించు 9,5,4
క్షిప్=విసరివేయు 6 ప
క్షుద్=దంచు 7
క్షుధ్=ఆకలిగొను 7
క్షుభ్=క్షోభించు 1 ప
క్ష్ణు=పదనుపెట్టు (sharpen) 2
క్ష్విద్=వదలివేయు (release) 1,4

ఖ

ఖన్=(ఖా) త్రవ్వు 1
ఖాద్=నమలు 1 ప
ఖిద్=ఖేదమునొందు 6
ఖ్యా=మ చు: చెప్పు (relate)

గ

గమ్=పోవు: (గచ్ఛ్) 1 ప
గా=పోవు 3 ప
గా=పాడు 4
గాహ్=మునుగు: స్నానముచేయు 1 ఆ
గుప్=దాచు, రక్షించు 4 ప
గుర్=ఆహ్వానించు (greet) 6
గుహ్=మూయు, రహస్యముగానుంచు 1
గ్ౄ=గానముచేయు, పాడు 9
గ్ౄ=మ్రింగు 6
గ్ౄ=మెలకువతోనుండు (జాగ్ౄ) 8
గృధ్=దురాశజెందు (covet) 4 ప
గ్రా=మ్రింగు 6 ప
గ్రధ్=సమకూర్చు 10
గ్రభ్(లేక గ్రహ్)=పట్టుకొను, తీసికొను 9
గ్రస్=మ్రింగు, గ్రహించు, తీసికొను 1 ఆ
గ్లా=అలిసిపోవు 4

ఘ

ఘట్=ఘటించు 10 ప
ఘస్=తిను (జక్ష్) 2
ఘ్రా=వాసనచూచు 4

చ

చకాస్=మెఱయు, పెంపొందు 6 ప
చక్ష్=చూచు 2 ప
చర్=నడచు 1 ప
చర్వ్=నమలు 1 ప
చల్=కదలు 1 ప
చాయ్=పరీక్షించు, పూజించు 1
చి=ప్రోగుచేయు 5
చి=ఎరుగు, గుర్తించు 3
చిత్=కనుగొను, తెలియు 1
చుద్=ప్రేరేపించు 10
చ్యు=క్రిందపడు, కదలు, పోవు 1

ఛ

ఛద్=మూయు 2
ఛన్ద్=తోచు, కనుపించు (seem) 2
ఛా=ఆచ్ఛాదించు 4
ఛిద్=ఛేదించు 7
ఛుర్=కోయు 6

జ

జక్ష్=తిను, నవ్వు 2
జన్=పుట్టించు 1
జప్=జపించు (mutter) 6
జమ్భ్=నాశనముబొందించు, నమలు
జల్ప్=వాగు 6
జస్=అలిసిపోవు, విడిపించు 1
జా=పుట్టు 4 ఆ
జి=ఓడించు 1
జిన్వ్=త్వరపెట్టు 1
జీవ్=బ్రతికియుండు 6 ప
జుష్=చంపు, సుఖించు 6
జూ=వేగముగాపోవు 9 ప
జౄ (లేక జుర్) = పాడు ఆ
జ్రా=క్షయించు 1,4,6, ప
జ్ఞా=తెలియు 9
జ్యా=(జి) నొప్పిచేయు 4
జ్వల్=మండు 1 ప

త

తక్ష్=తయారుచేయు, 1,2,5, ప
తడ్ = కొట్టు 10
తన్ = లాగు, విస్తరించు 8
తప్ = వేడిచేయు 1
తమ్ = ఆదుర్దాచెందు 4 ప
తా = పఱచు (తన్) 4
తిజ్ = పదునుగలిగియుండు 1 ఆ
తు = (తూ) బలమునందు 2
తుజ్ = చంపు, హానిచేయు
తుద్ = కొట్టు నెట్టు 6
తుర్ (లేక త్వా) = గడచు 6
తుల్ = తూచు, పరీక్షించు 10
తుష్ = సంతోషించు, 4 ప
త్వా = (తుర్) గడచు 1,2,6,8
తృద్ = చీల్చు 7
తృప్ = తృప్తిజెందు 5; 4 ప
తృష్ = దప్పిగొను 4
తృహ్ = చంపు, హింసించు 7 ప
త్యజ్ = విడచివేయు 1 ప
త్రప్ = సిగ్గుజెందు 1 ప
త్రస్ = వణకు, భయముజెందు 1 ప
త్రా = రక్షించు 4 ఆ
త్వర్ - వేగిరపడు 10
త్విష్ = మెఱయు 6 ప
త్సర్ = నడచు 1 ప

ద

దంశ్=కొరుకు 1 ప
దక్ష్=చేతనైయుండు 1
దఘ్ = చంపు, పాలించు 5
దభ్ (దంభ్) = హానికలుగజేయు 5
దమ్ = ఉపశమించు 4
దయ్ = (దా) భాగముపంచుకొను 4
దల్ = చించివేయు 10
దశ్ = గిల్లు, కొరుకు 7
దస్ = నశించు 4 ప
దహ్ = కాల్చు 1;3
దా = ఇచ్చు 3
దా = విభజించు, కోయు 2,6,4 ప
దా = బంధించు 6 ప
దాశ్ = ఇచ్చు , 2;5 ప
దాస్ = ఇచ్చు 1 ప
దిశ్ = ఆజ్ఞాపించు, చూపు 6
దిహ్ = పూయు 2
దీక్ష్ = దీక్షవహించు 1 ఆ
దీధీ = ప్రకాశించు 2
దీప్ = ప్రకాశించు, మండు 4 ఆ
దీవ్ = ఆడు 4
దు(దూ) = మండించు. నొప్పికలుగజేయు 5 ప
దుష్ = తప్పుచేయు 4 ప
దుహ్ = పితుకు 2 ప
దృ=ద్రుచ్చు 2,6, ప
దృశ్ = (పశ్య) చూచు 1 ప
దృహ్ = గట్టిగాచేయు 7
ద్యుత్ = ప్రకాశించు 1 ఆ
ద్రా = పరుగెత్తు 2 ప
ద్రా = నిద్రించు 2 ప
ద్రు = పరుగెత్తు 1 ప
ద్రుహ్ = ద్రోహముచేయు 4 ప
ద్రుహ్ (దృంహ్)=గట్టిగాచేయు 1,6
ద్విష్ = ద్వేషించు 2

ధ

ధమ్ (ధా) = ఊదు (blow) 1 ప
ధా = ఉంచు 3

ధా = పీల్చు 4 ప
ధావ్ = కడుగు, పరుగెత్తు 4
ధీ = ఆలోచించు 3
ధూ = ఊపు (shake) 5
ధృ = ధరించు 10
ధృష్ = ధైర్యముచేయు 5
ధ్మా (చూ. ధమ్) = ఊదు 1 ప
ధ్యై = ఆలోచించు 4 ప
ధ్వమ్స్ = ఎదజల్లు 1 ప
ధ్వన్ = మ్రోతచేయు 1 ప
ధ్వృ = హానికలిగించు 1

న

నక్ష్ = పొందు 1
నద్ = మ్రోగు 1 ప
నమ్ = వంగు 1
నశ్ = నశించు 4 ప
నశ్ = పొందు (attain) 1
నస్ = కలియు (unite) 1 ఆ
నహ్ = కట్టివేయు 4
నిజ్ = కడుగు ఆ
నిన్ద్ = నిందించు 1 ప
నీ = వెంట గొనిపోవు (lead) 1
ను = స్తుతించు 1
నుద్ = నెట్టు (push) 6
నృత్ = నాట్యముచేయ 4 ప

ప

పచ్ = వండు 1; 4
పత్ = ఎగురు 1 ప
పద్ = పోవు 4
పన్ = మెచ్చుకొను 1 ఆ
పశ్ = చూచు 4
పా = త్రాగు 1
పా = రక్షించు 2
పిన్వ్ = బలియు (fatten) 1
పిశ్ = అలంకరించు 6
పిష్ = నలిపివేయు 7 ప
పీ = ఉబ్బు ,2.5 ఆ
పిన్వ్ = బలియు 1
పుష్ = వృద్ధిపొందు 4 ప
పూ = శుద్ధిచేయు 9
పృ = గతించు 3 ప
పృచ్ = కలిపివేయు 7
పృణ్ = నింపు 6
పౄ = నింపు, పూరించు 9
ప్యా = నింపివేయు 4 ఆ
ప్రచ్ = అడుగు 6
ప్రథ్ = విస్తరింపజేయు 1 ఆ
ప్రా = నింపు 2 ప
ప్రీ = ప్రీతిజెందు 9
ప్రుథ్ = బుసగొట్టు 1
ప్రుష్ = చిలుకు 6
ప్లు = తేలు (float) 1
ప్సా = మ్రింగు 2 ప

బ

బధ్ = బాధించు 9
బాధ్ = బాధించు 1 ఆ
బుధ్ = మేల్కొను 1 ప
బృహ్ = పెద్దగాచేయు 6 ప
బ్రూ = చెప్పు 2
భఞ్జ్ = విరుగగొట్టు 7 ప
భస్ = మ్రింగు 3
భా (లేక భాస్) = వెలుగొందు 2 ప
భిక్ష్ = బిచ్చమెత్తుకొను 1 ఆ
భిద్ = చీల్చు 7

భీ = భయపడు 3 ప; 1 ఆ
భుజ్ = వంగు (bend) 6 ప
భుజ్ = సంతోషముతో ననుభవించు (enjoy) 7 ఆ
భుర్=వణకు 6
భూ=అగు 1
భృ=భరించు; వహించు 3,1
భ్రాజ్=వెలుగొందు 1 ఆ

మ

మన్హ్ (లేక మహ్) గొప్పయగు 1
మజ్జ్=మునుగు 1 ప
మథ్=చిలుకు 9
మద్=మదించు (మన్ద్) 1
మన్=ఆలోచించు (think) 2 ఆ
మా = కొలుచు 3
మా=మార్పిడిచేసికొను (exchange) 1
మా=రంకెవేయు 3 ప
మి=నిలబెట్టు (fix) 5 ప
మిక్ష్=కలిపివేయు (mix)
మిష్=రెప్పలార్చు 6 ప
మిహ్=నీరుకార్చు 1
మీ=చెడగొట్టు 9
ముచ్=వదలివేయు 6
ముద్=సంతోషముగానుండు 1 ఆ
ముష్=దొంగిలించు 9 ప
ముహ్=తడబిడపడు 4 ప
మూర్చ్=బిగుసుకొనిపోవు; గట్టిపడు (thicken) 1 ప
మృ=చచ్చు; మరణించు 1
మృ=నలిపివేయు 9 ప
మృజ్=తుడుచు 2
మృడ్=దయచేయు 6
మృణ్=నలిపివేయు (crush) 6 ప
మృధ్=నిర్లక్ష్యముచేయు 1 ప
మృశ్=త్రాకు=(touch) 6
మృష్=వినుపించుకొనకపోవు 4
మ్లా=(relax) 4 ప
మ్రుచ్=ఏర్పరించు (set) 1 ప

య

యజ్=యజించు 1
యత్=లాగు, ప్రయత్నించు 1
యమ్=బైటకులాగు 1
యస్=వేడిజెందు 1; 4 ప
యా=పోవు 2 ప
యాచ్=యాచించు 6 ప
యు=కలుపు (unite) ఏకీకరించు 6
యు=విడదీయు; కలుపు 3
యుజ్=కలుపు 7
యుప్=అడ్డుపెట్టు 3

ర

రక్ష్=రక్షించు 1
రజ్ (లేక రఞ్జ్) రంగువేయు 4
రన్=సంతసించు 1,4
రభ్=గట్టిగాపట్టుకొను, ఆ
రమ్=సంతోషించు; తృప్తినొందు 1 ఆ
రా=ఇచ్చు 3 ఆ
రా=మొఱగు 4 ప
రాజ్=ప్రకాశించు ప
రాధ్=గెలుచు (succeed) 4 ఆ
రి=ప్రవహించు (flow) 9 4
రిచ్=వదలు 7
రిశ్=చించు 6
రిష్=నొప్పినొందు 4
రిహ్ (లేక లిహ్) నాకు 2

రు=ఏడ్చు 6
రుచ్=ప్రకాశించు 1
రుజ్=విరుగగొట్టు 1 ప
రుద్=ఏడ్చు 2 ప
రుధ్=అడ్డుపెట్టు 7
రుద్=పెరుగు 1 ప
రుహ్=పైకెక్కు 1 ప

ల

లప్=వాగు 1 ప
లభ్=పొందు 1. ఆ
లిఖ్=గోకు (Scratch) 6
లిప్=పూయు 6. ప
లిహ్=నాకు 2.
లీ=వ్రేలాడు 1. ఆ
లుప్=పగులు 6. ప
లుభ్=కోరు 4 ప
లూ=కోయు 9 ప

వ

వచ్=మాట్లాడు 3 ప
వఞ్చ్=వంకర టింకరగా-నడచు 1 ప
వద్=మాట్లాడు 1
వధ్=చంపు 1 ప
వన్=గెలుచు (win) 8 ఆ
వన్ద్=నమస్కరించు 1 ఆ
వప్=చల్లు 1
వమ్=వాంతి జేసికొను 2
వశ్=కోరు 2
వస్=మెఱయు 6 ప
వస్=దుస్తులు ధరించు 2 ఆ
వస్=నివశించు 1
వహ్=మోయు 1
వా=ఊదు 2 ప
వా=నేత నేయు 4

వాఞ్ఛ్=కోరు 1 ప
వాశ్=రంకె వేయు 1
విచ్=చెరుగు (sift) 7; 3
విజ్=వణకు 6
విద్=తెలియు 2 ప
విద్=(విన్ద్) కనుగొను 6
విద్=కొలుచు 3
విప్=వణకు 1
విశ్=ప్రవేశించు 6
విష్=చురుకుగా నుండు (be active) 3; 1 ప
వ్లీ=సంతోషముతో అనుభవించు 2
వృ = కప్పు (cover) 1, 5, 9
వృ = ఏరు (choose) 9 ఆ
వృజ్ = మలుచు (twist) 7
వృత్ = తిరుగు 1 ఆ
వృధ్ = వృద్ధిపొందు 1
వృష్ = వర్షించు 1 ప
వృహ్ = చించు 6 ప
వ్యచ్ = పెంచు (extend) 3 ప
వ్యథ్ = ఆందోళన పొందు 1
వ్యధ్ = గ్రుచ్చు (pierce) 4 ప
వ్యయ్ = (లేకవ్యా) కర్చుచేయు 1
వ్యా (లేకవీ) = చుట్టుముట్టు 4
వ్రజ్ = నడచిపోవు (proceed) 6 ప
వ్రశ్చ్ = కోయు 6
వ్లి = ఏరుకొను 9

శ

శమ్స్ = ప్రశంసించు 1
శక్ = సామర్థ్యము గలిగియుండు 5
శన్క్ = అనుమానించు 2
శద్ = prevail (విశదమగు)
శప్ = శపించు 2
శమ్ = కష్టించు 4 ప

శమ్ = విశ్రమించు 4
శా = పదునుగా చేయు 8
శాస్ = ఆజ్ఞాపించు 2
శిష్ = వదలివేయు 7 ప
శీ = పరుండు 2 ఆ
శుచ్ = ప్రకాశించు 1
శుధ్ (లేక శున్ధ్) పవిత్రీకరించు 6 ప
శుభ్ (లేక శుంభ్) = అందముగా చేయు 1, 6
శుష్ = ఎండిపోవు 4
శూ = ఉబ్బు; వాయు 4
శ్రా = నలుగగొట్టు (crush) 9
శ్నథ్ = గుచ్చుకొనిపోవు 2 ప
శ్యా = ఘనీభవించు 4
శ్రథ్ = సడలించు 9
శ్రమ్ = అలసిపోవు 4
శ్రా = ఉడుకబెట్టు 9
శ్రి = ఆశ్రయించు 1
శ్రిష్ = గట్టిగా పట్టుకొను 1
శ్రీ = కలిపివేయు (mix) 9
శ్రు = విను 5
శ్రుష్ = విను 1
శ్లిష్=కౌగలించు, ఆవరించు 4
శ్వఙ్చ్ = విస్తరించు 1 ఆ
శ్వస్ = ఊదు 2
శ్విత్ = మెఱయు

ష

ష్ఠివ్ = ఉమియు 1 ప

స

సఘ్ = సమానమగు 5 ప
సచ్=అనుసరించు 1
సజ్ (లేక సఙ్జ్) = వ్రేలాడు ప
సద్ = కూర్చుండు 1
సణ్ = లాభించు (gain) 8
సప్ = సేవించు 1
సస్ = నిద్రించు 2, 3, ప
సహ్=ఓర్చు 1
సా = బంధించు 6
సాధ్ = నెరవేర్చు; సాధించు 1
సీ = బంధించు 9 ప
సిచ్=పోయు (pour) 6
సిధ్ = ప్రతిసారించు (repel) 1 ప
సిధ్ = గెలుచు 1 ప
సీవ్ = కుట్టు (sew) 4
సు = బయటకు నెట్టు (press out) 5
సూ=పుట్టించు(generate) 6,ప;2 ఆ
సూచ్ = సూచించు
సూద్ = ఏర్పరించు
సృ = ప్రవహించు 3
సృజ్ = బయటకు ప్రసరించు 6
సృప్ = ప్రాకు (creep) 1 ప
స్కన్ద్ = గంతువేయు 1 ప
స్కభ్ = ప్రాపుగా లేక అండగా నిలుచు (prop) 9
స్ఖు = చించు ప
స్తన్ = గర్జించు 2 ప

స్తభ్ (=స్తంభ్) అండగానిలుచు 9
స్తు=శ్లాఘించు 2
స్తుభ్ శ్లాఘించు 1 ప
స్తృ=పరచు (strew) 9
స్థా=నిలుచుండు 1
స్నా=స్నానము చేయు 2 ప
స్పశ్=చూచు (spy)
స్పృ=గెలుచు 5
స్పృధ్=పందెము వేయు 1 ఆ
స్పృశ్=త్రాకు 6
స్పృహ్=త్వరపడు, ఆతృతజెందు
స్ఫుర్=త్రోపు (spurn) 6
స్మి=చిరునవ్వు నవ్వు 1
స్మృ=జ్ఞాపకము చేసికొను 1
స్యన్ద్=కదలిపోవు 1 ఆ
స్రస్ (లేక స్రమ్స్)=పడు 1 ఆ
స్రిధ్=తప్పుచేయు 1 ప
స్రు=ప్రవహించు, స్రవించు 1
స్వఞ్జ్=కౌగలించు 1
స్వద్ (లేక స్వాద్) తీపిగాచేయు 1
స్వన్=ధ్వనిచేయు
స్వప్=నిద్రించు 2 ప
స్వర్=ధ్వనిచేయు 1 ప
స్విద్=చెమటపోయు (sweat) 1 ఆ

హ

హన్=కొట్టు, బాదు, చంపు 2
హర్=తృప్తినొందు 4
హా=వదలివేయు 3 ప
హా=వదలిపోవు (go forth) 3 ఆ
హి=ప్రచోదనముచేయు 5
హింస్=హానికలుగజేయు 7
హీడ్=విరోధించు 1 ఆ
హు=హోమముచేయు (sacrifice) 3
హూ (లేక హ్వే)=పిలుచు, 1, 2, 3, 4, ఆ
హృ=పట్టు; తీసికొను, కోపించు 1
హృ=కోపించు 9 ఆ
హృష్=హర్షించు (be excited) 1
హ్ను=దాచు 2
హ్రీ=సిగ్గుజెందు 3 ప
హ్వే=పిలుచు 4
హ్వృ=వక్రముగానుండు 1, 9, 3



# అనుబంధము II

## వేదములోని స్వరము

గ్రంథములో సందర్భానుసారము వివరింపబడినవిగాక ఈ క్రింది విషయములు తెలియనగును.

I ప్రధాన వాక్యభాగములోని ప్రధానక్రియపై ఉదాత్తము ఉండదు. ఐతే ఈ ప్రధానక్రియ ఉపసర్గతోగూడి యుండినచో, ఉదాత్తము ఉపసర్గపై నుండును. ఒకటికంటె నెక్కుడు ఉపసర్గలున్నచో, క్రియావాచకపదమునకు దగ్గరగానుండు ఉపసర్గపైననే యుదాత్తము ఉండును. ఇతరములు తమ స్వరమును కోల్పోవును. అట్లుగాక అప్రధానవాక్యభాగములోని క్రియాపదముపై ఉదాత్తముఉన్నపుడు, దానితోచేరియుండిన యుపసర్గలన్నియును తమస్వరమును కోల్పోవును. వేదములో బహుళముగా క్రియావాచకశబ్దములు. ఉపసర్గలును కలిసియుండవు అట్టిచో ఉపసర్గలు క్రియావిశేషణ (adverbial) ధర్మములను గలిగియుండి ప్రత్యేకముగా ఉదాత్తమును వహించును.

పదపాఠములో కొన్నిచోట్ల ఉపసర్గతో క్రియావాచకము కలిసియున్నను, వాని రెంటిపైనను విడిగా ఉదాత్తము సూచింపబడియుండును. ఇదిపొరపాటనియే భావింపబడవలయును.

క్రియాజన్య విశేషణములు, అసమాపక క్రియలు, సమాపక క్రియలు మొదలగునవి ఉపసర్గలతో చేరియుండినచో, సాధారణముగా, ఉపసర్గ తన స్వరమును కోల్పోవును. దీనికి అపవాదములు.

(i) కొన్ని భూతార్థక కర్మణ్యసమాపక క్రియలు.
ప'రేత; అంత'ర్హిత; అ'వపన్న; సం'పూర్ణ; ...

(ii) తు అంతమునగల క్రియాజన్య విశేష్య విభక్తులు.
సం'హర్తుమ్; అ'పిధాతవే; అ'పగన్తోః; ...

II సమాసపదములలో స్వరము.

సమానపదములలో ఒకటికంటె నెక్కుడు పదములున్నను, స్వరవిషయమున అన్నియును కలిసి ఒకే పదముగా భావింపబడును.

(i) పౌనః పున్యమును సూచించు సమాసపదములలో మొదటి పదముపైననే యుదాత్తము ఉండును. పదపాఠములో నీరెండు పదములును అవగ్రహము చే విడదీయబడియుండును.

ఉదా॥ అ'హర్-అహర్ (దినదినము); య'ద్యద్ (ఏది యేది);

య'థా-యథా (ఎప్పుడెపుడు); ప్ర'-ప్ర; పి'బ-పిబ; ...

(ii) మొదటిపదము క్రియాజన్య విశేష్యమగుచో తప్పక దాని చివరి యక్షరముపైననే ఉదాత్తము ఉండును. (అపవాదము, శిక్షా-నర')

ఉదా॥ త్రస'-దస్యు; తర'ద్-ద్వేషః ;...

మొదటిపదము ఉపసర్గయైనచో దానిపైననే ఉదాత్తముఉండును.

అభి'-ద్యు; ... ... ఐతే రెండవపదము అకారాంతమగుచో దాని చివరి యక్షరముపై ఉదాత్తము ఉండును.

ఉదా॥ అధన్-పద'; అను-కామ'; ...

(iii) బహువ్రీహి (Possessive) సమాసములలో మొదటి పదముపైననే ఉదాత్తము ఉండును.

ఉదా॥ రా'జ-పుత్రః (రాజు పుత్రునుగాగలవాడు) ఐతే రాజ-పుత్ర'ః : రాజుయొక్క పుత్రుడు.

ఇట్లే విశ్వ'తో-ముఖ; సహ'-వత్స

సూచన :—

వేదములోని బహువ్రీహి స'మాసములలో సుమారు ఎనిమిదవ వంతునకు ఉదాత్తము రెండవపదముపైనుండును. ఇది సాధారణముగా, మొదటి పదము రెండక్షరములుగలిగి, ఇ, ఉలు అంతమునగల విశేషణముగానున్నప్పుడు సంభవించును. ఇట్టివి :

తువి-ద్యుమ్న'; విభు-క్ర'తు; పురు-పుత్ర' ... మొదలగునవి. ఇగాక మొదటి పదము అ, అన్, ద్వి, త్రి; సు; దు'ష్; ఐన తప్పక యుదాత్తము

రెండవపదముపైననే యుండును. ఇట్లు అ-ద'న్త్; అ-ఫల'; ద్వి-ప'ద్; త్రి-నా'భి; సు-భ'గ; ...

(తరువాత ఉద్భవించిన సంహితాభాగములో సాధారణ నియమమే అనుసరింపబడినది ఇట్లు సామవేదములో పురు'-నామన్ వంటి ప్రయోగములు బహుళములు)

(iv) (అ) తత్పురుష సమాసములలో రెండవపదము యొక్క చివరి యక్షరముపైననే ఉదాత్తము ఉండును ఇట్లు—

గో'త్ర-భి'ద్; అగ్నిమ్-ఇన్ధ'; భద్ర-వాది'న్; ఉద-మేఘ'-, ఐతే రెండవపదము, అన అంతమునగల కర్త్రర్థకనామవాచకముగాని, 'య' అంతమునగల విశేషణముగాని యైన దాని (రెండవ పదముయొక్క) ధాతువులోని యచ్చుపై ఉదాత్తముండును.

ఉదా॥ దేవ-మా'దన; అహి-హ'త్య; పథి-ర'క్షి; సోమ-పా'వన్;...

(ఆ) ఈ క్రింది పరిస్థితులలో మొదటిపదముపైన ఉదాత్తము ఉండును.

(1) రెండవ పదము భూతార్థక కర్మణ్యసమాపక క్రియయైనచో— ఉదా॥ దేవ'—హిత;

(2) రెండవ పదము ప'తియైనచో ఉదా॥ గృహ'-పతి; (ఐతే తరువాత వచ్చిన సంహితా భాగములలో మామూలు స్వరము-అనగా మొదటి పదముపైననే-యుండును).

(3) మొదటిశబ్దము షష్ఠీ విభక్తికి సంబంధించినదియు, రెండవ శబ్దము పతి' శబ్దమును ఐన, రెంటిపైనను ఉదాత్తము ఉండును ఇట్లు: బృ'హస్-ప'తి; స'దస్-ప'తి; వ'నస్-ప'తి: ర'థస్-ప'తి. జా'స్-ప'తి; శ'చీ-ప'తి;...ఇట్టివే ఇతరములు: అపా'మ్-న'పాత్; న'రా-శ'ంస; శు'నః-సే'ప; త'నూ-న'పాత; నృ'-శ'ంస;...మొదలగునవి.

(4) కొన్నికొన్ని తత్పురుష సమాసముల యుదాత్త స్థానములు మార్చుటచే బహువ్రీహిస మాసములగును.

ఉదా॥ రాజపు'త్రః = రాజుయొక్క పుత్రుడు.

రా'జపుత్రః = రాజపుత్రుడుగా కలవాడు.

యజ్ఞకామ' = యజ్ఞమునందలి కోరిక
యజ్ఞ'కామ = యజ్ఞకామము గలిగియున్న.

(5) కర్మధారయ సమాసములోని రెండవ పదముయొక్క చివరి యచ్చుపైననే ఉదాత్తము ఉండును.

ఉదా॥ ప్రథమ-జా'; ప్రాతర్-యు'జ్; మహా-ధన'; కాని రెండవ పదముయొక్క చివరన ఇ, మన్, వన్ ఉండిన చివరి యక్షరమునకు ముందున్న యక్షరముపై ఉదాత్తము ఉండును.

ఇట్లు:—

దుర్-గృ'భి; సు-త'ర్మన్; రఘు-ప'త్వన్;...

ఐతే ఈ క్రింది పరిస్థితులలో మొదటి పదముపైననే యుదాత్తము ఉండును.

(6) విరుద్ధార్థకములగు పొడులు అ లేక అన్‌తో నేర్పడు సమాస పదములలో పొడులపైననే యుదాత్తము ఉండును. ఇట్లు:

అ'-విద్వాంస్; అ'-కృత; అ'న్-అదన్త్; అ'-తంద్ర; అ'-కుమార;

అ'న్-అశ్వదా; అ'న్-అగ్నిదగ్ధ; ...

(దీనికి అపవాదములు అ-జ'ర; అ-మి'త్ర; అ-మృ'త;)

(అ) మొదటి పదము క్రియా విశేషార్థకమై, రెండవది భూతార్థక కర్మణ్య సమాపక క్రియగాని, 'తి'తో అంతమగు క్రియాజన్య విశేష్యముగాని యగుచో మొదటిపదముపైననే యుదాత్తముండును.

ఇట్లు: దు'ర్-హిత; సధ'-స్తుతి.

(vi) మామూలు ద్వంద్వసమాసములలో ప్రకృత్యంతముపై ఉదాత్తము ఉండును (రెండవపదముయొక్క స్వరమెట్టిదైనను)

ఇట్లు: అజావ'యః, అహో-రాత్రా'ణి. ఇష్టా-పూర్త'మ్, ...

ఐతే

(అ) అరుదుగావచ్చు క్రియా విశేషణార్థకములగు (adverbial) ద్వంద్వములలో ఉదాత్తము మొదటిపదముపై నుండును. ఇట్లు :—

అ'హర్–దివి (ప్రతిదినమును): సాయ'మ్–ప్రాతర్ (సాయంత్రము ఉదయమును)

(ఆ) దేవతాద్వంద్వములని చెప్పబడు ద్వంద్వసమాసములలో ఉభయ పదములును ఉదాత్తముల వహించును. రెండును ద్వివచనముననే యుండును. ఇట్టివి.

ఇ'ంద్రా-వ'రుణా; సూ'ర్యా-మా'సా ; ...

దేవతాద్వంద్వములు కాకపోయినను ఇట్టివే మరి కొన్ని; తుర్వశా'— య'దూ; మాత'రా—పిత'రా; ...